# భారతి

జూలై 1971



వ్యవస్థాపకులు

దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు

---

వెల ఒకరూపాయి

# భారతి

మాసపత్రిక



సంపాదకుడు :

శివలెంక శంభుప్రసాద్



జూలై 1971



సంపుటము : 48 : సంచిక : 7 :

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## జూలై 1971

# దివాంధము

## శ్రీ బెల్లంకొండ చంద్రమౌళి శాస్త్రి

కారికి తాకు రాయి యని గాని, మనస్సులు నవ్వకొంద్రు కా
బోలని గాని, మైత్రవము పోకడ లేకడ నేని ద్రుంగు నే
మో లవ మంచు గాని, తలపోయని నీ యురుకుల్ పరుంగులున్
ఏలనొ జూడ జాలరని యే చని యేమి దివాంధ కామనన్—!

నా బ్రదుకేమొ నాదని వినాస్పృజనాపఘనాత్మనీన సం
ధ్యా బ్రుసి యెవ్వడో విగళితాంతరవేద్యసముద్యతుండు తా
నీ భ్రమరింపు లార్పుటకు నేనియు చాలునొ! వ్యాకులమ్ములౌ
ఈ బ్రదుకుల్ జగానగవులేమి యెరుంగక కండ్లు మోడ్చుటా!!

నేనును స్వప్నవాసములనే సుఖనిద్ర నెరుంగబోని దీ
నానన మెత్తి నా గళ నినాద వివాదము నం దపశ్రుతుల్
ˇ నని వాడనై—జగము గానని వాడనునై—ఇటేల వాం
ఛా నవ నందనమ్ముల విచారము సేయుదు! నంది వచ్చునా!!

నీ వెంతో మరి నేను నంతెకద! అంతేలేని ఆశా నిశా
గ్రావం బట్టులు జన్మలో చిగురె లేకన్ భావభారంబుతో
నేవేళన్ తన భాష్పధారలను తానే ద్రావి జీవించు టే
వేవో నర్థముగాని—లేని—పదముల్ వేబాడి కేడించుటే !!

శ్లాఘాలంఘనజాంఘికాధ్వగమనస్తత్వంబు గన్నారు నీ
యూ ఘోషంబెవరోయి విందురని! అంధ్యప్రత్యయం బట్టిదే—
నీ ఘర్మంబిక నీదు కర్మ మనుకోనేరాదు పో! సుప్రసా
దాఘారంబగు వెల్గులే పడని రమ్యాలోక మేలాగునో !!

---

# ఆముక్తమాల్యద - ఆశ్వాస సంఖ్య

శ్రీ నిడుదవోలు వెంకటరావు

అద్యతన కాలమున అభినవ మల్లినాథులని ప్రఖ్యాతికెక్కిన కీ. శే. వేదము వేంకటరాయ శాస్త్రిగారు క్రీ. శ. 1927 లో ఆముక్త మాల్యదను తమ సంజీవనీ వ్యాఖ్యతో ఏడాశ్వాసముల గ్రంథముగా ప్రకటించియున్నారు. అంతకుముందు ప్రచారములోనున్న వావిళ్ల ముద్రణమున[1] ఆఱాశ్వాసములే యుండగా, శాస్త్రులవారా గ్రంథము నేడాశ్వాసములుగా ముద్రించుటకు హేతువును వారెచ్చటను నిరూపింపలేదు. అందువలన సాహిత్య లోకమున జిజ్ఞాస ప్రారంభమైనది.

ఆముక్త మాల్యదలో ఆఱాశ్వాసములే యుండవలెనని, ఏడాశ్వాసములు లేవని హయవదనరావుగారు చర్చించిరి[2]. కీ. శే. దేవరపల్లి వేంకటకృష్ణారెడ్డిగారు తమ 'ఆంధ్రసాహితీ సార్వభౌముడు' అను గ్రంథమున నింద ఆఱాశ్వాసములేయని నిర్ణయించిరి.

ఇప్పటి కెనిమిదేండ్ల క్రిందట నేనా గ్రంథమును విమర్శించుచు నిట్లు సందర్భానుసారముగా వ్రాసియున్నాను.

'సంజీవని వ్యాఖ్యతోగూడ ఆముక్తమును శ్రీనాథుని నైషధమువలె తిరిగి ప్రకటించుటలో వారు (పౌత్రులు వేంకటరాయశాస్త్రిగారు) వెనుదీయరు. ఏలననగా వారి తాతగారితో ప్రాచీన గ్రంథ పరిష్కరణ విధానము వేదముగా పరిణమించినదని వారి భావన. (భారతి అక్టోబరు 1963. గ్రంథ విమర్శనము. పుటలు 84—87.)

నేను పైన వ్రాసిన ట్లక్షరాలా జరిగినది. ఆ మరుచటి సంవత్సరమున అనగా 1964 లో వారి పౌత్రులు వేంకటరాయశాస్త్రిగారాముక్త మాల్యద సంజీవని వ్యాఖ్యను, తూచా తప్పక తిరిగి ముద్రించినారు[3]. దీని నిటీవలనే నేను చూచుట తటస్థించినది. వారు దీనిని 'ఈ ముద్రణము వట్టి పునర్ముద్రణమే' అన్నారు[4].

## వ్రాతప్రతులు - బ్రౌనుదొరవారు

ముద్రితప్రతులకు వ్రాతప్రతులే మూలమని యందఱెఱిగినదే. తక్కిన ఆంధ్రగ్రంథములవలె, ఆముక్తమాల్యద వ్రాతప్రతులను సేకరించి, పాఠభేదములు సూచించి సంస్కరించి దానిని ముద్రణయోగ్యమునొనర్చినది బ్రౌనుదొరగారే. మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున -05 వ సంఖ్యగల ప్రతిలో - బ్రౌనుదొరవారి స్వహస్తముతో నిట్లున్నది.

'Amuktamalyada-This manuscript has been corrected by the very learned critic zuluri Appaya in 1834. The third book of the poem is wanting'

---

1. ఆముక్తమాల్యదను వావిళ్లవారుతప్ప మఱెవ్వరును ముద్రింపలేదు. క్రీ. శ. 1927 నాటికి నాలుగు ముద్రణములను వారే ప్రకటించినారు. ఆ వివరములు.

| | | |
|---|---|---|
| ప్రథమ | ముద్రణము | 1869 |
| ద్వితీయ | ,, | 1886 |
| తృతీయ | ,, | 1909 |
| చతుర్థ | ,, | 1914 |

2. The Cantos of Amuktamalyada- C. Hayavadana Rao—ఆంగ్లము.

వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రి షష్టిపూర్తి సంపుటము. 1948.

3. ప్రకటనకర్తలు వేదము వేంకటరాయ శాస్త్రి అండ్ బ్రదర్సు—మద్రాసు. వెల 30 రూ.

4. ఉపోద్ఘాతము—పుట 6.

ఈ ప్రతిలో ఆఱాశ్వాసములే యున్నవి.

సంజీవని వ్యాఖ్యానము వ్రాసిన వేంకటరాయ శాస్త్రులవారు బ్రౌనుదొరవారి ప్రతుల నెఱుగనివారు కారు. వారే ఉపోద్ఘాతములో ప్రారంభమున నిట్లు వ్రాసియున్నారు.[5]

'ఈ ప్రబంధరాజము సుబోధముసేయుటకై ఆధునికులలో నత్యుత్తమకృషి కానించినవారు మచిలీబందరుజిల్లా జడ్జి సి. పి. బ్రౌనుదొరగారు. వారికి తోడ్పడిన మహాపండితులు మను వస్వాది ప్రబంధ వ్యాఖ్యాతలు జూలూరి అప్పయ్యపంతులువారు.'

పై యుదాహృత భాగమున — బ్రౌను, జూలూరి అప్పయ్యపంతులుగార్ల పేర్లుండుటవలన—వేంకటరాయ శాస్త్రిగారికి పైని నేను సూచించిన—ఆఱాశ్వాసములు గల ప్రతినిగూర్చి తెలిసియుండుట నిశ్చయము. అయినను వారు దీని నేడాశ్వాసములుగానే ముద్రించినారు. దీనిని బట్టి వారు బ్రౌనుదొరవారి ప్రతి ననుసరింపలేదనుట స్పష్టము.

### ఆముక్తమాల్యద శబ్దసూచి

బ్రౌనుదొరవారే తమ స్వంతఖర్చులపై ఆముక్తమాల్యద కొక శబ్దసూచి తయారుచేయించి నారు. అందును ఆఱాశ్వాసములే యున్నవి. అది ఈనాటి వారి కపరిచితమగుటచే, వివరము లిచ్చుచున్నాను.

'A verbal index to every word in the celebrated Telugu Poem Amuktamalyada or Vishnuchittiyamu compiled at the expense of Charles philip Brown, Civil Service—Telugu Translator to the Government of Madras—1849'

ఇం దాఱాశ్వాసములే యున్నట్లు కొన్నియుదాహరణలు. (సంఖ్య 423).

అంకకన్ ష. 62.
అంకము ష. 62
క్ష్మాజమున్ ష. 15.
ష. అనగా షష్ఠాశ్వాసము.

మదరాసు ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారమున పై బ్రౌనుదొరవారి ప్రతులుగాక—392 నుండి 401 వఱకు తొమ్మిది తాళపత్ర ప్రతులున్నవి. వానిలో 392 నుండి 397 వఱకుగల 6 ప్రతులు సమగ్రమైనవి. వాని అన్నింటిలోను—ఆఱాశ్వాసములే యున్నవి.

### తంజావూరి ప్రతులు

మదరాసులోనేగాక, తంజావూరి సరస్వతీమహలులోను ఆముక్తమాల్యద వ్రాతప్రతులున్నవి. అవి 131 నుండి 136 వఱకు ఆఱు ప్రతులు గలవు. వానిలో ఒకటి అసమగ్రము—తక్కిన అయిదింటిలో—ఆఱాశ్వాసములే గలవు.[7]

### వ్యాఖ్యలు - వ్రాతప్రతులు

ఆముక్తమాల్యద ప్రౌఢతమమైన రచనకలది కాబట్టి వ్యాఖ్యలు కృతి యవతరించిన నూరేండ్ల నాటినుండి యనగా క్రీ. శ. 16 వ శతాబ్దినుండి వెలసినవి.

#### 1. చిత్రకవి అనంతకవి

'విష్ణుచిత్తీయాది వివిదార్థసంగతుల్
దెలిసి వక్కాణించు ధీయుతుండ'—

అని వ్రాసికొన్నాడుగాని, అతని వ్యాఖ్యాన మేదియు లభింపలేదు.

#### 2. గుడిపాటి వెంకటకవి: తాత్పర్య బోధిని

ఈ సంపూర్ణవ్యాఖ్యానము క్రీ. శ. 1650 ప్రాంతమున రచితమైనది. వెంకటకవి నందవరీ

---

5. ఏతద్వ్యాఖ్యాప్రశస్తి. పుట. 1.

6. ఈ శబ్దసూచి — ఆముక్తమాల్యదతో కూడ ముద్రితమైనది. ఆముక్తమాల్యదలో నేటి నిఘంటువున కెక్కని తత్సమపదములు చాలాగలవు. అనాడు బ్రౌనుదొరవారు తమ స్వంతఖర్చులతో మన కొఱకై వ్రాయించినవి మన ముపయోగించకపోవుట మన మా మహనీయునికిచేయు నపచారమేగాని వేఱు గాదు.

7. తంజావూరి పుస్తకభాండాగారమీ తెలుగు పుస్తకముల పట్టిక—పుట 15.

కుడు. హరితసగోత్రుడు. కిచ్చనామాత్యుని పుత్రుడు. ఈతని కృతియందు దాఱాశ్వాసములే గలవు. ఆశ్వాసాంత గద్య యిది.

'ఇది శ్రీ సూర్యనారాయణాది నవగ్రహ దేవతా ప్రసాదాతిశయ సాదితాభ్యుదయ పరస్పరాభివృద్ధిమత్సం పూర్ణాత్రేయగోత్రపవిత్ర నందవరవంశోత్తంస కృష్ణ పాటిచ్ఛాయాపతి ప్రథానానుజ చెన్నప్పప్రధానతనూ భవ నిత్యాన్నదానవినోద నానవద్య విద్యాపరశీన చతురతరనిశ్శంక వెంకటపతి ప్రధానైణాంక సంక ల్పానురూప శ్రీ హయగ్రీవదేవప్రసాద సమర్థిత సంస్కృతాంధ్ర ప్రబంధనిబంధ నాపస్తంబ సూత్ర హరితసగోత్ర గుడిపాటి కిచ్చనామాత్యపుత్ర వేంకట కవీంద్ర విరచి తాముక్తమాల్యదాప్రబంధ తాత్పర్య బోధినీ సమాఖ్య ప్రఖ్యాతవ్యాఖ్యానంబునందు సర్వం బును షష్ఠాశ్వాసము.'[8]

ఈ కవినిగూర్చి, ఈ వ్యాఖ్యనుగూర్చి వేంకట రాయశాస్త్రులవారికి తెలియలేదనుటకు వీలులేదు. వారే ప్రథమముద్రణమున పీఠిక 'ఉపసంహారము' అను పీఠికలో నిట్లు వ్రాసినారు. (69 వ పుట).

" 6) గుడిపాటి వెంకటకవి యను ప్రాచీన పండితుడు, ఆముక్తమాల్యదకు టీక వ్రాసెననియు అందు ఉపోద్ఘాతమున నిట్లున్నదనియు, ఆంధ్రపత్రిక 1916–28. ఆ."

దీనినిబట్టి పెద్దన కర్తృత్వ సమర్థనకొఱకు మాత్రమే, ఈ వెంకటకవి టీక నుదహరించిరనియు, నదియు పత్రికననుబట్టియే యనియు, వారాగ్రంథము చూడలేదనియు స్పష్టము.

### 3. బుధమనస్తోషిణీ వ్యాఖ్యానము : ఉప్పలపాటి జోగిజగన్నాథరాజు

ఇది క్రీ. శ. 1813 లో రచితమైనట్లుగా వ్యాఖ్యానాంతమందలి యీ క్రింది పద్యము తెలుపు చున్నది.[9]

'శరవహ్న్యద్రి శశాంక సంఖ్య
శకవర్షంబింపుగా శ్రీముఖా
ఖ్య రహిన్ వర్ధిలు మాఘ శుక్ల
విదియం దా విష్ణుచిత్తీయ భూ
సుర సన్మానిత వాగ్విలాస
కృత వి జోగ్గి జగన్నాథరా
డ్ధరి వాల్లభ్యత టీక యొప్ప
ఘహియం దాచంద్రతారార్కమున్.

(శర. 5. వహ్ని. 3. అద్రి. 7. శశాం. 1. శా. శ. 1735 + 78 = 1813. క్రైస్తవశకము.)

ఈ వ్యాఖ్యానమునందును నాఱాశ్వాసములే యున్న ట్లీక్రింది పద్యము తెలుపుచున్నది.

జోగి జగన్నాథరాజు కృష్ణరాయలవలె, తన వ్యాఖ్యాశ్వాసాంతములలో గద్యను పద్యరూపముగానే వ్రాసియున్నాడు—

'ఇది గోకర్ణశయానపత్కజ
మనోజ్ఞేందిందిరీభూతహృ
త్పుదురావేద్య మహార్థబోధ
విలస జోగ్గి జగన్నాథ భూ
సుదతీవల్లభనామ కావ్య
దుదితాసోత్కార్థదాముక్తమా
ల్యద టీకావర మొప్పు షష్ఠము
మనోజ్ఞాశ్వాస పద్యంబులన్
దీనినిబట్టి యందా ఱాశ్వాసము లనుట స్పష్టము.

### 4. ఆముక్తమాల్యద సటీకము

ఈ టీకాకారుని పేరులేదు. ఇందు అయిదు ఆఱాశ్వాసములు గలవు. ఆఱవ యాశ్వాసముతో గ్రంథము సంపూర్ణము అని కలదు. ఇది ముద్రి తమే. గ్రంథసంఖ్య డి. 421.

---

8. అముద్రితము. ప్రాచ్యలిఖితపుస్తకభాండా గారము. త్రైవార్షిక పుస్తకసూచి—ఆఱవ సంపు టము—సంఖ్య R. 1005.

9. అముద్రితము. ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము. వివరణాత్మక గ్రంథసూచి, ప్రబంధ ములు సం. 2. సం. 405. పుట. 495. దీనికి 406 నుండి 411 వఱకు 5 అసమగ్రప్రతులు గలవు.

ఇట్లు వ్రాత ప్రతులయందు, వ్రాత ప్రతుల లోనే యున్న టీకా వ్యాఖ్యానముల యందును, ఆఱా శ్వాసములే యుండగా, డాక్టరు నేలటూరి వేంకట రమణయ్యగారు 'నైరామన' శబ్దమునుగూర్చి చర్చించు సందర్భమున నిట్లు వ్రాసిరి. (ఈ ముద్రణ మునసే 695 పుట.)

'ఆముక్తమాల్యద యేడాశ్వాసముల గ్రంథ మని పెక్కు వ్రాత ప్రతులయందు జెప్పియున్నది.'

ఈ వాక్యము సుతరాము అసంబద్ధము.

నిఘంటువులు

ముద్రితమైన నిఘంటువులలో బ్రౌనుదొర గారి నిఘంటువున ఆముక్తమాల్యద ఆఱాశ్వాస ముల కృతిగానే పరిగణితమైనది.

తక్కిన నిఘంటువులలోను ఆముక్తమాల్యద ఆఱాశ్వాసముల ప్రబంధముగానే పరిగణింపబడినది. నేడు మనకు ప్రామాణికమైనది శబ్దరత్నాకరము. ఈ నిఘంటువు గ్రంథసంకేతాదివివేచనపట్టికలో నిట్లున్నది. (పీఠిక—పుట XIV)

శీర్షికలు — గ్రంథసంకేతములు — గ్రంథముల నామములు—గ్రంథములయందలి ఆశ్వాసాదులు.

ఆము ఆముక్తమాల్యద (విష్ణుచిత్తీయము) ఆ 6.

గ్రంథకర్తల నామములు గ్రంథకర్తల తరగతులు
కృష్ణరాయలు (అవి 6.) 4.

శబ్దరత్నాకరకర్తలగు బహుజనపల్లి సీతారామా చార్యులవారు స్పష్టముగా ఆముక్తమాల్యదలో ఆఱాశ్వాసములే యున్నవని తెలిపారు. అంతేకాదు ప్రస్తుత ముద్రణములో ఏడవ ఆశ్వాసములోని పద్య ముల నన్నింటిని ఆఱవ అశ్వాసముగానే గ్రహించి నారు. ఈ విషయము విశదముచేయుటకు అందుండి కొన్ని పయోగములను చూపుచున్నాను.

పుట 416. నయ. దే. వి. అందము.

సీ. నయకలగ్రేళ్ల నుట్రియలుఁ బిల్లాండ్లిడి
పాయవట్టముఁ బెట్టెఁ బడఁతియోర్తు.

ఆము. 6 ఆ.[10] (దీని మొదటి రూపము నయము.)

వావిళ్ల ముద్రణమున—6—12.

ప్రస్తుత ముద్రణమున-నిది 7 వ ఆశ్వాసము 64 పద్యము.

సీ. పా. నయకలగ్రేళ్ల మట్టియలుఁ బిల్లాండ్లిడి
పాయవట్టముఁ బెట్టెఁ బైనొకర్తు.

ఇచట పాఠముగూడ భేదించినది. సీతారామా చార్య పాఠము — 'పడఁతియోర్తు'. ముద్రణపాఠము 'పైనొకర్తు'[11]. 'పైనొకర్తు' అనుటకంటె, 'పడఁతి యోర్తు' అనియే యుండదగును. మొదటి పాదమున 'అతివయోర్తు', మూడవ పాదమున 'వెలదియోర్తు' అని యుండుటచే, రెండవపాదమున—'పడఁతియోర్తు' అనియే యుండవలెను.

పుట 444. నెట్టికసీల. వై. విణ. సదాచార సంపన్నమగు స్వభావము గలది.

ఉ. నెటన యల్ల లచ్చి యల
నీళల భూసతియుండ నీవు నీ
నెట్టికసీలపై మనసునిల్పుట కేమనవచ్చు.

ఆము. 6. ఆ.

వావిళ్ల. 6—111.

ఇందు 7 వ ఆశ్వాసము 47 వ పద్యము.

'నెట్టికసీలపై మనసునిల్పుట కేమనవచ్చు' అని పాఠము.

---

10. శబ్దరత్నాకరమున — ఆశ్వాస సంఖ్యయే గాని పద్యసంఖ్య యుండదు. శబ్దరత్నాకరమున్ననేగాక, సూర్యరాయ, వావిళ్ల నిఘంటువులయందు ఆముక్త మాల్యద ఆఱాశ్వాసముల గ్రంథముగానే యున్నది.

11. ఆముక్త మాల్యద పాఠములను, శబ్ద రత్నాకర పాఠములతో సరిపోల్చి నిర్ణయించవలసిన యావశ్యకత చాలా యున్నది. ఈ ముద్రణమున పెక్కుచోట్ల శబ్దరత్నాకర పాఠములు సంప్రతింప బడి యున్నవి. ఈ పద్యమున 'పడఁతియోర్తు' అను పాఠము సూచితము కాలేదు.

ఇచట 'నిల్పుటకు' అను క్రియకు కర్త మనసుకాదు. కర్త నీవు. కాబట్టి 'మనసు నిల్పుట' అనియే యుండవలెను.

శ. ర. పాఠము సరియైనది—12.

పుట 749. ప్రప్రా. వై. వి. టీక.

సీ. తలఁబ్రాలు గుమియు ప్రప్రాలఁ బాత మసియిడి
యంబలి గంపెండ్ల నడుగువారు.

ఆము. 6 ఆ.
వావిళ్ల—6—85.

ఇందు. 7 వ ఆశ్వాసము 21వ పద్యము.

పై యుదాహృతులనుబట్టి ఆముక్తమాల్యదలో ఆఱాశ్వాసములే యున్నవని నిశ్చయముగా చెప్పవచ్చును. ఈ సందర్భమున నొక విశేషమున్నది. వేంకటరాయశాస్త్రులవారు శబ్దరత్నాకరముగాని, శబ్దరత్నాకరకర్తలగు సీతారామాచార్యులవారినిగాని యెఱుగనివారుకారు. శబ్దరత్నాకరము నెదుగడుగునను తమ వ్యాఖ్యయం దుదాహరించియేయున్నారు. అంతేకాదు వారినిగూర్చి ప్రశంసించినారు.

'ఆముక్తమాల్యద గూఢార్థప్రకాశనమునకై అత్యంతమైనకృషి కావించిన మహావిద్వాంసులలో కీర్తిశేషులు వర్తమాన శతాబ్ది నన్నయాచార్యులవారు శబ్దరత్నాకర నిఘంటు నిర్మాణ కర్మఠులు బహుజనపల్లి సీతారామాచార్యులవారు'. (ఉపోద్ఘాతము ప్రారంభము.)

ఇంత గొప్పగా తమ గురువులని[13] ప్రశంసించిన వేంకటరాయశాస్త్రులుగారే, తమ గురువులు ప్రకటించిన శబ్దరత్నాకరమున — ఆఱాశ్వాసములుండగా, తామీ గ్రంథమును, ఏడాశ్వాసములుగా నెట్లు ముద్రించిరో దురూహ్యముగానున్నది. ఇంతవఱకు ముద్రణములోని ఏడవ ఆశ్వాసము తాము చేర్చినపుడు శాస్త్రులవారే తా మే వ్రాతప్రతి నాధారముగా నెసికొని, ఆ రీతిగా ముద్రించిరో, ఆ ప్రతి వివరముగాని, ఆ విషయమునుగూర్చిగాని కొంత తెలిపి యుండవలసినది. కాని యట్టిదేమియు వారు తెలిపి యుండలేదు.

## ఆముక్తమాల్యద—
## ఏడవ ఆశ్వాసము

ఆముక్తమాల్యదలో ఆఱవయాశ్వాసమున ప్రసిద్ధమైన మాలదాసరికథ గలదు. అందు 136 గద్య పద్యములు గలవు గాని ప్రస్తుత ముద్రణమున మాలదాసరికథలో 66 వ వచనముతో నాఱవ ఆశ్వాసము ముగిసినది—ఆశ్వాసాంతమున

శా. అజ చౌర్యాపహృతాత్మ తోక సముదా
యాభీర కాంతామణీ
వ్రజగోరాజిమనః ప్రమోదకర తద్వ
త్సాస్త్రరూపానురూ
ప జనిప్రాభవ ద్రౌణిజోదర కన
ద్భ్రూణాగ్ని వృత్తిప్రకో
ప జలాసార సరోజ బాంధవ శశి
ప్రాంచ ద్విశాలాంబకా. 67.

క. అనవరత నవ రతాదృత
వినుత ప్రేమాత్తవల్లవీజనజాలా
వనౌన పరవాని మానస
వన వసిత్వ మరాళవర సువాసితమూర్తీ. 68.

ఉత్సాహ. నలముఖాదిచక్రవర్తి నాథ నవసమర్పితా
త్యలఘు మకుట ముఖ్యహార్యపేయనాయనావిలా
జిల సురారిహరణ నిజ వశీకృతాఖిలాండ ని
ర్మలగుణా! యమేయరూప రంజితార్యపోషణా.

గద్య.మ. ఇది నైరామన యావనావనిధవా
హీనాభ్రచుంబిస్ఫుర
ద్విదితాభీలమణిస్ఫురాళి దళనో
ద్వేలోగ్ర హస్తివ్రజో
ద్య దసీకాగ్రగ కృష్ణరాయ

12. ఇందును శ. ర. పాఠ ముదాహృతము కాలేదు.

13. వేంకటరాయశాస్త్రులవారు సీతారామాచార్యులవారివద్ద చదువుకొనుచున్న మొదటి రోజులలో వారి నెదురించుచుండెడివారట—తరువాత వారి తండ్రిగారైన వేంకటరమణశాస్త్రులవారు, సీతారామాచార్యులవా రాంధ్రభాషలో మహావిద్వాంసులని చెప్పగా, నాటినుండియు వారియందు భక్తిప్రపత్తు లేర్పడినవి (మా. వేదము వేంకటరాయశాస్త్రి జీవిత చరిత్ర.)

మహాభృ త్సంజ్ఞాస్మదాముక్తమా
ల్యద నాశ్వాసవరేణ్య మాఱవది
హృద్యంబైన పద్యంబులన్.[14] 70.

అను పద్యములున్నవి.

ఏడవ ఆశ్వాసమున మాలదాసరికథలో మిగిలిన భాగము అనగా 66 వచనమునుండి గ్రంథాంతము వఱకుగల కథగలదు. కాని యిది యాశ్వాస ప్రారంభముగాన, ఒకటినుండి ప్రత్యేక సంఖ్య లీయబడినవి.

సప్తమాశ్వాసమున ప్రారంభ పద్యమిది.

క. శ్రీమదుమా సులభాంగక
సామజహర నక్ర దళన చక్ర సదాళీ
క్షేమంకర చరణాంబుజ
హైమోజ్జ్వలవాస! వేంకటాచలరమణా

ఆశ్వాసాంతమున—

సీ. తే. సహ్యకన్యాతటోద్యాన చందన ద్రు
కుంజములఁ గేళకుంతల గుస్తరించి
కంతు సామ్రాజ్య మేలించి కరుణఁ జిత్త
మొలయ జగములఁ బాలించుచున్నవాఁడు. 71.

అను కథాసంబంధ పద్యము చివరగలదు. దాని తరువాత

స్కందసరస్సరసీరుహకందరచందనకుందవాటికా
మందసమీరలోలనవహాలిక నిర్మలదివ్యవిగ్రహా
స్పందవిభాధరీకృతనభస్ఫుటకాళిక వల్లవాంగనా
బృందమనోభిమాన ధృతిభేదన పేశలవంశవాదనా 72

క. అరిధారాఖండితమురు
దరిసంఘ విహంగవాహనా యుదరవహాం
బురుహపుటభరిత మధుశం
బరభర జలమానుషేయమాణ ద్రుహిణా. 73

స్రగ్విణి. వారినిర్భేదనా వారిజాతేక్షణా
శైలకన్యాస్తుతా శార్ఙ్గచండద్భుజా
ఫాలదృక్పద్మభూ పాకభేదిస్ఫుర
న్మౌళి మాణిక్యరుఙ్మండితాంఘ్రిద్వయా. 74

గద్య. ఇది శ్రీ నీలాచల నీలమేలక సుభద్రేందీవరాభాక్షికో ణదృగంచద్భుజవీర్యధుర్య జయసన్నాహోర్బటీవాద్య భీత్యుదితేభేశ్వర కృష్ణరాయ మహీజాన్యుత్పాదితాముక్తమా ల్యద నాశ్వాసము సప్తమంబలరు హృద్యంబైన పద్యంబులన్. 75

అనునవి కలవు.

ఇట్లు ప్రత్యేకముగా, ఆశ్వాసాద్యంత పద్యము లుండుటచేత, ఈ విభాగముగల వ్రాతప్రతి యేదియో యొకటి శాస్త్రులవారి కాధారమై యుండవలెను. వారట్టి ప్రతి విషయమై ఏమియు తెలుపలేదు. అయినను, వారి కాధారమైన వ్రాతప్రతి నేడు లభ్యమగుచున్నది. అది

## గట్టుపల్లి శ్రీనివాసకవి

—వ్యాఖ్యానముతో కూడిన ఆముక్త మాల్యద—

గట్టుపల్లి శ్రీనివాసకవియను నత డాముక్త మాల్యదకు వ్యాఖ్యానము వ్రాసియున్నాడు. దీని సమగ్ర ప్రతి మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకశాలలో నున్నది. దాని సంఖ్య డి. 412. ప్రారంభము

ఉ. శ్రీసతి చక్తపోషణము
సేయఁగఁబూని తదీయదోష భూ
మా సహనంబు నేఁ గుపితుఁ
డౌనని శంకఁ గృపార్ద్ర చిత్తుయై
వేసటలేక వత్సరుణి
వేదిక నొలఁగ యుండి ప్రోవఁగా
భాసిలునట్టి శేషనగ
భర్త భజించెద నిష్టసిద్ధికిన్

చ. ఉరువగు విష్ణుచిత్త తన
యోద్వహనంబును సంస్కృతాంధ్రవా
గ్గరిమ నలంకియా రస స
ఖం బగు నట్లుగఁ బెద్దరాయ్యఁడు
ద్ధురఫణితిన్ రచించె నది
దుర్ఘటబోధము గాన స్థిరన్

14. ముద్రణమున (పుట 647) 67 తరువాత పద్యసంఖ్య సరిగాలేదు. 67 తరువాత తిరిగి 67 ముద్రితమైనది. దానితో తక్కిన రెండింటి సంఖ్యలు తప్పినవి. 67, 68, 69, 70 అని యుండవలెను.

స్థిరమగుచుండునట్లుగను
జేసెద: టీక సవిస్తరంబుగన్.[15]

ఈ వ్యాఖ్యనుగూర్చి ప్రాచ్యలిఖిత పుస్తకశాల వారి వివరణాత్మక పుస్తకసూచిలో నిట్లున్నది.[16]

No. 412 Amuktamalyada with commentary—complete.

'The last Aswasa viz the sixth is herein divided into two separate Aswasas and they are numbered as the sixth and seventh Aswasas. The stanza at the end of this divided sixth Aswasa mentions one Nairaman, a Muhammadan as an enemy of Krishnaraya. The commentary herein found, is written by Gattupalli Srinivasa kavi. He attributes the authorship of the text to Peddanarya, the author of Manucharitra' (P. 499).

"సమగ్రము —వ్రాత యంతవెద్దదిగాదు. తప్పులెక్కువలేవు. శైథిల్యగ్రంథపాతములు లేవు.

ఈ ఆముక్తమాల్యదకు గట్టుపల్లి శ్రీనివాస కవికృతమైన టీక గలదు. ఈ వ్యాఖ్యాత గ్రంథ కర్తృత్వము పెద్దనకి కట్టినాడు.

పూర్వపు ప్రతులలోవలెగాక దీన నాఱవ యాశ్వాసము రెండుగా విభాగించి గ్రంథ మేడాశ్వాసములదిగాఁ జేయఁబడినది. త్రెంపినచోట నాశ్వాసాద్యంత పద్యములు క్రొత్తవి చేర్చుటగాక యితివృత్తాదుల వేఱు మార్పును గానరాదు. అన్ని యాశ్వాసములందును నాద్యంతములకుఁ టీకయు గలదు. ఈ క్రొత్తయాశ్వాసమున కట్లుగాక వట్టిపద్యములు మాత్రమే యున్నవి. వానిలో గద్యాకృతి పద్యమిది.

'ఇది నైరాకున యాసనావళిభవా'.

ఈ పద్యమువఱకే యుదాహరించియున్నాను."[17]

(పుట. 501)

పై యుదాహరించిన భాగములనుబట్టి ఆముక్తమాల్యద, ఏడాశ్వాసముల గ్రంథముగా మార్పుచేసినది గట్టుపల్లి శ్రీనివాసకవియే యనియు, మొదటి నుండి అందేడాశ్వాసములు లేవనియు నిశ్చితమగుచున్నది.

ఇక గ్రంథ మే[18]డాశ్వాసములుగా ముద్రించిన వేంకటరాయ శాస్త్రులవారికి శ్రీనివాసకవి టీక తెలియకపోలేదు. వారే టీక 69 వ పుటలో ఉపసంహారము అను శీర్షికలో నిట్లు వ్రాసియున్నారు.

5. వ్యాఖాతృ పరంపరయు దీనిని పెద్దన కృతమేయనుట.

చ. ఉరువగు విష్ణుచిత్తు తన
యోద్వహనంబును సంస్కృతాంధ్ర వా
గ్గరిమ నలంక్రియారసనఖంబగునట్లుగఁ
బెద్దనార్యుఁ డు
ద్ధుర ఫణితిన్ రచించె నది
దుర్ఘట బోధము గావునన్ ధరన్
స్థిరమగుచుండునట్లుగను
జేసెదఁ టీక సవిస్తరంబుగన్.

—శ్రీనివాస వ్యాఖ్య.'

ఇట్లు శ్రీనివాసకవి వ్యాఖ్య నుదాహరించియు శాస్త్రులవారు అశ్వాసవిభజనమునుగూర్చి సూచన కూడ చేయలేదు. ఈ విషయమింతటితో నాగలేదు. శాస్త్రులవారా వ్రాతప్రతిని చూచియు, దాని ననుసరించి ఏడాశ్వాసములు ముద్రించియు శ్రీనివాస వ్యాఖ్య యందుగల సప్తమాశ్వాసాంతపద్యములలో నేకారణము చేతనో చివరనొక క్రొత్త పద్యము చేర్చినారు. దీని వలన గ్రంథమునకెట్టి యవ్యవస్థ చేకూరినదో చూడుడు.

శ్రీనివాస వ్యాఖ్యలో చివర పద్యమిది.
'ఇది సింహాచల దంభకేసరి పదా

15. ఇది కాగితప్రతి. దీనికి 413 నుండి 419 వఱకు—ఆఱుప్రతులు గలవు. అవి తాళపత్రములు. వానిలో రెండుమాత్రమే సమగ్రములు. తక్కినవి అసమగ్రములు. ఒక్కొక్క ఆశ్వాసముమాత్రమే గలవి.

16 పుటలు 499—501.

Descriptive Catalogue of Telugu Manuscripts—Vol. 11. Prabandhas.

17. ఈ పద్యము శ్రీనివాసకవి టీకలో ఆఱవ యాశ్వాసాంత మందున్నది.

18. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు ప్రకటించిన ఆముక్తమాల్యదలో వీని ననుసరించి ఏడాశ్వాసములున్నవి.

భీష్టార్చనా పుణ్యం ల
బ్ధ దురుట్టంకణ పాట్టునూరి విజయ
స్తంభోపలోట్టంకితాం
క ద్రధిష్ఠాక్షర కృష్ణరాయ ధరణీ కాం
తాస్మ దాముక్తమా
ల్యద నాశ్వాసము సప్తమం బలరు
హృద్యంబైన పద్యంబులన్

ఈ పద్యము ఆముక్తమాల్యదలో నాల్గవ యాశ్వాసాంతమున నున్నది.

మ.................అస్మదా మూక్తమా
ల్యద నాశ్వాసవరంబు నాలవది
హృద్యంబైన పద్యంబులన్

శ్రీనివాసకవియే దీని నేడాశ్వాసములుగా విభ జించినాడని యీవలనే తెలుపబడినది. కాని పూర్వ కృతిలో యారవ యాశ్వాసము చివరనున్న పద్యము లటే యుంచినప్పుడు క్రొత్తగా తాను విభాగము చేసిన ఏడవ యాశ్వాసమున కాశ్వాసాద్యంత పద్యము లుండవలెనుగదా! ఆ పద్యములను తానే వ్రాసినాడు. వాని నీవలకు ఉదాహరించినాను.

| | | |
|---|---|---|
| క. శ్రీమదుమా | ఆశ్వాసాది | |
| ఉ. స్కందసరస్తటీ | ఆశ్వాసాంతము | 72 |
| క. అరిధారాఖండిత | ,, | 73 |
| స్రగ్విణి. వాలినిర్భేదనా | ,, | 74 |

ఇక పద్యరూపమునసున్న గద్య కావలెను. దాని కొఱకు చతుర్థాశ్వాసాంతమునగల ఆముక్త పద్యమునే గ్రహించి 'యాశ్వాసవరంబు నాలవది' అనుదానిని 'ఆశ్వాసము శప్తమంబలరు'అని మార్చి శ్రీనివాసకవి ఆశ్వాసము పూర్తికావించినాడు.

శాస్త్రులవారు పై నాలుగు పద్యములు తమ గ్రంథమందు గ్రహించి, గద్యస్థా నీవలకున్న పద్య మునకే మార్పు వద్యమని కాబోలు తామొక క్రొత్త పద్యమును ప్రవేశపెట్టినారు. అది యీవలకు ఉదా హరించినదే—అయినను, స్పష్టప్రతిపత్తికై తిరిగి ఉదాహరించుచున్నాను.

ఇది నీలాచల నీలచేలక
సుభద్రేందీవరాభాక్షి కో
ణ దృగంచద్భుజవీర్యధుర్య
జయసన్నాహార్భటీవాద్య భీ
త్యుదితేభేశ్వర కృష్ణరాయ
మహిజాన్యల్పాది తాముక్తమా
ల్యద నాశ్వాసము సప్తమంబలరు
హృద్యంబైన పద్యంబులన్.

సప్తమాశ్వాసమున కాశ్వాసాద్యంత పద్యములు నాల్గును శ్రీనివాసకవికృతములేకాని రాయల వెంత మాత్రమునుకావు. శాస్త్రులవారు వానిని కృష్ణ రాయ కృతములుగానే భావించి, వానిని వ్యాఖ్యా నించినారు. ఆశ్వాసాంతపద్యముకూడ రాయల కృతిగా నుండవలెను. అందునే వారు పై పద్యము ననుసంధించి నారు. అయితే యిప్పట నొక చిక్కేర్పడినది. ఈ పద్యము రాయలకృతిమెంతమాత్రమును గాదు. ఇది నేను ముం ఉదాహరించిన జోగి జగన్నాథరాజు బుధమనసోల్లాసిని వ్యాఖ్యలోనిది[19]. అం దీ పద్యము షష్ఠాశ్వాసాంత పద్యముగా నున్నది.

ఇది నీలాచల నీలచేలక సుభద్రేం
దీందీవరాక్షాక్షికో
ణదృగంచద్భుజవీర్యధుర్య
భయసన్నాహార్భటీవాద్య భీ
త్యుదితేభేశ్వర కృష్ణరాయ మహిజా
న్యల్పాది తాముక్త
ల్యద నాశ్వాసము షష్ఠమింపలరు
హృద్యంబైన పద్యావళిన్.

బుధమానసోల్లాసిని వ్యాఖ్యలో పద్యమున స్పష్టముగా 'షష్ఠము' అని యుండగా శాస్త్రులవారు దీనిని సప్తమము అని మార్చినారు.

ఇక నిది జోగి జగన్నాథరాజ కృతిమే యను టకు ప్రమాణము చూపుచున్నాను. జోగి జగన్నాథ రాజునకు లభ్యమైన వ్రాతప్రతిలో—ముందు నేను చూచినట్లుగా, షష్ఠాశ్వాసాంతపద్యము 'ఇది సింహాచల దంభకేసరి పదాభీష్టార్చనా' అనునది[20] యుండి

19. దీనినిగూర్చి ముందు తెలిపియే యున్నాను. ఈ పద్యము 495 వ పుటలో నున్నది.

20. వావిళ్లవారి ముద్రణము లన్నింటి యందు షష్ఠాశ్వాసమున నీ పద్యమే గలదు.

యుండును. కాని అది చతుర్థాశ్వాస మందలిది. దానినిచూచి జోగి జగన్నాథరాజు—

ఇది 'సిలాచల సిలచేల' అను పద్యము వ్రాసి, తన కృతిలో చేర్చియుండవచ్చును. ఇంకొక విశేషము— ఈ పద్యము ఒక్క జోగి జగన్నాథరాజు కృతిలోతప్ప తక్కిన ఆముక్తమాల్యద వ్రాతప్రతులలో నెందును లేదు. కాబట్టి అది యాతని రచనమే. కృష్ణరాయుల ననుసరించి, జోగిజగన్నాథరాజు తన వ్యాఖ్యలో ఆశ్వాసాంతమున గద్య, పద్యములను వ్రాసి నాడని యీవఱకు చూపియున్నాను. ఇందువలన నిది కృష్ణరాయకృతముకాక జోగిజగన్నాథరాజకృతము. గ్రంథాంతము గందరగోళమైనది.

## సారాంశములు

పై వివరణమువలన ఈ క్రింది విషయములు నిర్దిష్టములైనవి.

1. ఆముక్తమాల్యదయం దాఱాశ్వాసములు మాత్రమే యున్నవి.

2. ఏడవ ఆశ్వాసమును క్రొత్తగా చేర్చినది గట్టుపల్లి శ్రీనివాసకవి.

3. ఏడవ ఆశ్వాసమున ఆశ్వాసాదిపద్యము— ఆశ్వాసాంతమున మూడు పద్యములు—గట్టుపల్లి శ్రీనివాసకవికృతములేగాని కృష్ణరాయలవి కావు.

4. సప్తమాశ్వాసాంతపద్యము— శ్రీనివాసకవి క్రొత్తది వ్రాయక చతుర్థాశ్వాస పద్యమునేమార్చి సప్తమముగా చేసినాడు.

5. వేంకటరాయ శాస్త్రులవారు సంజీవని వ్యాఖ్య ముద్రించునపుడు ఏడాశ్వాసముల గ్రంథము ప్రకటించి, పై విషయమును సూచింప లేదు.

చారిత్రకముగా నిందాఱాశ్వాసములే యుండ వలెనని మఱియొక ప్రమాణము చూపుచున్నాను.

## 'నైరామన' శబ్దము

ఆముక్తమాల్యద షష్ఠాశ్వాసాంతమున నీ క్రింది పద్యము గలదని యీ వఱకు తెలుపబడినది.

మ. ఇది నైరామన యావనావనిధవా
హీనాభ్రచుంబిస్ఫుర
ద్విదితాభీలమణిగ్రహాళి జ్వలనో
ద్వేలోగ్ర హస్తి వ్రజో
ద్యదనీకాగ్రగ కృష్ణరాయ మహిభృ
త్సంజ్ఞాస్మ దాముక్తమా
ల్యద నాశ్వాసవరేణ్య మాఱవది
హృద్యంబైన పద్యంబులన్

ఈ పద్య వ్యాఖ్యలో 'నైరామన'గూర్చి యిట్లు గలదు.

'నైరామన = నైరామన పురమునందలి— యావన అవనీధవ = తురకభూపాలునియొక్క.(69 పు.) వ్యాఖ్య చివర.(నైరామన—యిట్లు వ్రాతప్రతుల యందున్నది. ఇది నగరము పేరో సుల్తాను పేరో నిశ్చయించుకొనవలసి యున్నది.)

ఆభీలా కృచ్ఛ్రభీషణౌ—నానా.'

'నైరామన'యని వ్రాతప్రతులందున్నదని వ్రాయుట సరికాదు. వ్రాతప్రతులలో 'నైరావన' యున్నదిగాని నైరామన లేదు. ముందు నే నుదాహరించిన శ్రీనివాసకవి వ్యాఖ్యలోనేగాక వావిళ్ళవారు ప్రచురించిన ఆముక్తమాల్యదలోను 'నైరావన' అనియే కలదు.

పుట. 585 ప్రక్షిప్త భాగము.

'మ. ఇది నైరావన యామనావనిధవాహీనాభ్ర'

ఈ పద్య వ్యాఖ్యక్రింద—నీ క్రింది యథో జ్ఞాపిక గలదు. (పుట 649).

'నైరామన—దీనింగూర్చి చర్చించి శ్రీ డా. నేలటూరి వెంకటరమణయ్యగారిట్లు వ్రాసినారు. (భారతి -

వికృతి జ్యేష్ఠము. పు. 624). 'తాళపత్ర ప్రతుల యందును ముద్రిత గ్రంథములలోను 'ఇది నైరామన యావనావనిధవ' అనియే సర్వత్ర కానవచ్చుచున్నది. నైరామనాఖ్య నగరముగాని యా పేరిటి సుల్తానుగాని యన్యత్ర యెచ్చటను పేర్కొనబడియుండలేదు. అట్టి పురము దక్కనులోగాని మఱి రాయల కందుబాటు గల దేశములందుగాని కానరాదు. కవున 'నైజామన' యని సవరించితిని.........నైజామన యహమ్మదు నగర పాలకునగు నిజాముశాహు కావచ్చును. కెంబావి యుద్ధమునకును నైజామన యావన ప్రభుని మణి గృహాళి నిర్మూలనమునకు నెద్దియేని సంబంధ ముండి యుండును.'

నైరామన పాఠము తాళపత్ర ప్రతులయందు ముద్రిత గ్రంథములలోను కలదని డా. వేంకటరమ ణయ్యగారు వ్రాయుట అసంగతము. పైన పాఠమట్లు లేదని వ్రాతప్రతులలోను, ముద్రితమైన వావిళ్ళ ప్రతిలోను 'నైరావన' అనియే యున్నదని యీ పఱకే తెలిపినాను.

అంతేకాదు డా. వేంకటరమణయ్యగారు సరియైన పాఠములను గ్రహింపక దానిని 'నైజామన' అని సవరించుట అంతకంటె సరికాదు. అచ్చట పాఠము—

'నైరావన'

'నైరావన' శబ్దము 'వైశ్రవణ' అను సంస్కృత శబ్దమునకు పాళీభాషా రూపము. వైశ్రవణుడనగా కుబేరుడు—ఆత డుత్తర దిక్కునకు పాలకుడు. ఇచ్చట నైరావనయావనాధిపుడనగా వైశ్రవణుని (నైరావన) దిశయైన ఉత్తరమునుండు యావనాధిపుడు—అనగా—మహమ్మదీయ ప్రభువు—రాయల రాజధానియైన విజయనగరమున కుత్తరమున నుండిన బిజాపూరుసుల్తాను ఇస్మాయిల్ ఆదిల్‌షా లేక ఆదిల్‌ఖాను.

రాయల దండయాత్రలలో క్రీ. శ. 1520 ప్రాంతమున జరిగిన పై ఆదిల్‌ఖానుపై దండ యాత్రయే కడపటిదని విజయనగర సామ్రాజ్య చరిత్రకారు లెల్లరును ఏకగ్రీవముగా నంగీకరించినదే. ఆముక్తమాల్యదలో, ఆశ్వాసాంత గద్యపద్యములలో రాయలు తన జైత్రయాత్రలను, కాలక్రమమున తెలిపియున్నాడు.

ప్రథమాశ్వాసము—ఉదయగిరిదుర్గము (క్రీ. శ. 1513)

ద్వితీయాశ్వాసము—కొండవీడు

తృతీయాశ్వాసము—కొండపల్లి

చతుర్థాశ్వాసము — పొట్నూరివిజయస్తంభప్రతిష్ఠ. కళింగ విజయయాత్రపూర్తి.

పంచమాశ్వాసము — కెంబావి.

షష్ఠాశ్వాసము ఆదిల్‌ఖానును జయించుట. కలుబరిగెతో ఉత్తరప్రాంతము వశమగుట. (క్రీ. శ. 1520)

రాయ లాముక్తములో ఆశ్వాసాంత పద్యములలో తన విజయములను తెలిపినట్లుగా విజయనగర చరిత్రకారులందఱును నంగీకరించినారు. దీనినిబట్టి కూడ, ఆముక్తమాల్యద యం దాఱాశ్వాసములే యుండవలెననియు, ఏడవ ఆశ్వాసములేదని నిశ్చిత మగుచున్నది.

ఆముక్తమున 'నైరావన' పాఠమే యున్నదనుటకు ప్రమాణము చూపుచున్నాను.

Nairavana

C. R. Krishnamacharlu, Madras.

In the prakshiptabhaga of the Amuktamalyada edited by Messers Ramaswami Sasturulu & Sons (1914) the last verse of the 6th Aswasa is given thus. 'Idi nairamana Yamanama etc.' The same verse is given in a slightey altered form, by the late Vedam Venkataraya Sastri who reads it as 'Idinairamana yavani.'

In this connection it may be pointed out that an early Bouddhist work-the Bower Manuscript as it is now called, mentions nairavana (Indian Antiquary Vol. XXI—p. 361) among Nagas and Nagarajas.

Professor Hoernle accepted Mr. Morris' identification of Nairavana with Vaisravana, who was the regent of the North.

'Yamana was only a mistake for Yavana in which case we will have a passage like Nairavana yavanavanidhava which would mean...yavana King of the North'*

* The would refer to Adil Shahi, King of Bijapur with whom Krishnadevaraya was at war.

ఆంధ్రసాహిత్య పరిషత్తు రజతోత్సవ సంపుటము ఇంగ్లీషు భాగము—పుట. 6. 1937. కాకినాడ.

ఆముక్త మాల్యదకు చారిత్రక వ్యాఖ్యానము త్యావశ్యము.

---



# జుత్తిగదేవుని ప్రతిష్ఠాత చక్రకూటేశ్వరుడు కాడా?

## శ్రీ తురగా కృష్ణమూర్తి

శ్రీ జి. ఆర్. వర్మగారు రచించి 'భారతి'లో ప్రచురించిన 'కరవాల భైరవ మణ్డపం' అనే వ్యాసాన్ని చదివిన తర్వాత నాలో కొన్ని ఊహలు రేగి, ఆలోచనామగ్నమానసుణ్ణి చేశాయి. ముఖ్యంగా వ్యాసాంతమున వారు వెలిబుచ్చిన సూచన నాదృష్టి నాకర్షించి, అది యదార్థమగునా? అను జిజ్ఞాసను రేకెత్తించింది. జుత్తిగదేవుడు 'వాసుకి రవి సోమేశ్వరుడు'పురాణోక్తకథనము ప్రకారముసూర్య,చంద్ర, వాసుకి ప్రభృతుల ప్రతిష్ఠ గాక, చారిత్రాత్మకంగా వేంగీ చాళుక్యవంశ్యుడు వీరవిజయాదిత్యునిదై యుండునా? అన్న యూహ నాసేత నా కొకించుక సంశయాన్ని కల్గించి, విషయ నిర్ధారణకు పురికొల్పింది. శ్రీ వర్మగారి ముగురయ్యల ప్రతిష్ఠాపన వాదం కొంతలో కొంత మార్గదర్శక మనిపించింది. ఆమార్గాన్ని అనుసరించి చూచిన నాకు శ్రీ వర్మగారు సూచించిన ముగురయ్యలు కరవాలభైరవ బిరుదాంచితుడు చాళుక్య వీరవిజయాదిత్యుడు, ఆతని మంత్రి నాగకుల భీమరాజు, మిత్రుడు పశ్చిమ చాళుక్య సోమేశ్వరు లెట్లగుదురు? అనే సందేహంకూడా పొడసూపింది. ఆ సందేహ నివృత్తికై చేసిన యత్నమే వ్యాసరూపమున సాక్షాత్కరించింది.

'భారతి'లో ప్రచురింపబడిన నా వ్యాసాన్ని చూచిన శ్రీ వర్మగారు నా వాదనలోని దౌర్బల్యాన్ని యెత్తిచూప యత్నించుచు 'జుత్తిగదేవుని ప్రతిష్ఠాత చక్రకూటేశ్వరుని వేంగీ విజయం?' అను వ్యాసాన్ని వ్రాసి ప్రకటించారు. ఆ వ్యాసంలో వారు వెలిబుచ్చిన కొన్ని అభిప్రాయాలకు నా యోచినంత వరకు సమాధానమిచ్చుట కిపుడు ప్రయత్నిస్తాను.

శ్రీ వర్మగారు వారి వ్యాసంలో జుత్తిగదేవు ప్రతిష్ఠాత కరవాలభైరవ వీరవిజయాదిత్యుడు కాడని తమ నమ్మకమంటూనే, సర్ప, సూర్య, చంద్రా రాధన బహుపురాతనంగా వ్యాప్తిలో ఉంటుందనే పరిశోధకుల భావాలు తెలియడానికి తమ సహజ ధోరణిలో వ్యాసాంతాన ఒక ప్రశ్న వదిలినామనీ, తన్నుతాను సమర్థించుకునే యత్నం, ఏదో సిద్ధాంతాన్ని వెలార్చేయత్నం, ఆ ముగ్గురిపేరిట దేవుని ప్రతిష్ఠాపించారనుట అత్యంత సంభవమనిపించాలనే యత్నం తమలోవుంటే ఆ వ్యాసంలో మరిన్ని విషయాలు వ్రాసి వుండేవారమని ఉట్టంకించారు. మంచిదే!

జుత్తిగదేవుని ప్రతిష్ఠాత చాళుక్య వీరవిజయాదిత్యుడుకాడని శ్రీ వర్మగారు నమ్మినప్పుడు వారేల ఆ సూచనను చేసియున్నారు? ఆ సూచన చేయుటలో అందలి సామంజస్యాన్ని పాఠకులు పరిశీలించవలెననే ఆహ్వానం శ్రీ వర్మగారిచ్చినటులే గదా! వారి అభిమతానుసారం నేను తద్విషయమైన చర్చ కొంత నడపి, వారు నమ్మిన విషయాన్నే (చాళుక్య వీరవిజయాదిత్యుడు స్వామి ప్రతిష్ఠాతకాడనే విషయాన్నే) సహేతుకంగా నిర్ణయించినందులకు నేను వారి ప్రతివిమర్శకు పాత్రమునైనాను. ఇంతేకాకుండ వారూహించిన విధానాన్నే నే ననుసరించి, జుత్తిగదేవుని ప్రతిష్ఠాతలు ముగ్గురైవుంటారనీ, ఐతే వారు వాయుపురాణంలో చెప్పిన వాసుకి, భాస్కర, అబ్ధిపుత్రులు మాత్రంకారనీ, వారు చారిత్రక వ్యక్తులై వుండి వాసుకి, రవి, సోమేశ్వర పదలాంఛనమలై వుండాలనీ—ఇన్ని విశేషములుగల ఆ ముగ్గురెవరై యుందురా? అను జిజ్ఞాసప్రేరేప నేను వ్యాసరచనకు గడంగినాను. నా యోచినంతవరకు సమన్వయముచేసి, సిద్ధాంతీ

కరింప ప్రయత్నించినాను. నా సిద్ధాంతము రుచింపని మహనీయులు ప్రతిసిద్ధాంతాన్ని వెలార్చి నిర్ణయింప దొరకొన్నప్పుడెగదా! అందరి యదార్థము బహిర్గతమై, లోకోపకారమవౌను! వాదప్రతివాదములు సుహృద్భావవాతావరణములో సహేతుకమైన మార్గమున నడచి, సర్వజనసమ్మతములైనపుడేగదా! లోకమునకు యదార్థస్థితి గోచరించుట! ఈ ప్రయత్నములో పాల్గొనువారు ఆవేశములకు లోనుగాకుండ సంయమనము నవలంబించి, వర్తించినపుడే విజ్ఞలోకము హర్షించి, గౌరవించుననుట యెల్లరెరిగినదే.

శ్రీ వర్మగారు నా వ్యాసంలో ప్రతిపాదించిన సిద్ధాంతాలను కాదనుటకే కంకణము కట్టుకొని శ్రమించినారు. కాని—క్రొత్తసిద్ధాంతాలను ప్రతిపాదించి, సమస్యను పరిష్కరింప పూనుకోలేదు! జుత్తిగదేవుని ప్రతిష్ఠాత చాళుక్యవీరవిజయాదిత్యుడు గాక, చక్రకూటసోమేశ్వరుడుగాక మరెవ్వరో తేల్చి చెప్పు ప్రయత్నమైన వారొనరింపలేదు. నేను వెలార్చిన యూహలు తప్పనిమాత్రమే నిరూపింప సంకల్పించి వ్యాసరచనకు దిగినట్లు తోచుచున్నదేగాని— సమస్యా పరిష్కారమునకు బూనుకొని యత్నించు యూహ యున్నట్లు గోచరించలేదు. పోని—ఆ పరిష్కారమును భావిపరిశోధనకు విడిచిపుచ్చక, తొలివ్యాసమున వారి సహజధోరణిలో సూచించినట్లు ఈ వ్యాసమునగూడ 'జుత్తిగదేవుని ప్రతిష్ఠించినది—ఒక్క జుత్తిగలోనేగాదు—వేంగిలో ఎక్కడ ప్రతిష్ఠించినా ప్రతిష్ఠాతలు వేంగీశ్వరులైయ్యుండాలేగాని, దండయాత్రచేసి, దగ్ధంచేసి వెళ్లిపోయిన వీరులుమాత్రం గాదు'అని ఘంటాపథంగా వక్కాణించే సాహసం వహించారు! అంటే జుత్తిగదేవుని ప్రతిష్ఠాతలు వేంగీశ్వరులేగాని అన్యులుగారన్నవారి నిర్ణయాన్ని ప్రకటించి, ఆ నిర్ణయాన్ని సమర్థించమని భావిపరిశోధకులకు విజ్ఞప్తి చేశారన్నమాట! ఆ వేంగీశ్వరులు యెవరో నిర్ణయించుయత్నం వారి వ్యాసంలో చేసివుంటే పాఠకులకు కొంత సంతుష్టి కలిగివుండేది! అట్లా చేయక శ్రీ వర్మగారు 'అథాతో బ్రహ్మజిజ్ఞాస' అనునట్లుగా చుట్టుతిరిగివచ్చి యథాస్థానంలోనే ఆగిపోయారు! జుత్తిగదేవుని ప్రతిష్ఠాత లెవరో నిర్ణయించే బాధ్యత చరిత్ర పరిశోధకుల దంటూనే 'నేతి' 'నేతి' పదాలతో పరిష్కారాన్ని వెనుకకు నెట్టివేస్తున్నారు!

నా వ్యాసంలో వ్రాసిన విషయాలకు శ్రీ వర్మగారు తెలిపిన అభ్యంతరాలను పరామర్శింప ప్రయత్నిస్తాను.

ముఖ్యంగా వారు తమ వ్యాసంలో (1) జుత్తిగలో దంతేశ్వరి (2) కరవాలభైరవమణ్డప నిర్మాణకాలము (3) చక్రకూటేశ్వరుని వేంగి విజయము (4) జుత్తిగదేవుని ప్రతిష్ఠాత లెవరు? అను నాల్గు ఉపశీర్షికల క్రింద నా వ్యాసంలోని విషయాలను విమర్శించి, నా వాదనను పరాస్త మొనరింప ప్రయత్నించారు. ఆ విషయాలను ఒకదానివెనుక నొకటిగా ప్రస్తావించి సమాధానిస్తాను.

## కరవాలభైరవమండప నిర్మాణకాలం

చాళుక్యరాజరాజు సవతితమ్ముడు వీరవిజయాదిత్యుడు రాజ్యాభిలాషియై, భ్రాతృద్రోహము తలపెట్టి, మొదటిసారిగా పగగండభైరవబిరుదాంచితుడైన రాజరాజనరేంద్రుని నోడించి, వేంగీశ్వరుడైనప్పుడే కరవాలభైరవబిరుదాంకితుడైనాడని, ఈ సంఘటన క్రీ॥ శ॥ 1031 వ సంవత్సరమున జరిగినదని, వీరవిజయాదిత్యుడు క్రీ॥ శ॥ 1035 వ సంవత్సరములో వేంగి సింహాసనాన్ని పరిత్యజింపవలసివచ్చినందున క్రీ॥ శ॥ 1031—1035 మధ్యకాలములోనే జుత్తిగలో కరవాలభైరవ మండపమును తన విజయచిహ్నముగా నిర్మించాడుగాని, బిరుదుదాల్చిన తర్వాత 40 ఏళ్లవరకూ ఆగి, క్రీ॥ శ॥ 1074 వ సంవత్సరములో నిర్మించెనన్న నా వాదన సమర్థనీయం కాదని, పరిశోధకు లీ సందర్భంలో తమ 'ఓటు'ను ఎవరికిస్తారో వేచిచూడాలని శ్రీ వర్మగారు తమ అభిప్రాయాన్ని వ్యక్తీకరించారు! వీరవిజయాదిత్యుడు చాళుక్యరాజరాజును జయించినప్పుడే 'కరవాలభైరవ' బిరుదమును వహించియుండవచ్చును. క్రీ॥ శ॥ 1031 వ సంవత్సరములో తొలిసారిగా వీరవిజయాదిత్యుడు వేంగిరాజ్య సింహాసనమును బల్మినై ఆక్రమించుకొన్నాడనుటను నేను కాదనను. అయితే 'కరవాలభైరవ' బిరుదము నార్జించిన విజయాతిరేకములోనే వీరవిజయాదిత్యుడు జుత్తిగ దేవాలయములో 'కరవాల

భైరవ మణ్డప నిర్మాణం గావించియున్నాడనుటను మాత్రం నే నంగీకరించను. ఒకపరి శత్రువు నిర్జించి ఆర్జించిన బిరుదునిశానీలు ఆ వ్యక్తి జీవితాంతం వరకు నిలిచియుండుటకెట్టి అభ్యంతరములు నుండవు గదా! అందువే క్రీ॥ శ॥ 1031 వ సంవత్సరములో తా నార్జించిన 'కరవాలభైరవ' బిరుదమును వీర విజయాదిత్యుడు క్రీ॥ శ॥ 1074 వరకు వహించి యుండి, పౌరుషప్రతాపద్యోతకమైన ఆ బిరుదమును సమయము ననుసరించి శాసనమున లిఖింపచేసు కొన్నాడనిన అందు విపరీతమేమున్నది? విజయ సూచక ప్రశస్తులలోనేగాని, ఇతర సందర్భములందు తానార్జించుకొన్న బిరుదప్రశస్తుల చెప్పుకొనుట లాక్షేపణకరమా? అదియునుగాక 'కరవాలభైరవ మండప నిర్మాణ'కాలము వీరవిజయాదిత్యుని శాసన ములో స్పష్టముగా నున్నది:

'స్వస్తి సర్వలోకాశ్రయ
శ్రీ విష్ణువర్ధన మహారాజుల ప్రవర్ధమాన
విజయరాజ్య సంవత్స
రములు 13 యవు నేణ్డు' అని.

వేంగీ చాళుక్యుల్లో విజయరాజ్య సంవత్సర పరిగణన ఒకరాజు అభిషేకకాలం అనీ; కాదు—అతని మరణకాల పరిగణనఅని పరిశోధకులలో రెండభిప్రాయా లున్నవని శ్రీ వర్మగారు సెలవిచ్చారు. ప్రస్తుత శాస నంలో పేర్కొన్న విజయరాజ్య సంవత్సరములు పై ద్వివిధమార్గ పరిగణనలో యే మార్గమునకు చెందినదిగా యెంచుకొని నిర్ణయించవలెను? ఆ నిర్ణ యముపైననే 'కరవాలభైరవమణ్డప నిర్మాణ' కాల నిర్ణయము ఆధారపడియుండును.

ఇప్పటికే లభ్యమైనంతలో వీరవిజయాదిత్యుని శాసనాలు నాలుగు కన్పిస్తున్నాయి. (1) పాములవాక శాసనం (2) ర్యాలి మొదటి శాసనం (3) ర్యాలి రెండవ శాసనం (4) జుత్తిగ కరవాలభైరవ మండప శాసనం. ఈ నాల్గింటిలోను ర్యాలి రెండు శాసనాల లోను, జుత్తిగ కరవాలభైరమండప శాసనంలోను మాత్రమే విజయరాజ్యప్రసక్తివుంది. పాములవాక శాసనంలో

తస్య ముమ్మడి భీమస్య
సుతః కృతమతి ర్మహా
రాజరాజాహ్వయో రాజా
ద్వాదశాబ్దానధరామపాత్॥
తం రాజరాజ నృపతిం నిర్వాట్య
భువం ప్రసహ్య విజయాదిత్యః
విమలాదిత్య తనూజ స్తస్య
వైమాతురో గృహీద్రాజ్యమ్॥

అని రాజరాజు వేంగీ రాజ్యాన్ని 12 యేండ్లు పాలిం చిన పిమ్మ నాతని వద్దనుండి వీరవిజయాదిత్యుడా రాజ్యమును గెల్చుకొనెనని చెప్పబడినది. ఇందు విజయరాజ్య ప్రసక్తి లేదు. రాజరాజు క్రీ॥ శ॥ 1018 వ సంవత్సరమున వేంగీ రాజ్యాభిషిక్తు డైనట్లు యెంచుకొని ఆ తర్వాత పన్రెండేండ్లు పాలనము కలుపుకొన్న క్రీ॥ శ॥ 1030 గతించగా వీరవిజయాదిత్యుడు తొలిసారిగా వేంగీ రాజ్యము నాక్రమించినట్లు తెలుచున్నది. ఈ నిర్ణయమును బలపరచురీతిగా ఆ శాసనంలోనే

శ్రీమా న్నాకే నవమాఘే దృగిషు
నిధిమితే కర్కిగే కర్కింశాంశౌ
శుద్ధాల్మా శుద్ధ పంచమ్యు
దితిసుతదినే సూర్య ఖే శౌర్యశాలీ
కన్యాలగ్నేతిధన్యా
శశికులతిలకో రాజమార్తాండ నామా
వ్వేంగీ సామ్రాజ్యపట్టం
స్సనహతి విజయాదిత్య భూపః ప్రతాపీ॥

అని శక సంవత్సరం 952 నకు సరియైన క్రీ. శ 1030 సంవత్సరంలో వీరవిజయాదిత్యుడు వేంగీ సామ్రాజ్య పట్టాన్ని వహించాడని చెప్పబడింది! ఇందు విజయరాజ్య సంవత్సర ప్రసక్తిలేదుగాని శాసనము నిచ్చినది రాజ్యమునకు వచ్చిన రెండవ వత్సరమున అని మాత్రం

అస్య ద్వితీయ వర్ష వర్ధమానే
దత్త స్యాస్య శాసనస్య

అనే శ్లోకపాదంలో వ్యక్తీకరింపబడ్డది. అంటే క్రీ. శ. 1032—33 వ సంవత్సరములో ఈ శాసనం వ్రాయబడినదన్నమాట!

వీరవిజయాదిత్యుడు రాజరాజుపై అనగా

పరగండ భైరవ బిరుదాంకితునిపై తొలి విజయం సాధించిన తర్వాత, వేంగిరాజ్యాన్ని రెండు సంవత్సరములు పాలించిన తర్వాత ప్రథమతః వ్రాయించిన శాసనమిదియే అన్నమాట! ఇందు స్వోత్కర్షగా, తన విజయ సూచకంగా, పరగండ భైరవ బిరుదాంకితుడు రాజరాజు పరాజితు డొనర్చిన వీరకృత్య స్ఫురణకునై విజయాదిత్యుడు యుద్ధరంగమున నాచికొన్నాడన్న 'కరవాల భైరవ' బిరుదము నిందు వాడుకొనలేదు. పైగా నాటికి విజయాదిత్యున కున్న బిరుదములు 'చాళుక్యభీమ' 'సర్వలోకాశ్రయ' 'విష్ణువర్ధన మహారాజ' 'రాజాధిరాజ' శ్రీవిజయాదిత్య అనునవే! ఇందు 'కరవాల భైరవ' బిరుద మెచ్చటను పేర్కొనబడలేదు. కావున క్రీ. శ. 1031—1032 సంవత్సరములనాటికి వీరవిజయాదిత్యదేవునకు 'కరవాల భైరవ' బిరుద ముండియుండలేదని స్పష్టమగుచున్నది. అట్టియెడల నీ బిరుదమున్న శాసనము క్రీ. శ. 1031 వ సంవత్సరము తర్వాతి కాలమునదై యుండియుండవలెనుగదా! అట్టికాల మేమైయుండును? వీరవిజయాదిత్యుని ప్రస్తుత విజయము తాత్కాలికము. పైగా సందేహాస్పదము. కావున వీరవిజయాదిత్యుడు నిస్సంకోచముగా 'పరగండ భైరవు' పరాజితుచేసినను 'కరవాలభైరవ' బిరుదమును దాల్ప సాహసించలేదు. ఇక రెండవతూరి క్రీ. శ. 1061 వ సంవత్సరమున రాజరాజు మరణానంతర మా బిరుదమును వీరవిజయాదిత్యుడు వహించి, వేంగీసింహాసన మాక్రమించినపిదప నొసగిన శాసనములలో నద్దాని ప్రయోగించుచు వచ్చినాడు. అందువలననే ర్యాలి శాసనములలోను, జుత్తిగ కరవాలభైరవ మణ్డప శాసనములోను ఆ బిరుదప్రసక్తి కానవచ్చుచున్నది.

పైన పేర్కొనబడినట్లు విజయరాజ్య సంవత్సర ప్రసక్తి ర్యాలి శాసనాల్లోను జుత్తిగ కరవాల భైరవమండప శాసనంలోనే గాంచనగుచున్నది. పాముల వాక శాసనము ననుసరించి క్రీ. శ. 1030—31 వ సంవత్సరమున విజయాదిత్యుడు వేంగీసింహాసనాధ్యాసి యయ్యెనన్న, 'విజయరాజ్య వత్సరములు 13 యవునేణ్డు' అనగా క్రీ. శ. 1044 వ సంవత్సరమని యర్థము (క్రీ. శ. 1031 + 13 = క్రీ. శ. 1044) చెప్పవలసివచ్చును. అయితే యీ పరిగణన పరిశోధకు లంగీకరించిన ద్వివిధమార్గ పరిగణనకు భిన్నముకాదు! అదియునుగాక శాసనము వేయించిన రాజు అభిషేకకాలముగాని అతఃపూర్వము ప్రభుత్వము చేసినరాజు మరణకాలముగాని లెక్కలోనికి తీసుకొను విషయములో శాసనము వేయించురాజు అభిషేకకాలము ప్రాతిపదికగానే వాని విజయరాజ్య సంవత్సరము లెన్నుట సమంజసముగాని, అంతకుముందు పాలించి పదభ్రష్టుడైన వాని విజయరాజ్యవత్సర ప్రసక్తుల దెచ్చి కాలపరిగణన మాచరించుట తప్పు. క్రీ. శ. 1018 వ సంవత్సరములో పట్టాభిషిక్తుడైన రాజరాజు రాజ్యకాలమునకు 13 కలిపి క్రీ. శ. 1031 వ సంవత్సరములో విజయాదిత్యుడీ కరవాలభైరవమండప నిర్మాణము చేసినాడని వాదించుట సరిపడని విషయము. ఆ కారణముచేత క్రీ. శ. 1044 వ సంవత్సరమున నీ కరవాలభైరవమండప నిర్మాణము జరిగియుండవలెను. ఇందులకు శ్రీ వర్మగా రంగీకరింతెదరా? అంగీకరించిన 'కరవాలభైరవ బిరుదాంకితు'డైన 13 సంవత్సరములకు శ్రీ వర్మగారి వాదన ప్రకారము వీరవిజయాదిత్యుడు తన విజయసూచకముగా నీ మణ్డపమును నిర్మించాడని అనుకోవలసివచ్చును. పదమూడేండ్ల తర్వాత చెప్పుకొన్నా నలుబదియేండ్ల అనంతరము చెప్పుకొన్నా విజయప్రకటన విజయప్రకటనమే! ఇందు ఆశ్చర్యపడవలసిన విషయమేమున్నది? అభ్యంతరము తెలుపవలసిన అవసరమేమున్నది?

శ్రీ వర్మగారి పరిగణన కంగీకరించినా, చరిత్ర యిందుల కంగీకరించదు. ఏలననగా — క్రీ. శ. 1044 వ సంవత్సరమున వేంగి సింహాసనముపై వీరవిజయాదిత్యు డుపస్థితుడై లేడుసరికదా, అనేక యుద్ధముల గుడుచుచు జీవగ్రాహముగ రాజరాజునకు చిక్కియున్నట్లు చరిత్ర యుద్ఘోషించుచున్నది. శక సంవత్సరం 957 నుండి శక సంవత్సరం 966 వరకు పదేండ్లు (క్రీ. శ. 1035 నుండి క్రీ. శ. 1044 వరకు) రాజమహేంద్రుడు 'నిస్సైజితవైరి వీరుడై,' 'నానావనీనాథకిరీటతటీవిలసద్రత్నసంఘటిత పదకమలుడై సుఖవినోదగోష్ఠి నుండుచు' రాజ్యమును పాలించెను. వీరవిజయాదిత్యుడు క్రీ. శ. 1031 సంవత్సరమున వేంగిసింహాసన మాక్రమించి, రాజరాజును రాజధానినుండి తరిమివేయగల్గెనుగాని వేంగిరాజ్యము సంపూర్ణముగ నాతని వశముకాలేదు. రాజరాజ

విజయాదిత్యులవైరము 2, 3 యేండ్లుగా సాగెను. ఈ కాలములో స్వస్థత లేక నిత్యసంకటస్థితిలో, దురంత సంగ్రామ వేదనలతో వీరవిజయాదిత్యుడు తుదకు క్రీ. శ. 1035 వ సంవత్సరమున రాజరాజునకు లొంగిపోయి, సింహాసనచ్యుతుడయ్యెను. ఇట్టి అస్థిమితకాలములోనే విజయచిహ్నముగ కరవాలభైరవ మణ్డప నిర్మాణము సాగించెననుటయు, పదవీచ్యుతి కారణమున మండప నిర్మాణ మసంపూర్తిగా నిలిచి పోయె ననుటయు సమంజసముగా గన్పట్టుచు.

క్రీ. శ. 1060 వ సంవత్సరమున వేంగీశ్వరుడు రాజరాజునకు, కర్ణాట ఆహవమల్ల కుమార విక్రమాదిత్యుని సేనలకు నడుమ ప్రవర్తిల్లిన ఘోర యుద్ధములో రాజరాజు మరణించుటతో వీరవిజయాదిత్యుడు మరొకతూరి వేంగిసింహాసన మాక్రమించెను. రాజరాజనరేంద్రుని మరణము జూలై 1061 వ సంవత్సరప్రాంతమున సంభవించెను. క్రీ శ.1061 వ సంవత్సరమునుండి వీరవిజయాదిత్యుడు వేంగీపాలకుడయ్యెను. ఆ సంవత్సరము రాజరాజదేవుని 41 వ విజయరాజ్యవత్సరముగా పరిగణనలోనికి వచ్చెను. వేంగీ సింహాసన మాక్రమించుకొన్న వీరవిజయాదిత్యుడు క్రీ. శ. 1061 వ సంవత్సరములో తన కుమారుని ఇమ్మడి శక్తివర్మను వేంగీ సింహాసనముపై కూర్చుండబెట్టి అభిషేకించెను. పుత్రవాత్సల్యముచే నాతనిపై ఎన్నియో ఆశలు పెంచుకొని వీరవిజయాదిత్యుడు శేషజీవితమును నిశ్చింతగా గడుపనెంచెను. కాని—విధి విధాన మన్యథా పర్యవసించెను. శక్తివర్మ ఒక్కయేడు మాత్రము మహీరాజ్య సుఖము లనుభవించి, రెండవ విజయరాజ్యవర్షమున యుద్ధరంగమున నిహతుడయ్యెను. 'సమరైక భైరవుడు', 'సత్యాశ్రయదేవుడు' అను బిరుదులుగల ఇమ్మడి శక్తివర్మ మరణించినది క్రీ. శ. 1063 వ సంవత్సరము జనవరి నెల యని చరిత్రకారులు నిర్ణయించిరి. ఈ విధిని వీర విజయాదిత్యుడు కుమారునిమరణానంతరము విబుధులు, కులక్రమాగతులైన అప్తులు పలుమారు బోధించుట వలన ప్రజాహితముకొరకును, ధర్మసంస్థాపనార్థమును మరల సింహాసనమెక్కి వేంగీ సామ్రాజ్యమును పాలింప నుద్యమించెను.

ఇమ్మడి శక్తివర్మ మరణముతో క్రుంగిపోయిన వీరవిజయాదిత్యునకు చరమవయసునందు, ప్రాయను ప్రాలుచున్నకాలమున సంతానము కలిగెను. ఆ బాలుడు చిరంజీవియై వర్థిల్లగలడని యాతడు పుట్టెడాశతో నుండెను. ఈ పుత్రలాభము విజయాదిత్యుని పంద్రెండవ విజయరాజ్యవర్షమున సంభవించెను. ఆ తనయు డొకప్పుడు జీవించడను భీతికలిగి, విజయాదిత్యదేవుడు భూసురోత్తములకు దానము లొసగి శాసనములు వ్రాయించెను. పంద్రెండవ విజయరాజ్య వర్షమున శకసంవత్సరము 994 నకు సరియైన క్రీ. శ. 1072—73 అగుచున్నది. (చూ. వీర విజయాదిత్యుని ర్యాలి తామ్రశాసనము). ఈ విధిని కరవాలభైరవ మండప శాసనములో నుట్టంకింపబడిన 'విజయరాజ్య సంవత్సరములు 13 యవునేణ్డు' అనగా క్రీ. శ. 1073—74 వ సంవత్సరముగా నిర్ధరింప వలసివచ్చును. అదియునుగాక ఈ ర్యాలి శాసనములోనే తొలిసారిగా వీరవిజయాదిత్యుడు 'కరవాల భైరవ' బిరుదాంకితునిగా పేర్కొనబడినాడు. నిజసంతాన బలాయురారోగ్యైశ్వర్యాభివృద్ధ్యర్థము మావిణ్ణేఱు, క్రుందుయు నామములుగల గ్రామముల సర్వకరపరిహారముగ దానమిచ్చినట్లే, యీ మండపనిర్మాణము గూడ జేసియుండవచ్చు ననిపించుచున్నది.

ఈ విధిని కరవాలభైరవమండపశాసనములో నుట్టంకింపబడిన 'విజయరాజ్య సంవత్సరములు 13 యవునేణ్డు' విజయాదిత్యుని అభిషేక కాలమునుండి పరిగణింపబడి క్రీ. శ. 1074 వ సంవత్సరములో జుత్తిగదేవునిఆలయములో మండపనిర్మాణము జరిగినదని నా తొలివ్యాసమునం దుదాహరించినాను. వీరవిజయాదిత్యు డెన్ని సవనములు చేసినను యాతని యభిలాష ఫలించినట్లు గన్పడదు. అతడు చివరకు సంతానహీనుడై క్రీ. శ. 1076 లో దివంగతుడయ్యెను. ఈ పరిస్థితుల మూలముననే కరవాలభైరవ మణ్డప నిర్మాణ మసంపూర్తిగా నిలిచిపోవుట తటస్థించినది.

ర్యాలిశాసన రచనావిధానమునుబట్టి వీరవిజయాదిత్యదేవు డెపుడు యే శాసనముల నిర్మించిను యందుదాహరించిన విజయరాజ్య సంవత్సరములు తాను రెండవతూరి యేలుబడికి వచ్చిననాటనుండియే పరిగణనలోనికి తెచ్చు సాంప్రదాయము ననుసరించెనని తెల్లమగుచున్నది. అందుచేత 'కరవాలభైరవ మణ్డప' నిర్మాణము విషయములో ఉట్టంకించిన విజయరాజ్యవత్సర ప్రశంస విజయాదిత్యుడు రెండవతూరి వేంగీసింహాసనాధిష్ఠితు

్థైన నాటినుండియేనని రూఢియగుచున్నది. ఆ విధిని క్రీ. శ. 1074 వ సంవత్సరమే కరవాలభైరవ మణ్డప నిర్మాణ ప్రారంభకాల మగుచున్నది.

పూర్వకాలములో వీరులు, విజేతలు తమ తమ సంగ్రామరంగవిజయసూచకముగానో, ప్రత్యర్థుల గర్వ నిర్వాపణ సూచకముగానో గుడులు, గోపురములు కట్టించుట, జయస్తంభముల నాటుట లేక దేవతా విగ్రహప్రతిష్ఠాపనలుచేయుట పరిపాటిగా నుండెడిది. అట్లే తమ తమ ప్రియతములు చనిపోయినపుడు వారి స్మృత్యర్థముగానో, సద్గతికొరకో లింగప్రతిష్ఠలు చేయుట, దేవళములు నిర్మించుట, మండపములు, ధర్మశాలలు నిలుపుట, తటాకాది ప్రతిష్ఠాపనము లొనరించుట కూడా కొనసాగించడముకలదు. ఒక్కొక్కప్పుడు పుణ్యార్థము తమకు తామై కొందరు తాము జీవించి యుండగానే తమ పేరున లింగముల ప్రతిష్ఠించుట, ధర్మాయతనముల నిర్మించుట, దేవాలయములు కట్టించుట కద్దు.* ఆ ఆచారమునుబట్టి వీరవిజయాదిత్యుడు ఇహపరసాధనకో, సంతాన ఆరోగ్యాభివృద్ధికో లేక సద్గతికో తనపేర జత్తిగదేవాలయములో కరవాల భైరవ మణ్డప నిర్మాణముచేయ నుద్యమించి, కొంతవరకు సాగించి,మరణకారణమున నసంపూర్తిగా విడిచివేసియుండవలెను. దుఃఖమయమైన తన జీవితమునకు సద్గతి చేకూరు నిమిత్తము యీ పుణ్యకార్యమునుతలపెట్టి మధ్య కాలములోనే మిత్తివాతబడుటతో మణ్డప నిర్మాణమును అసంపూర్తిగా విడిచిపెట్టుట సంభవించియుండవచ్చును. అంతియేగాని క్రీ. శ. 1031 న సంవత్సరములో తనకు లభించిన తాత్కాలిక విజయము, ఆ తర్వాత నిత్యపదవీభ్రష్టభయము, విరామ మెరుగని యుద్ధవ్యాపారములలో మునిగితేలుచున్న క్లిష్టసమయములో వీరవిజయాదిత్యు డీ నిర్మాణమును తలపెట్టి విజయచిహ్నముగా నిల్పుకొనజూచినాడనుకొనుట పొసగని విషయము. వాదవకొరకు శ్రీ వర్మగారి వ్రాతనే అంగీకరించినా క్రీ. శ. 1035 వ సంవత్సరములో అసంపూర్తిగా వదలివైచిన మణ్డప నిర్మాణమును మరిసారి కీ. శ. 1061 లో వేంగీ రాజ్యాభిషిక్తుడై క్రీ. శ. 1076 వరకు పదేనువత్సరము లేకధాటిగా రాజ్యముచేసిన కాలములోనైనను తాను పూర్వము రకొరగా విర్మించి విడిచిపుచ్చిన మణ్డప నిర్మాణమును మరల చేపట్టి పూర్తిగావించి, తన విజయచిహ్నమునకు శాశ్వతస్థానము నేలకల్పించియుండలేదు? ఒక వేళ క్రీ. శ. 1035 వ సంవత్సరము తర్వాత నాతని నిర్జించి రాజ్యమునకువచ్చిన ప్రభువు లా నిర్మాణమును భగ్నమొనరించినారా? యన్న అట్టిదేమియు జరిగినట్లు తెలియనగుటలేదుగదా! కావున శ్రీ వర్మగారు తెలిపినటుల కరవాలభైరవ మణ్డప నిర్మాణము క్రీ. శ. 1031 వ సంవత్సరమునగాక క్రీ. శ. 1074 వ సంవత్సరములోనే నిర్మింపబడెననుటకు యెక్కువ అవకాశములున్నట్లు తేలుచున్నది. ఈ సందర్భమున శ్రీ వర్మగారి అభ్యర్థన ననుసరించి పరిశోధకుల 'ఓటు' యెటువైపు ప్రసాదింపబడవలసినచ్చునో చెప్పనవసరము లేదనుకొందును.

## జుత్తిగలో దంతేశ్వరి

ఈ ఉపశీర్షికలో శ్రీ వర్మగారు నా వ్యాసంలో కొన్ని ఉల్లేఖనలకు అభ్యంతరము తెలిపారు. అందు మొదటిది 'బస్తరు దంతేశ్వరికి జుత్తిగ దూతికకూ సంబంధం కాన్పించదు. దంతేశ్వరి భూదేవి. బస్తరు రాజ్య రక్షక. ఉగ్రరూపి. చక్రకూటాధీశులు శాక్తేయులు. అది సరైతే దూతికయే దంతేశ్వరి అయ్యుంటే దూతికకే ప్రాధాన్య మీయబడి 'వాసుకిరవి సోమేశ్వరు'ని రెండవ మెట్టులోనే (చక్రకూట సోమేశ్వరుడు) వుంచివుండేవాడు' అన్నది.

శ్రీ వర్మగారు యీ వ్యాసములోనే మరొకచోట 'దక్షారామ భీమేశ్వరుని దేవి మాణిక్యేశ్వరి దంతేశ్వరియే' అనిఅంగీకరించియున్నారు.నాగవంశీయులగు చక్రకూటా

---

*It was a general custom in the mediaeval period to setup lingas after the name of the deceased persons. Many instances may be cited in support of this statement from inscriptions them-selves. It must however be stated that there had been also the practice of establishing lingas after their own names and erecting shrines by living persons. In such instances, this act of piety would be done by them-selves and not by others.

ధీశ్వరుల కులదైవము మాణిక్యేశ్వరి. ఆమెయే దంతేశ్వరి. చక్రకూటాధీశులు వేంగీశ్వరులకు సామంతులగుట వలన గాబోలు! వారి యిలవేల్పు మాణిక్యేశ్వరి (దంతేశ్వరి)ని రాజచాళుక్యవంశమునకు యిలవేల్పయిన దక్షవాటి భీమయదేవునకు పత్నిగాచేసి పూజించారు. అందుచేత మాణిక్యేశ్వరి దంతేశ్వరి రూపమే! దంతేశ్వరి మాణిక్యేశ్వరి రూపమే! మాణిక్యేశ్వరికిలేని 'ఉగ్ర రూపము' దంతేశ్వరికి శ్రీ వర్మగా రాపాదించుటయేలనో దుర్గ్రాహ్యముగా నున్నది. దక్షారామ భీమేశ్వరు సన్నిధిని క్రిందిమెట్టులోనున్న దంతేశ్వరి (మాణిక్యేశ్వరి) జుత్తిగ సోమేశ్వరుని సన్నిధిని మొదటిమెట్టు నాక్రమింపవలసిన అవసర మేలకల్గనో శ్రీ వర్మగారు చెప్పవలసియున్నది. చక్రకూటాధీశులు జుత్తిగలో సోమేశ్వరుని మూలస్థానదేవరగా నిల్పి తమ కులదైవత మగు దంతేశ్వరిని పత్నిగా నిలిపియుందురని నేను వ్రాసియున్నాను. దక్షారామ భీమేశ్వరునికడ మాణిక్యేశ్వరిని నిలుపు విషయములోగూడ నీవిధముగానే జరిగినది. ఇందు శ్రీ వర్మగారు ఆశ్చర్యము ప్రకటింపవలసిన అవసరమేమియో తెలియకున్నది. అయితే దక్షవాటికలో మాణిక్యేశ్వరి ప్రతిష్ఠ భీమయనాయకుని ప్రతిష్ఠానంతరమని, భీమేశ్వర ప్రతిష్ఠాకాలము నాడు మాణిక్యేశ్వరి ప్రతిష్ఠ జరుగలేదని శ్రీ వర్మగారనుచున్నారు. జుత్తిగ సోమేశ్వరునితోపాటు దంతేశ్వరికూడ నేకకాలముననే ప్రతిష్ఠింపబడియుండునని నే నూహించినాను. ఇందు శ్రీ వర్మగారికి గోచరించిన విడ్డూరమేమి?

ఇంకొక విషయమిచట ప్రస్తావింపవలసియున్నది. వాసుకీరవిసోమేశ్వరస్వామి ప్రతిష్ఠ జరుగు కాలమున అమ్మవారివిగ్రహప్రతిష్ఠ (దంతేశ్వరిగానీ దూతికగాని) జరుగలేదనియే యనుకొందము. ఆ తరువాతికాలాన అమ్మవారి విగ్రహప్రతిష్ఠాపన జరిగియుండెనన్నచో నేకాలాన జరిగెనో తెలుపు శాసనాధారముండవలెనుగదా! ఉమాపార్వతీదేవి ప్రతిష్ఠాపనము క్రీ. శ. 1255 వ సంవత్సరమున జరిగెనని శాసనాధారమున చెప్పనగుచున్నది. ఇతర దేవళముల, పరివారదేవతావిగ్రహముల స్థాపనల దెలుపు శాసనము లర్వాచీనములో ప్రాచీనములో యేవియో ఒకటి లభ్యమగుచున్నవి. శ్రీ వర్మగారు 'ఆలయానివన్నీ శిలాశాసనాలు భద్రంగానేవున్నాయి. అందొకటికూడ పోయియుండలేదని' ధృవపత్రాన్ని ప్రసాదిస్తున్నారు. అట్టియెడ దూతికవిగ్రహప్రతిష్ఠాపన విషయమైన వివరముల దెలుపు శాసనమేమైనట్లు? అంతర్దూతిక; బహిర్దూతికల ప్రతిష్ఠలు జరిగియుండెనుగదా! అవి యేకకాలమున జరిగెనా? లేక విభిన్నకాలములందా? అట్లు జరిగినపుడు విగ్రహస్థాపనల దెలుపు శాసనము లేకుండ జరిగిపోయెనందురా శ్రీ వర్మగారు? జుత్తిగ దేవళములలో దూతిక, అంతర్దూతికల స్థానమేమని శ్రీ వర్మగారు నిర్ధరింతురు? సోమేశ్వరుని దేవేరి యందురా? లేక పరివారదేవతలలో నొకతె యందురా? అట్లయిన 'ఉమాపార్వతీ' స్థానమేమి?

ఇందు మరొక విశేషముగూడ పొడగట్టుచున్నది. వాసుకీరవిసోమేశ్వర లింగప్రతిష్ఠాపన వివరముల దెలుపు శాసనము కన్పడకుండగాపోయినట్లే దూతిక విగ్రహస్థాపనలకు సంబంధించిన వివరముల దెలుపు శాసనములుగూడ కన్పడకుండపోయినవి. ఈ విషయమును శ్రీ వర్మగారు తమ వ్యాసములో 'దూతికాదేవినిగూర్చిన ప్రసక్తి ఆ ఆలయాల శాసనాల్లోలేదు' అని అంగీకరించియున్నారు. తక్కిన అన్నివిగ్రహముల ప్రతిష్ఠాపనల వివరములు లభ్యమగుచుండ ముఖ్యమగు నీ దేవ, దేవుల విషయమును దెలుపు ఆధారములు లేకుండబోయినవన్న నేమనుకొనవలెను? చిరుదేవతల ప్రతిష్ఠాపనలకు ముందుగానే యీ రెండు విగ్రహముల ప్రతిష్ఠాపనలు జరిగియుండి యుండవలెనను నిర్ణయమునకు వచ్చుటలో తప్పేమైన యుండునా? ఆ పరిస్థితులలో సోమేశ్వరస్వామి, దూతికాదేవుల ప్రతిష్ఠాపన యొకేసారి జరిగియుండ వచ్చునని యూహ సేయుటలో తప్పేమి?

'జుత్తిగ, నత్తా రామేశ్వరం శాసనాల్లో క్షేత్రనామం 'దుత్తిక.' ఆ శబ్దమే జుత్తిగగా మారియుండుమగాని, దూతికేశ్వరి, దంతేశ్వరి పేరిట మాత్రంగాదు' అని ఒక నిర్ణయాన్ని శ్రీ వర్మగారు ప్రకటించారు. నేను నా వ్యాసంలో దంతేశ్వరి దూతేశ్వరి అయి దూతికగా మారియుండున సూచన చేసితినిగాని యీ దూతికపేరనే గ్రామనామము 'జుత్తిగ'గా మారెనని యెచ్చటను చెపి యుండలేదు.

జుత్తిగదేవుని ప్రతిష్ఠాపన వివరములు దెల్పు శిలాశాసన మరుగుపడి యుండాలి.' అన్న నా

మాటను అవహేళన చేయుచు, శ్రీ వర్మగారు 'మర్యాద రామన్న చరిత్రలోని అభియోగ పరిష్కార వైఖరిలో 'దాచబెట్టిన ఇనుము యెలుకల పాలైనదని' యెత్తిపొడుపు వాక్యముతో సంతృప్తిపడ్డారు. అయితే వారు వెంటనే 'ప్రతిష్ఠ చేసిన శాసనాలు కొన్ని సందర్భాల్లో వేరొక తావున లభించినవైనం ఉంది' అంటూ అంగీకరించారు. వారి వచనానుసారమే యీ శాసనంకూడ స్థానచలనానికి పాల్పడియుండి, ప్రస్తుతానికి కనుమరుగై యుండియుండవచ్చునని వారేల అనుకొనరు?

## చక్రకూటేశ్వరుని వేంగీ విజయం

చక్రకూటేశ్వరుడు వేంగీ విజయాన్ని సాధించాడన్న విషయమును శ్రీ వర్మగారు నమ్మటలేదు! అందులకు వారు క్రీ॥ శ॥ 1065—75 సంవత్సరములమధ్య వేంగీ రాజ్యమునకు సంబంధించిన చోళ, చాళుక్య, చక్రకూట, కళింగ భూపతుల సమగ్ర చరిత్రను, పరస్పర విజిగీషాయత్నవివరములను, ప్రవర్తిల్లిన యుద్ధ సమాచారములను, జరిగించిన అకాండ తాండవ ప్రస్తావనలను ఒక చరిత్రగా వ్రాసి అధిక శ్రమకు పాల్పడినారు. ఇంత ప్రయత్నమును వారు 'చక్రకూటేశ్వరుడు వేంగీ విజయాన్ని సాధించనేలేద'ని నిరూపించుటకే చేసినారు!

చక్రకూట సోమేశ్వరుని 'కృష్ణపురశాసనము' (**Epigraphia Indica Vol. X. No. 4**) ను వారుచూడకనే యందు వేంగీవిజయ ప్రసక్తియెల్ల 'డంబములు' గాను 'కీర్తిమాత్రాకరములు' గానునిర్ధరించినారు. అయితే వారు శాసనస్థ విషయాలను ఒక్కకలం పోటుతో కాదని వాదించ సమకట్టుతూవుంటే యింకే మనవలె? 'గజంమిథ్య, పలాయనం మిథ్య'గా శ్రీ వర్మగారు చక్రకూటేశ్వరు డసలు వేంగీ రాజ్యముపై దండెత్తి వచ్చియుండియుండడని వాదించుచున్నారు! అట్లు జరుగలేదనే నమ్ముచున్నారు! ఒకవేళ జరిగినా, వేంగీదహనకాండ ఒక్క చక్రకూట సోమేశ్వరు డొక్కని వలననే జరుగలేదన్నారు! ఏమేమో— అన్నారు! నా వ్రాతలు సమర్థనీయములు గావన్నారు!

## జుత్తిగ దేవుని ప్రతిష్ఠాతలు

ఇంతటితో మిన్నకుండక శ్రీ వర్మగారు వాసుకి రవి సోమేశ్వరు ప్రతిష్ఠాతలుగా నే నూహించి నిర్ణయించిన వ్యక్తుల తీరు మేనమామ పోలికగా ఉన్నవంటూ వారి స్వంతయూహలతో మేనమామ పోలికలుగల వ్యక్తుల పట్టికలను పాఠకులకు సమర్పించారు! ఇందేది సత్యమో, ఏ దసత్యమో నిర్ధరించమని పాఠకులపై భారం మోపారు! ఆఖరుకు 'ఎక్కడ వేసిన గొంగళి అక్కడే' అన్నట్లు జుత్తిగదేవుని ప్రతిష్ఠాత లెవరు? అన్న సమస్యను అపరిష్కృతంగానే విడిచివైచారు! 'వద్దన్నా కద్దన్నా నేనే అనాలి. కోడలుపిల్ల యెవరు?' అన్న అత్తగారి అధికార చిత్తవృత్తి నుపమించుదీతిని 'జుత్తిగలోనేగాదు—వేంగీలో ఎక్కడ ప్రతిష్ఠించినా ప్రతిష్ఠాతలు వేంగీశ్వరులైయుండాలిగాని దండయాత్ర చేసి, దగ్ధంచేసి వెళ్లిపోయిన వీరులుమాత్రంకాదు' అని తమ అనుశాసనాన్ని ఆఖరిమాటగా అందించారు!

శ్రీ వర్మగారి తుదిమాటలలో గల నిజానిజాలు భావి పరిశోధనలలోగాని బయల్పడవు. ఆ సుదినంకోసం యెదురుచూస్తూ నే నింతటితో విరమిస్తున్నాను.

———

# స్థిరచరాస్తులు గదిలోనే వుంచిరా...

## శ్రీ పణతుల రామచంద్రయ్య

స్థిరచరాస్తులు గదిలోనే వుంచిరా—
తేలి కవుతుంది నీ ప్రయాణం.
అక్షయ స్వేచ్ఛామార్గంలో అడుగువేస్తే తప్ప
అందదు నక్షత్రాల కరచాలనం.

దినకృత్యాల్లోకి తొంగి చూస్తావా 'స్థిరం' కోసం?
కనిపిస్తాయి వ్రేళ్లూనిన నిట్టూర్పుల చెట్లు.
నేత్రద్వయం లోపలికి మళ్లిస్తే 'చరా'న్ని చూపిస్తాయి
నీ రక్తాన్ని జయించే నాసిరకం గగుర్పాట్లు.

కాసేపు గడియారాన్ని కూడా
గదిలోనే వుంచి రావటం మంచిది
లేకపోతే వెనక్కిపోయే క్షణాలన్నీ
లెక్కపెట్టాలనిపిస్తుంది.

విలువ చేస్తాయా ఈ క్షణంలో క్షణాలు? అలా చూడు—
విశ్రమించే కొండలకోసం నీడలు పరచే మైదానం.
అవకాశంచూసి సరసాలాడే కొండల జంటను వారిస్తూ
ఆకాశంలోని వెలుగుల్ని మూడమంటున్న ప్రవాహం.

ఇంతకాలం వుంచుకున్న నగరంలో ఏం దొరికింది నీకు?
ఏదో దొరుకుతుందన్న ఆశల గ్రీష్మాతపాల చురుకు.
ఆ సరిహద్దుల కీవల ఈ దారుల్లో పేరుకున్న నిశ్చలత్వం
అవుతుంది కాకలెత్తిన ఆత్మలకు తుషార వర్షపాతం.

ఇంతకాలం వుంచుకున్న నగరంలో ఏం దొరికింది నీకు?
సంతోషంలా భ్రమగొలిపింది మేలి ముసుగులోపలి చీకాకు.
ఆ నవ్వు మాసిపోతుంది
ఆ పువ్వులో మకరందం లేదని తేలిపోతుంది.

ప్రవాహం కౌగిలించుకునే నల్లబండలమీద
పచ్చగా కదిలే పిచ్చి మొక్కలు చూడు.
ప్రవాహం ఒడిలోని కొంగల తెల్లదనాలను
పంచుకుంటున్న మబ్బు ముక్కలు చూడు.

సృష్ట్యాదిలోని సంక్షోభంలోంచీ ప్రకృతిమాత
సృష్టించే అలౌకిక వ్యవస్థ యిది–
సృష్టిలోని చిత్రకారుల ఊహలన్నీ ఒకచోట
చేరినా రూపెత్తని పటంలాగుంది.

ఈ స్మైదానం గుండె కింద నిక్షిప్తం ఆనందం
ఇదే నీకు స్నైదోడై నడచి వచ్చే నేస్తం.

స్థిరచరాస్తులతో గడియారంతోబాటు కాసేపు దూరంగా
గిరవాటు వెయ్యి నీ పుస్తక జ్ఞానం.
విద్వాంసుడి నోరుమూసి నీదైన హృదయాన్ని తెరిస్తే తప్ప
వినిపించదు నీకు విశ్వవీణాగానం.



# నదురుబాదా శిలాశాసనము

## శ్రీ ముసునూరి సాంబశివరామమూర్తి

1. నప్తా కాటయ శౌరేః పౌత్రో (మా) -
2. రస్య కాటనృప సూనుః వీరాన్న పో
3. త నృపతేః జామాతా జయతు
4. వేమ భూపాలః స్వస్తి శ్రీ శక
5. వర్షంబులు 1332 అగు (నే)ంటి
6. వికృతి స(ంవ్వత)్సర మార్గ్గశీర్ష (—)
7. గు కొమరగిరి అయ్యం గా (రి) కి
8. పరమ హితుండయి (న కాటమ)
9. రెడి (్డ వేమా)య రెడ్డిం (గారు తమ)
10. (కు స్వామి) అ న ఆ (కొమరగిరి)
11. (అయ్యంగా)రే యీ కొమరగిరి
12. (అయ్యంగారై) అవథరించిన యీ
13. కొమరగిరి అయ్యంగారికి తల్లి
14. గారయిన తల్ల (సాసం) మ్మంగా
15. రు యీకొమరగిరి అయ్యం గా
16. రి కిన్ని కాటమరెడ్డి వేమాయ రె
17. డ్డిం గారికిన్ని సుకృతముగాను శ్రీ గౌ
18. తమీ తీరమందును వేదాద్రి శ్రీ
19. నరశింహ్వ దేవరకును ఆ చం
20. ద్రాకర్కము ప్రతి సంవ్వత్స
21. ర తిరునాళ మహోత్సవాన
22. కును వెలుచూరు (తల్లనీ) ర
23. వరము అని పేరను ధార
24. వోశి సమర్పణ చేశిరి.
25 మంగళ మహా శ్రీ శ్రీ శ్రీ
26. ం జేయును.

**శాసన స్థలము :**

తూర్పు గోదావరిజిల్లా, రామచంద్రపురము తాలూకాలో రామచంద్రపురమునకు ఉత్తరముగా సుమారు 4 కి. మీ. దూరమునఉన్న 'నదురు బాదా' గ్రామమునగల విష్ణాలయమునందు ధ్వజస్తంభమునకు ముందు నిలిచిన గరుడాళ్వారి శిలాస్తంభమున ఈ శాసనమున్నది.

**గ్రామపరిస్థితి :**

పురాతన గ్రామమగుటచే ఎక్కువ **లోతుగా** పాటిమట్టి (దిబ్బ)గల చిన్నగ్రామము. రామచంద్ర పురమునుండి నదురుబాదా వఱకు ప్రత్యేకమైన మెటలు రోడ్డు కలదు. ఊరుచిన్నదైనను మధ్య భాగము మిక్కిలి ఎత్తైన (దిబ్బగల) ప్రదేశము. ఆ గ్రామమునంటి పడమటి దిక్కున (ఉత్తర దక్షిణ ములుగా) దక్షిణ దిక్కున పడమర దిక్కులుగా నొకబాడవ (ములుగుడు కాలువ) గలదు. అచ్చట ఒక నిలువు లోతున ఎక్కువ ఇసుకబొమ్మలు ఉండుటచే పూర్వమదియొక చిన్నగోదావరి సంబంధ మైన (చిన్న ఏఱు) బాడవగా దోచును. ఆ యూర చాలవఱకు ఎచ్చట త్రవ్వినను గట్టి ఎర్రమట్టి కుండలు (పెంకులు) శల్యములు, పెద్దపెద్ద యిటు కలు దొరికినవి అని గ్రామస్థులు చెప్పుచున్నారు.

**దేవాలయములు :**

శివకేశవుల ఆలయములు రెండును ఒకే ప్రాకారమున (ఒక దానిప్రక్క నొకటి) ఉన్నవి. అవి క్రొత్తగా (ఒక్క శతాబ్దము లోపుగా) కట్ట బడినవి. కాని వాటికున్న సోమసూత్రములు వరాహ ముఖములై పురాతనపువై యున్నవి. అంతేగాక యొకచిన్న (సుమారొక మూరెడు చదరముగల) ఇసుకరాతి పానవట్టము (సోమసూత్రముతో కలి సియే) వేఱుగాపడి యున్నది. అందువలన పురాతన ఆలయముండి ఆ జీర్ణాలయపు అవశేషముల జీర్ణమగుట వలన జలనిక్షేపము గావించినట్లు దోచును. అయితే ఈ ఆలయములు రెండును గ్రామ మధ్యమునలేక కేవలము వాయవ్యదిశను పల్లపు ప్రదేశమున (బాడ వకు సమీపముగా) నిర్మింప బడినవి.

**శిలాశాసనము:**

ఆవిష్ణాలయమున ధ్వజస్తంభమునకు దగ్గరగా ఉన్న ఈ శాసన శిలాస్తంభము నిలువున జాగ్రత్తగా

ఛ్ర్రదముగా (పాతి) యుంచి ఆ ప్రదేశ మంతయు సిమ్మెంటు చేయబడి యున్నది.కావున దానిని ఎవరును వేరొక చోటుకు తరలింప వీలులేదు. ఛ్రదముగానే యున్నది. అది 125 సె.మీ. ఎత్తును, 35 సె. మీ. వెడల్పును, 25 సె.మీ. మందముగల లెలుపు ఎఱుపు రంగులుగల మిశ్రవర్ణపు శిలాస్తంభము. అందు 26 పంక్తులు (అక్షరములు) గలవు. ఆ పైన (శీర్షాగ్ర మున) 35 సె. మీ. వెడల్పును. 45 సె. మీ. ఎత్తును గల రెండు పక్షి రెక్కలతోనున్న గరుడాళ్వారి విగ్రహము ఆ స్తంభమునందు (అతుకులేకనే) ఉన్నది. అయితే శిలాశాసనమునందు 5, 7, 8, 7, 10, 11, 12, 14, 22 పంక్తులలో కొన్ని అక్షరములు పెచ్చు పెచ్చులుగా ఊడిపోయినవి. అచ్చట చాలవఱకు అక్షరపు గుర్తులేలేవు. అంతే గాక 5 పంక్తిలో 1333 అని వ్రాసి తిరిగి దానిని 1332 గా సవరించుటలో '2' అడుగున రేఖా చిహ్నమును వెనుక గల '33' అను రెండంకెలకు మధ్యగా పోనిచ్చెను. అంతలో ఊరుకొనలేదు. పంక్తి ప్రారంభమునగల అక్షరముల గమనింప 'విరోధి'అని వ్రాసి తిరిగి దానిలో 'రోధి' అను రెండక్షరములను 'కృతి'గా మార్చి దిద్ది 'విరోధి'ని 'వికృతి'గా మార్చెను.

**శాసనలిపి భాష :**

శాసనలిపి అంతయు 14 వ శతాబ్దపు (పురాతనపు తెలుగు) హళ కన్నడలిపి. లేఖాచార్యుని పేరులేదు. లిపి బాగుగనే యున్నది. కాని అక్షర ములు సమముగాలేక చిన్నపెద్దలుగాను పంక్తులు కొద్దిగ వంకర (చిన్నఏటవాలు)గాను యున్నవి. శాసన భాషయందు ప్రారంభమున నొక సంస్కృతశ్లోకము గలదు. తక్కిన శాసనభాగమంతయు తెలుగుభాషయే. 10 పంక్తిలో 'అయి' అనుటకు బదులుగా 'అ ఇ' అని 'యి కారమునకు బదులుగా 'ఇ'కారము (హల్లు నకు బదులు అచ్చును) వాడియుండెను. అప్పటి వ్రాతలో ఆ యలవా టుండెడిది కావచ్చు 12 పంక్తిలో 'అవతరించి' అనుటకు 'అవథరించి, అని ('త'కు బదులు 'థ') వ్రాసెను. కొంతమంది ఛాంద సులు ఇప్పటికి యిట్టి (ఒత్తు అక్షరముల) వ్రాతలు వ్రాయు నాచారము గాన్పించుచున్నది. 7, 7, 11, 12, 13, 14, 15 పంక్తులందుగల, 'అయ్య' 'అమ్మ' 'రెడ్డి' పదములకు తుదిని 'ం' బిందు సంయుక్తము గావించిరి. అదియు ఛాందసుల వ్రాత లలో గౌరవసూచకముగా గాన్పించును.14,21 పంక్తు లందు గల 'సంవత్సరము' 'సానమ్మ' అను పదము లందుగల్ల ద్విత్వములకు పూర్వము బిందు సంయు క్తము గావించి... 'సంవ్వత్సరము' 'సానమ్మ' అని వ్రాసెను. ఇదియును పూర్వులగు ఛాందసుల (తాటాకు పొత్తముల) వ్రాతలందు గానవచ్చుచున్నది. 17, 'నరశింహ్వ' 24 'హశ' 'చేశిరి' అను వాని యందు 'స' వర్ణమునకు మాఱుగా 'శ' వర్ణము వ్రాసిరి. ఇదియు పై ఛాందసుల వ్రాత సాంప్ర దాయమే. 17 పంక్తి 'గాను' 18 'తీరమందును' 18 'దేవరకును' 22 'కును' అను వ్రాతల యందలి 'ను'కారసముచ్చయము పైవిధమైనదే.

**శాసన విషయము :**

కాటయ (మ) రెడ్డిగారి మునుమనుమడున్ను; మారయరెడ్డిగారి మనుమడున్ను; కాటప్రభు కుమారుడున్ను వీరాన్నపోతారెడ్డిగారి అల్లుడును అయిన (కాటమ) వేమభూపాలునకు జయము. శక వర్షములు 1332 వికృతి సంవత్సర మార్గశిర... కొమరగిరిరెడ్డిగారికి మిక్కలి చెలికాడును, అయిన కాటమరెడ్డికి ప్రభువగు ఆ కొమరగిరిరెడ్డిగారే (ఈ కాటయ వేమారెడ్డిగారికి పుత్రుడైన)యీ కొమరగిరి రెడ్డిగారై (జన్మించుటచే) యీ కొమరగిరిరెడ్డిగారికి తల్లిగారైన 'తల్లసానమ్మగారు' యీ కొమారరెడ్డి గారికిన్ని కాటమరెడ్డిగారికిన్ని సుకృతము (అభివృద్ధి) కలుగు నిమిత్తము 'వెలుచూరు' అను గ్రామమును 'తల్లవీరవరము' అనుపేరున గౌతమీతీరమందుగల శ్రీ (కోరుకొండ) వేద్రాది నరసింహస్వామివారికి ప్రతిసంవత్సరము జరుగు తిరునాళ్ల (కల్యాణ) మహోత్సవమునకుగాను ఆచంద్రార్కము చెందు నటుల వ్రాసియిచ్చిరి.

**గమనింపవలసిన విషయములు :**

(1) శకవర్షంబులు '1333—'1332' విరోధి' 'వికృతి' అని ఒక దానిపై వేరొకటి వ్రాసియుండెను. అందుచే శ. శ. సంవత్సరముగాని 'విరోధి' 'వికృతి' సం.గాని స్థిరపఱుప వీలుకలుగ లేదు. అయితే ఈ శాసనము నుదాహరించి అహో

బలశాసనము క్రీ. 1410 కి సమమైన శా. శ. 1333 వికృతినామ సం॥ కే సరిపోవుచున్నది. అహోబల శాసనము మాఘమాసమునందు వ్రాయ బడియుండగా ఈ వెల్చూరు 'తల్లవీరవరమును' మార్గశిర శు 14 శ్రీ నృసింహజయంతి నాడే వ్రాసియుండెను. కావున ఈ శాసనము క్రీ. శ. 1410 కి సమానమగు శా. శ. 1333 వికృతి నామ సం॥ నందే వ్రాయబడియున్నది. లేఖకుని ఈయొక్క తప్పును సర్దుబాటునుకూడ ఒక దానిపై నొకటియుండుట విస్పష్టముగాక యీ క్లిష్ట పరిస్థితి యేర్పడెను.

## (2) 'తల్లవరమా?' 'తల్లవీరవరమా?'

ఈశాసనమునందు 'వెల్చూరు' (22పంక్తిని) తరువాత 3 అక్షరముల జాగాకు సరిపడిన పాఠ ఊడిపోయినది. కాని అహోబల శాసనపాఠమునందు (S. I. I. Vol. X. No. 577 P. 319—320.) 'వెల్చూరు' 'తల్ల వరము' అని ప్రచురింపబడినది. అయితే ఈ శాస నమునందు అందుకు భిన్నముగా గాన్పించుచున్నది. 'తల్లవరము' అయినచో 23 పంక్తిలో 'వరము' అని యున్నది. గనుక 22 పంక్తిలో 'వెల్చూరు' తరువాత 'తల్ల' అను రెండక్షరములుమాత్రమే యుండవలెను. అట్లుగాక మూడక్షరముల జాగాయు చివర 'ర' అను అక్షరమును మొత్తము నాలుగక్షరములు గలవు. అహోబలశాసనమును అనుసరించి మొదటి రెండక్షర ములు 'తల్ల' అని యుండుట కాక్షేపణలేదు. మిగిలిన రెండక్షరములలో మొదటి అక్షరము లోపించినను చివర అక్షరము 'ర' స్పష్టముగానున్నది. అనగా 3, 4 అక్షరములలో మూడవ అక్షరము 'ర'కారాంతముగల పదమై అన్వర్థనామధేయమై యుండవలెను. తల్ల సానమ్మగారిచే దానముగావింపబడినందున 'తల్ల' అను పేరు ఆదిని చేర్చబడినది. కాని మిగిలిన రెండక్షర ములు అన్వర్థనామము కావలేనన్న 'శూర', లేక 'వీర' లేక 'పేర' అని యుండవలెను. అపుడది 'తల్లశూర వరము' లేక 'తల్లవీరవరము' అని అగును. ఈ 'శూర' 'వీర' శబ్దములు వీరపౌరుష సూచకపదములు. అందు వలన ఒక ప్రయోజనమును ఆశించి భగవంతునకు (శ్రీ వేద్రాది నృసింహస్వామికి) వీరశుల్కముగా నీయ బడియుండును. అందువలననే ఈ వెల్చూరు గ్రామ మునకు సార్థనామమగునట్లు 'తల్లవీరవరము' అని పెట్టియుండవలెను. అయితే ఈ శాసనము వ్రాసిన రెండునెలలకే అహోబలశాసనము వ్రాయబడియుండగా 'తల్లవీరవరము' అనుదానిని 'తల్లవరము' అని వ్రాసెనను యోచన రాగలదు. ఈ శాసనమునందు గాని ఆ శాసనమునందుగాని లేఖకుల పేర్లులేవు. అందుచే లేఖకులు ఇర్వురై (భిన్నులై) యుందురు. అంతేగాక క్రొత్తగావచ్చిన స్థానీయలేఖరి 'వరవర' అనునది ఆమ్రేడితముగానెంచి అర్థముగాకనో, పొర పాటుననో వ్రాయవిడుచును.

శ్రీ వేద్రాది నృసింహస్వామికి 'వీరశుల్క ముగా' గ్రామమును ఇచ్చుట సార్థకమగును. అందుకు పరిశీలించిన, కాటయ వేమారెడ్డి జైత్రయాత్రకు బోవు సమయమున ఇష్టదైవమునకు సస్యసమృద్ధ మైన గ్రామమిత్తునని మ్రొక్కుటయు, ఆ జైత్ర యాత్రానంతరము ఆ మ్రొక్కు చెల్లించుటయు ఆచారమై యున్నది. అందుకు నిదర్శనము తన బావ మఱదియగు కొమరగిరిరెడ్డి ఆదేశానుసారమున యువ రాజైన అనపోతారెడ్డితో గలసి కళింగదేశ జైత్ర యాత్రకుబోవు సమయమున రాజమహేంద్రవరము నందలి వేణుగోపాలస్వామివారికి సస్యసమృద్ధమగు గ్రామమును నివేదింతునని మ్రొక్కుటయు, ఆ జైత్ర యాత్రానంతరమందు సారవంతమైన పరమ పవిత్ర వంతమైన తుల్యాతీరమందు గల గ్రామమును (సర్వ సస్య సంపత్కరమైనది) అనపోతారెడ్డి పేరున 'అన పత్తి' అను పేరుతో రాజమహేంద్రవమునందలి శ్రీ వేణుగోపాలస్వామివారికి నివేదించుటయు అనుపత్తి తామ్రశాసనమే చాటుచున్నది.

అట్లే ఈ వెల్చూరు శాసన కాలమునాటికి కాటయ వేమారెడ్డికిని ఈతని శత్రువుతోచేరివ అన్నదేవరచోడ, వీరభద్రులతో ఎడతెగని యుద్ధములు జరుగుచుండిన కాలము. అన్నదేవరచోడ వీరభద్రులు కాటయవేమునితో విరోధించి గోదావరి యుత్తరతీర మందలి మన్యపురాజ్యమును (కాటయవేముని రెడ్డి సామంతులదళమి) ఆక్రమించుటయు, అందుచే కాటయవేముడు వారిపై గోపించి యుద్ధముగావించి ఓడించి పాఱద్రోలి ఆ రాజ్యము నాక్రమించుటయు, అందుచే ఆ అన్నదేవర వీరభద్రులు కాటయవేముని ప్రత్యర్థియగు కోమటివేమునిచేరి (కాకరపర్తి)

యుద్ధమున కాటయవేముని ఓడించిరి. ఇట్టి తరుణములో కాటయవేమునకు అన్నదేవరచోడ, వీరభద్రులకు యుద్ధములు జరుగుకాలమందు తన భర్తయగు కాటయ వేమునకును అతని కుమారుడైన కొమరగిరి రెడ్డికిని (ఈ కొమరగిరిరెడ్డి అప్పటికి జీవించి యుండెననవచ్చును) సుకృతము (జయము, అభివృద్ధి, కీర్తివగైరాలు) కలుగు నిమిత్తమై ఈ వెల్చూరు గ్రామమును (గోదావరి మండలములోనిదై తుల్యాతీర సమీపమున ఫలసస్యసమృద్ధమగు గ్రామము) ఆ గోదావరీ తీరమందే తన భర్తగారగు కాటయ వేమారెడ్డిగారు జయించిన ప్రదేశమందేయుండి నూత్నముగా స్థాపింపబడి (అర్ధశతాబ్దము పూర్వమందు) పేరు వడయుచున్న వేదాద్రి (కోఱుకొండ) నరసింహస్వామివారికి కృతజ్ఞతాపూర్వకముగా వీరశుల్కముగా తనపేరుననే 'తల్ల వీరవరము' అను పేరున ప్రతిసంవత్సరము జరుగు తిరునాళ్ల యుత్సవము నిమిత్తము ధారపోసెననుట అర్థయుక్తముగా గాన్పించుచున్నది. కావున ఈ వెల్చూరు గ్రామము 'తల్లవీరవరము' అయినదికాని తల్లవరము కానేరదు—

## 4. నదురుబాదా (వెల్చూరు) :

ఈ తల్లవీరవరగ్రామమునకు దొల్తటి పేరు వెల్చూరుఅనియున్నది. ప్రస్తుతము దానికి 'నదురుబాదా' అను నమోజు కలదు. బాగుగా నాలోచింప దీనికి ఇంతకుముందు 'నజరుబాదా' అని యుండెననవచ్చును. ఏలనన 'నజరు' అనగా కానుక, బహుమతి అను నర్థముకలదు. ఈ వెల్చూరు గ్రామము శ్రీ వేదాద్రి (కొఱుకొండ) నరసింహస్వామివారికి కానుకగా సమర్పింపబడినది. కావున మహమ్మదీయులకాలమందు ఆ కానుకను గుర్తింపజేయు పదముగా 'నజరుబాద్' అన్వర్థనామమై క్రమక్రమముగా జానపదుల సాంప్రదాయమున అపభ్రంశమై 'నదురుబాదా' అని నేటికి నమోజు కాబడియున్నది. అందుచే వెల్చూరు 'తల్ల వీరవరమై' 'నజరుబాదా'అయి తుదకు నేడు 'నదురుబాదా'గా పిలువబడుచున్నది.

## 5. (వెల్చూరు) :

వెల్చు + ఊరు = వెల్చూరు = నాగుల గ్రామము. వెలుచు + ఊరు = వెల్చూరు = విడువబడిన=వెలివేయబడిన గ్రామము అను అర్థములు కలదిగా దోచుచున్నది. అందుకు నిదర్శనముగా ఆ గ్రామము చిన్నదైనను గ్రామమధ్యమున సుమారు 8 అ. ఎత్తుగల మట్టిదిబ్బపై గృహములు వృక్షములు గలవు. ఆ గ్రామమంతయు మిక్కిలి లోతుగల పాటిమట్టిగలది. అందెక్కడ త్రవ్వినను రాకాసి యిటుకలును, అస్థికలును, ఎఱ్ఱమట్టి కుండలును ఎక్కువగా దొరకుచున్నట్లు ఆ గ్రామస్థులు తెలుపుచున్నారు. ఆ యూరునంటి పశ్చిమము, దక్షిణము లందు పెద్దబాడవ సంబంధమైన ముఱుగుకాల్వ గన్పడుచున్నది. దానికి తూర్పుభాగమున ఒక కిలోమీటరు దూరమునగల మాలపాడు గ్రామమున పురాతనమైన బుద్ధవిగ్రహము కలదు. కావున ఈ గ్రామము పూర్వము బౌద్ధాశ్రమమై వేదవిదులగు శిష్టాచార సంపన్నులకు వెలియై యుండుటచే 'వెలుచు + ఊరు = వెల్చూరు' అను సార్థకనామమును బొందియుండి నటుల దోచును. అంతేగాక ఆదిని బౌద్ధము దక్షిణ హిందూస్థానమున జనసామాన్యమగు క్రింది జాతులలో (వెల్చు=నాగు = పూజ్యము=వ్యతిరేకార్థమున నీచము) ప్రబలియుండుటచే నా సాంప్రదాయముననే వెల్చు + ఊరు=వెల్చూరు సార్థకమైనట్లును తోచుచున్నది. కావున తొలుదొల్త బౌద్ధాశ్రమ స్థానమైన 'వెల్చూరు' గ్రామమై, ఆ పిదప కాటయ వేముని కాలమున గౌతమీతీరమందలి వేదాద్రి (కోర్కొండ) నరసింహస్వామికి వీరశుల్కముగా నర్పింపబడుటచేత నాడు దాతపేరిట 'తల్లవీరవరము' అను గ్రామముగా ప్రసిద్ధమై, మహమ్మదీయుల కాలమందు శ్రీ వేదాద్రి నరసింహస్వామివారికి కానుకగా నీయబడిన గ్రామమును స్వాధీనముజేసికొనిరన్న సార్థకనామమున 'నజరుబాదా' గ్రామమై, రానురాను జానపద అపభ్రంశమున నేడు 'నదురుబాదా' అను పేరున ఒప్పారు చుండెను.

ఈ శిలాశాసనమును సరియైన ప్రతిబింబము తీయుటకు ఎంత ప్రయత్నించినను అది పాషాణము కాకుండుటచే నునుపుగాని తుదకు సమమట్టముగాని లేకున్నది. అంతియేగాక మధ్యమధ్య చాలవఱకు పెచ్చులులేచిపోవుటచే చాల అక్షరములు శిథిలమై పోయినవి. అందుచే ఆ కాలమునందలి ఆ కాటయ వేముని శాసనపాఠముల గమనించి అక్షరలోపముల పూర్తిగావించుకొనవలసి వచ్చినది.

# లా మ్యారేజ్

## శ్రీమతి జి. పరిమళాసోమేశ్వర్

నారాయణరావు ఆరోజే ఆఫీసులోకి కొత్తగా ప్రవేశించేడు.

సన్నగా, పొడుగ్గా రివటలాఉన్న అతని ఆకారం ఆఫీసులోని వారందరికీ కొంత ఆశ్చర్యాన్నీ, నవ్వునూ రెంటినీ కలిగించింది.

దానికి తగ్గట్టు అతని హావభావాలు అతని ప్రవర్తనకూడా చాలా వింతగా ఉన్నయ్.

ఆఫీసులోకి ప్రవేశిస్తూనే నల్లగా, లావుగా, పొట్టిగావున్న లేడీ టైపిస్టుని, ఎర్రగా, సన్నగా, పొడుగ్గాఉన్న మరో ఉద్యోగినిని యిద్దరినీ కళ్ళు పెంచుకుని మరీ చూసేడు.

లేడీ టైపిస్టు క్లారెన్సుకి పెళ్ళి కాలేదు. రెండవఆమె, జానకి ముగ్గురుపిల్లల తల్లి. ఇద్దరూ కూడా ఇరవైలోని ఉత్తరార్థంలోకి అడుగుపెట్టిన వాళ్ళవటంవల్లను, దాదాపు ఏడెనిమిది సంవత్సరాల ఉద్యోగానుభవం కల వారవటం వల్లను అతని చూపులకు భయపడలేదు, ఆశ్చర్యపోలేదు.

కాని అంతవరకు పురుషులలో తాముచూసిన చూపులకి భిన్నంగా అతనిచూపు లున్నాయని మాత్రం యిద్దరూ మనసులోనే అనుకున్నారు. అతని చూపులు 'థర్డ్‌క్లాస్‌గా' ఉన్నాయని క్లారెన్సు అంది లంచ్ టైములో.

'లేదు. ఫ్రస్ట్రేటెడ్‌గా ఉన్నయ్ అతనిచూపులు' అంది జానకి.

మొత్తానికి వాడు ఉత్తవెధవ అని మొదటి రోజునే తేల్చేసుకున్నా రిద్దరూను.

నారాయణరావు మొదటిరోజునే తోటి ఉద్యోగస్థు లందరిపేర్లు, చిరునామాలు, వయస్సు, వివాహితులా కాదాఅన్న విషయం, పిల్లలసంఖ్య మొదలైనవన్నీ పేరు పేరునా అడిగి వివరాలు తెలుసుకున్నాడు.

అతనికి పెళ్ళయిన మగవాళ్ళకంటే పెళ్ళికాని మగవాళ్ళంటేనే కొంచెం యిష్టం ఏర్పడింది.

'మీకు పెళ్ళయిందా?' అని ఒక రడిగిన ప్రశ్నకు 'ఓ కాకేం? అయింది. మాది లా మ్యారేజి!' అంటూ గర్వంగా చెప్పుకున్నాడు నారాయణరావు.

అందరూ ఒకరిమొహంఒకరు చూసుకున్నారు.

'నిజంగానా? మీది లా మ్యారేజేనా?' అని ఉండబట్టలేక మరోసారి అడిగేడు వెంకట్రావు ఆత్రంగా.

'ఔను—మేమిద్దరం ఒకరి నొకరు గాఢంగా ప్రేమించుకున్నాం. మాయిద్దరి కులాలూ ఒకటి కాదు. అందువల్ల మా పెద్దవాళ్ళు మాపెళ్ళికి అంగీకరించలేదు. ఐనా మేమిద్దరం ధైర్యంచేసి, యింట్లోనుండి పారిపోయి, తిరుపతిలో పెళ్ళిచేసుకొన్నాం...' అన్నాడు.

ఆఫీసులో చేరిన మొదటిరోజునే పదిమంది కొత్తమనుషులముందు అతనలా నిర్లజ్జగా నిస్సంకోచంగా తన పెళ్ళివిషయాన్ని చెప్తుంటే వినటానికి వాళ్ళకే మొహమాటం కలిగింది.

వెంటనే ముఖాలు తిప్పించుకుని తమ పనుల్లో మునిగిపోయేరు వాళ్ళంతా. మనసులో మాత్రం అతని యెడల ఒకరకమైన కుతూహలం ఏర్పడినమాట నిజం.

'వాడిమొహం చూసి ప్రేమించిన దౌర్భాగ్యురాలెవరో!' అంది కొంచెం అసూయగా క్లారెన్సు.

'ఏం? వాడిమొహం నీమొహం కంటె తీసి

పోయిందా?' అని జానకి మనసులోనే అనుకుని పైకిమాత్రం '(పేమించేవాళ్ల మొహాలుచూసి (పేమిస్తారేమిటి? కంటికి కనపడనివాటిని చూసే (పేమిస్తారుగాని' అంది.

క్లారెన్సు ఆమెవంక చురుకుగా చూసింది. ముగ్గురుపిల్లల తల్లిఅయిన జానకి నోటివెంబడి (పేమనిగురించి అభి(పాయం—అందునా ఆ రీతిలో వెలువడటం ఆమెకి ఆశ్చర్యాన్నే కలిగించింది.

పదిరోజులు గడచేసరికి నారాయణరావు ఆఫీసులో ఒక దుమారం లేపేసేడు.

పెళ్లికాని యువకులందరినీ 'ఎప్పుడు చేసుకుంటావోయ్ పెళ్లి? అమ్మా నాన్నకి భయపడి ఎవరిని పడితే వాళ్లను కళ్లు మూసుకుని చేసుకోకు' అనేవాడు.

తరువాత వాళ్లకు పెళ్లినిగురించి చిన్న ఉపన్యాసం యిచ్చేవాడు. 'అసలు మనదేశంలోని యువకులు పెళ్లివిషయం వచ్చేసరికి ఎందుకంత మూర్ఖంగా ఉంటారో నా కర్థంకాదు. ఒక మగవాడు ఎంత అందగాడు, విద్యావంతుడు, (శీమంతుడూ అయినా కానీ, అతని జీవితంలోని సుఖసంతోషాలన్నీ అతను చేసుకున్న భార్యమీదనే ఆధారపడి ఉంటయ్! ఆ భార్యకూడా రూపవతి, విద్యావతి, ధనవతీ కావచ్చు. కాని భర్త సుఖపడటానికి అవి చాలవు. ఆవిడ ఎంత మంచిదైనా, తెలివిగలదైనా ముందు అతనిమనసుకి నచ్చాలి. ఒక్కమాటలో చెప్పాలంటే ఆమెనతడు ముందు మనస్ఫూర్తిగా (పేమించాలి. అప్పుడుగాని పెళ్లి చేసికోకూడదు. నా దృష్టిలో తగినంత వయసు, విద్యా అన్నీ ఉండికూడా వ్యక్తిత్వం లేకుండా తల్లిదం(డులు కుదిర్చిన సంబంధాలకు తలూపి చేసుకునే యువకులందరు వట్టి పిరికిపందలు. అలాటి యువకులకు ఈ అభ్యుదయ సమాజంలో స్థానంలేదు. (పేమించి పెళ్లిచేసుకోని మగవాడు అసలు మగవాడే కాదంటాను' అంటూ ఆవేశంగా బల్లగుద్ది మాట్లాడేవాడు నారాయణరావు.

అతనిమాటలు వింటుంటె పెళ్లికాని యువకులందరికీ ఎంతో ఉత్సాహం కలిగేది; ఏదో ధైర్యం పుంజుకునేది.

కాని పెళ్లయి పిల్లల తం(డులయిన మగవాళ్ళు మాత్రం ముఖాలు మాడ్చుకునేవారు. 'అంటే వాడిదృష్టిలో మేమంతా మగవాళ్లం కాదనా?' అనుకునేవారు కోపంగా. పైకిమాత్రం యేమనేవారుకాదు. ఏమన్నాఅంటే తిరిగి తమకే బెడిసి కొడ్తుందని వాళ్లకి తెలుసు. క్లారెన్సుకి జానకికీ అతనిమీద యిష్టం కలగకపోయినా (ప్రత్యేకమైన (శద్ధ ఏర్పడిందని మాత్రం చెప్పవచ్చు. మనసులో అతని భార్యమీద చిన్నగా అసూయకూడా ఏర్పడిందంటే అది అబద్ధం కాదు.

'మీ భార్య పేరేమిటండీ?' అనడిగింది జానకి.

'మోహిని...చూసేరా ఎంత అందమైనపేరో? పేరులో ఏముంది?' అని అంతా అంటారు కాని అసలున్నదంతా పేరులోనే నండీ! ఒకపేరు వినగానే మన మనసులో ఆ పేరుగల వ్యక్తినిగురించి ఒక మూర్తిని చి(తించుకుంటాం. మా మోహినిది పేరుకుతగ్గ రూపం; రూపానికి తగ్గపేరు. అలాటి సార్థక నామధేయులు లోకంలో ఏ కొద్ది మంది మాత్రమో ఉంటారండీ! అలాటి(స్త్రీ నాభార్య అనుకుంటే ఎంత గర్వంగా ఉంటుందో చెప్పలేను' అన్నాడు నారాయణరావు.

ఆ తరువాత మరో(ప్రశ్న అడగటానికి ఎవరికి మాత్రం నోరువస్తుంది?

నారాయణరావులోని మరోగుణం ఆఫీసులోని మగవాళ్లందరినీ విపరీతంగా ఆకర్షించింది. ఆడవాళ్లిద్దరూ అక్కడలేని సమయంలో అతనెప్పుడూ వాళ్ల శరీర సౌష్ఠవాన్ని గురించి నిస్సంకోచంగా మాట్లాడుతుండేవాడు. జానకిని ఉద్దేశించి 'ఏం ఆడది బాబూ! ఎండుకట్టెలా ఉంది. దాని మొగుడెలా భరిస్తున్నాడో ఏమో! ఆడదానికి కాస్త కండలేకపోతే ఎలా?' అనేవాడు. ఆ మాటలు ఎంతో అసహ్యంగా ఉన్నప్పటికీ మగవాళ్లలో సహజంగా ఉండే ఆసక్తి, కుతూహలంవల్ల వాళ్ల కామాటలు ఎంతో నవ్వుతెప్పించేవి. వాళ్లందరూ మనసులో అనుకునే మాటను నారాయణరావు పైకి అన్నాడు. అంతే! తమలోని వికృతమైన ఆలోచనలకు అతను రూపాన్నిచ్చేడు. అందుకే చాలామంది మగవాళ్లకు అతనంటే అసహ్యంతోకూడినఆసక్తి కలిగింది. అతనిని అడిగడిగి ఆడవాళ్ల కబుర్లు చెప్పించుకుని

వినేవాళ్ళు. అవి వింటుంటే వారికెంతో తృప్తిగా ఉండేది.

క్లారెన్సుని గురించికూడా అతను జోక్‌వేయక మానలేదు. 'అలాటి ఆడవాళ్లను చీకటో భరించాలే తప్ప, వెలుగులో చూడలేం' అనేవాడు.

అతనిమాటలు వింటూనే అందరూ పగలబడి నవ్వేవాళ్ళు.

కాంతకు కనకానికీ లొంగని మగవా డుంటా డేమో కాని సెక్సుతోగూడిన సంభాషణలంటే చెవి కోసుకోని మగవాడుమాత్రం ఉండడు.

అందుకే అతను ఆడవాళ్లను గురించి మాట్లాడుతున్నపుడల్లా అందరూ పనులు మానుకుని మరీవింటారు. ఇంకొక చిత్రమేమిటంటే ఆడ వాళ్లందరిని గురించి, జానకీ క్లారెన్సులను గురించి వాళ్ల పరోక్షంగా ఎంత అసభ్యంగా మాటా డి నప్పటికీ వాళ్లిద్దరి ముందూ ఎంతో వినయంగా పెద్దమనిషిలా ప్రవర్తించేవాడు.

అతను వాళ్లముందు ఎంత మంచితనం చూపించేవాడంటే వాళ్లిద్దరూ కూడా 'పాపం! చూట్టానికి భయంకరంగాఉన్నా మనిషి మాత్రం చాలా మంచివాడే!' అనుకునేవారు. ఒకసారి రాజు అన్నతను నారాయణరావుతో అన్నాడు. 'ఏమోయ్! మీది లౌ మ్యారేజి అని అన్నావుకదా! మరి ఆడ వాళ్లందరిని గురించి ఎందుకంత అసభ్యంగా అయిష్టంగా మాట్లాడతావు?' అని.

'మాది లౌ మ్యారేజి కాబట్టే—నాకు నాభార్య తప్ప ఏ స్త్రీని చూసినా గిట్టదు. ఏ ఆడదాన్ని చూసినా నామోహినిముందు తీసి కట్టుగానే ఉంటుంది. లోకంలో అందమున్న ఆడదానికి చదువుండదు. ఈరెండూ ఉన్న ఆడదానికి శీలం ఉండదు. అథవా మూడూఉన్నా ఆవిడకు మొగుడిమీద ప్రేమ ఉండదు. ఒకవేళ ఆమె మొగుణ్ణి ప్రేమించినా మొగుడికి ఆవిడంటే గిట్టదు. అందుకే లోకంలో ఎవరి దాంపత్యం చూసినా వెలితిగానే ఉంటుంది. ఈ విష యంలో నాఅంత అదృష్టవంతుడు ఉండడని అందుకే నే నెప్పుడూ గర్వపడుతూంటాను.'

అలా మాట్లాడే పురుషుడినిచూసి అసూయ పడని మగవాడున్నాడంటే అతని శరీరంలోనో మనసు లోనో ఎక్కడో లోపం ఉన్నదన్నమాట!

నారాయణరావు తోటిఉద్యోగుల మనసుల్లో ఏర్పడిన అసూయకు రోజుకోసమిధను వేస్తూనే ఉన్నాడు తన మాటలతో.

'అబ్బ! ఇవ్వాళ భుక్తాయాసంగా ఉన్నదోయ్! మా మోహిని వద్దంటున్నకొద్దీ రెండుకూరలు మూడు పచ్చళ్లు, బజ్జీలు పరమాన్నం అన్నీ చేసి తినేదాకా నాప్రాణం తీసింది.' అన్నాడు ఒకరోజు నారాయణ రావు. పెళ్లయిన మగవాళ్లందరికీ భార్య లెప్పుడూ కొసరికొసరి వడ్డిస్తూనే ఉంటారు భోజనం దగ్గర. కాని దానినొక ప్రత్యేకమైన గౌరవంగా ఏ పురుషుడూ భావించడు.

ఐనా నారాయణరావు మాట్లాడుతున్న తీరు చూస్తుంటే ప్రతిఒక్కడికీకూడా 'అబ్బ! నారాయణ రావు అలాటిభార్యను పొందినందుకు ఎంత అదృష్ట వంతుడో!' అన్నభావం కలిగింది. ఆ భావం వారికి సంతోషంకన్న బాధనే ఎక్కువగా కలగజేసింది. మరో రోజు ఆఫీసుకు వస్తూనే వళ్లు బద్ధకంగా విరుచు కుని 'రాత్రల్లా నిద్రేలేదు బాబూ!' అన్నాడు.

'ఏం?' అన్నట్టు అంతా అతనివంకనే చూసేరు. వాళ్లచూపుల్లోని కుతూహలాన్ని అర్థం చేసుకున్న నారాయణరావు శృంగారం ఒలకపోస్తూ నవ్వేడు. 'అమాత్రం ఊహించలేరూ? ఏం మగ వాళ్లోయ్ మీరు? పోనీ పెళ్లికాని వాళ్లను క్షమించ వచ్చు. పెళ్లయిన మగధీరులుకూడా అలా తెల్ల మొహాలేసి అడుగుతారేమిటి? నిద్రకికూడా దూరమై భార్యతోగడిపే రాత్రులు మీకు అనుభవంలోకి ఎన్నడూ రాలేదా? ఎంత సిగ్గుచేటు విషయం! ఐనా మిమ్మల్నని ఏం లాభం? మనదేశ దౌర్భాగ్యమే అంత. భార్యని ప్రేమించలేని మగవాడికి దాంపత్య జీవితంలోని శృంగారాన్నిగురించి యేమి తెలుస్తుంది నాబొంద? ఈదేశంలోని మగవాడికి శృంగారం అను భవంలోకి రావాలంటే సానికొంపల్లోనే అది సాధ్యం' అన్నాడు.

ఇంకా ఆ మాటలకు అక్కడున్న మగవాళ్ళం దరికీ మతులు పోయినయ్. నారాయణరావు చెప్పే విషయాలన్నీ వింటున్న కొలదీ అతనితోటి పరిచయం అధికమవుతున్న కొలదీ తమది ఎంతో నికృష్టమైన జీవితమన్న సంగతి గ్రహింపుకువచ్చి, వారికి ఎంతో బాధ కలగసాగింది. ఆ బాధ నానాటికీ అధికమై చివరికి ఓసారి నారాయణరావు భార్యను రెండు కళ్ళతోనూ చూసైనా తరించాలని ఎవరికి వారు మనసులోనే నిశ్చయించుకున్నారు.

కాని పైకిమాత్రం ఎవరూ తమ నిశ్చయాన్ని ప్రక్కవారికి తెలుపలేదు. ఏహో 'గిల్టీకాన్షెన్స్', సిగ్గు వారి నావహించినయ్.

చివరికెలాగో ధైర్యంచేసి అరుగురు పిల్లం తండ్రి అయిన సీతారామయ్య ఎవరూ లేనిదిచూసి 'మీరుండేది ఎక్కడండీ?' అనడిగేడు.

'చిక్కడపల్లిలో వెంకటేశ్వరస్వామి దేవాలయం దగ్గరండీ! ఎప్పుడైనా గుడికి వస్తే ఓ సారలా మా యింటికికూడా రండి' అని సమాధానమిచ్చేడు నారాయణరావు.

సీతారామయ్య ఆ ఆహ్వానానికి ఎంతో సంబర పడి పోయేడు. 'వచ్చే శనివారం తప్పకుండా చిక్కడ పల్లి గుడికివెళ్ళాలి' అనుకున్నాడు.

ఆ సంతోషాన్ని అంతవరకూ దాచుకోవటం చేతకాక చూచాయగా పైకి చెప్పేసేడుకూడా మిగతా వాళ్ళతో.

'గోపాలరావుగారూ! మీదికూడా చిక్కడపల్లే కదండీ! నారాయణరావుగారిల్లు మీయింటికి దగ్గరేనా యేమిటి ?' అనడిగేడు.

'నారాయణరావుగారిల్లు మాయింటి దగ్గరుండట మేమిటండీ ? ఆయన ఉండేది బోయ్‌గుడాలో' అన్నాడు గోపాలరావు.

'మీకేమైనా మతిపోయిందా ? నారాయణ రావుకి శాలిబండలో సొంతయిల్లు ఉందిట' అన్నాడు సుబ్బారావు. చివరికి తేలిందేమిటంటే నారాయణ రావుని ఎవరికివారు రహస్యంగా అతనుండే ప్రదేశాన్ని గురించి అడిగితే ఒక్కొక్కరికి ఒక్కొక్క పేరు చెప్పేడు. ఇంతకీ అతనుండేది ఎక్కడో ఎవరికీ తెలియలేదు. ఆరోజు నారాయణరావు సెలవుమీద ఉండటంవల్ల తమకి తామే తర్జన భర్జనలు చేసుకో సాగేరు. చివరకు ప్యూన్ వీరాస్వామి 'నారాయణరావు గారు అమీర్‌పేటలో ఉంటారండి! రోజూ ఉదయం ఆఫీసుకు వచ్చేటప్పుడు నాతోపాటే బస్టాండులో నిలబడతారు.' అని చెప్పేడు.

అతనుంటున్నది అమీర్‌పేట అని అందరూ నిర్ధారించుకున్నారు. 'అతనిల్లెక్కడో నీకు తెలుసా?' అని అడిగితే 'ఇల్లు ఎక్కడో సరిగ్గా నాకూ తెలియదు. ఇద్దరం ఒకే టైముకి బస్సులో ఉంటాం. ఆయన బస్సుకు నడిచేవస్తాడు కనుక అక్కడెక్కడో దగ్గర్లోనే ఉండి ఉంటుంది' అన్నాడు వీరాస్వామి.

'ఐతే యింతకూ అతను తనుంటున్న ప్రదేశాన్ని గురించి అబద్ధమాడటంలో ఉద్దేశ్య మేమయి ఉంటుంది?' అని ప్రశ్నించుకుని 'బహుశా అతను తన భార్యని గనుక మనం చూసినట్లయితే ఎక్కడ అసూయ పడిపోతామో, ఒకవేళ ఎక్కడ ఆరాధిస్తామోనని భయంకాబోలు' అని అందరూ సమాధాన పడ్డారు.

'ఏదైనా అలాటి భయం మగవాడికి, అందునా ప్రేమించి పెళ్ళి చేసుకున్న మగవాడికి ఉండటం సహజం' అని అందరూ సరిపెట్టు కున్నారు.

ఐతే ఆ రోజునుండి అతని భార్యని చూసి తీరాలన్న పట్టుదలకూడా అందరిలోనూ బాగా పెరిగిపోయింది.

మర్నాడు సుబ్బారావు నారాయణరావుతో 'ఏమండీ. ఉద్యోగంలోచేరి నెలరోజులు దాటినా మీరింతవరకు మాకు పార్టీ యివ్వనేలేదుకదా!' అన్నాడు.

'పార్టీదేముందండీ? పదండి కాంటీన్‌కి. ఇవ్వాళ అందరి బిల్లులూ నేనే చెల్లిస్తాను' అన్నాడు నారాయణరావు.

'కాంటీన్‌లోనిపార్టీ మా కెందుకోయ్? రోజూ ఉండేదేగా అది. మీ యింట్లోని పదార్థాలు పెట్టించాలి మాకు' అన్నాడు రాజు.

'అలాగే! రేపు మా మోహినిచేత చేయించుకుని

పట్టుకువస్తాన్లే! ఏవేం కావాలో చెప్పండి.' అన్నాడు. నారాయణరావు.

'నీకెందుకోయ్ అంతశ్రమ? అన్ని యింత దూరం నువ్వు మోసుకురావటమెందుకు? మేమే మీ యింటికి వస్తాం. మీ మిసెస్‌ని చూసినట్లూ ఉంటుంది. నీ చేత పార్టీ యిప్పించుకున్నట్లూ అవుతుంది.' అన్నాడు సీతారామయ్య. అతను వయస్సులో చాలా పెద్ద వాడవటంవల్ల అలా అనటానికి ధైర్యం చేసేడు—నారాయణరావు ఏమీ తప్పుపట్టుకోనన్న ఉద్దేశ్యంతో.

కాని ఎందుకో ఆ మాటలు వింటూనే నారాయణరావు ముఖంలో నెత్తురు చుక్కలేదు. 'క్షమించండి. మోహినికి ఆరోగ్యం బాగా లేదు. రేపే పుట్టింటికి వెళ్తానంటోంది. ఆమె తిరిగి వచ్చిన తరువాత మరోసారి తప్పకుండా మిమ్మల్నందరినీ మా యింటికి తీసుకువెళ్తాను' అన్నాడు.

కాని అతను అబద్ధమాడుతున్నట్లు స్పష్టంగానే అర్థమయిపోయింది వాళ్లందరికీ.

పైకిమాత్రం ఏం తెలియనట్లే ఊరుకున్నారు.

నారాయణరావుకి ఎందుకో తనని వాళ్లింటికి తీసుకుపోవటం యిష్టంకాదన్న విషయం ఖచ్చితంగా తెలిసింది వాళ్లకి. అందుకే ఏదో ఒక నెపంతో వాళ్లింటికి వెళ్లితీరాలన్న పట్టుదలకూడా వాళ్లలో తలెత్తింది. నారాయణరావు లేనిసమయం చూసుకుని అందరూ కూడబలుక్కున్నారు.

ఆ సాయంత్రమే అందరూ కలసి అమీర్‌పేట వెళ్లి, ఎవరో స్నేహితుడి పెళ్లికోసమో దేనికో అటు వెళ్లినట్లు, నారాయణరావు ఇల్లు అక్కడే ఉన్నట్లు తెలుసుకుని అనుకోకుండా వాళ్లింటికి వెళ్లినట్లు నారాయణరావుతో చెప్పాలని నిశ్చయించుకున్నారు.

ఆఫీసరుయొక్క ఆంతరంగిక కార్యదర్శిద్వారా నారాయణరావు ఇంటి అడ్రసును కనుక్కుని ఆ సాయంత్రమే క్లార్కెన్సు, జానకి తప్ప మిగతావాళ్లందరూ అమీర్‌పేట వెళ్లారు.

పది నిమిషాల్లో యిల్లుకూడా కనుక్కున్నారు. అందమైన చిన్నడాబా. ఇంటిముందు చిన్నపూలతోట. చుట్టూ కాంపౌండు గోడ. నారాయణరావు ఐశ్వర్యవంతుడేనన్న విషయం అందరికీ అర్థమయింది. ఆ ఐశ్వర్యానికి తోడు మోహినివంటి భార్యకూడా ఉంటే మగవాడికి అంతకన్న ఏం కావాలి!?

ఎలాగైనా మోహినిని చూడాలన్న పట్టుదలతో అందరూ లోపలికి వెళ్లేరు.

నౌకరు వాళ్లంతా నారాయణరావు ఆఫీసులో పనిచేసేవాళ్లని తెలుసుకుని 'అయ్యగారింట్లోలేరు' అని చెప్పేడు.

'ఎక్కడకు వెళ్లేరు?' అనడిగితే

'ఏమో! ఎక్కడకువెళ్తారో రోజూ. ఇంట్లో ఎవ్వరికీ చెప్పరు. రాత్రి పొద్దుపోతేగాని యింటికి రారు' అన్నాడు నౌకరు.

'అమ్మగారింట్లోనే ఉన్నారా? లేక ఆయనతో కలసి బయటకు వెళ్లారా?' అనడిగేడు రాజు ధైర్యం చేసి.

'అమ్మగారింట్లోనే ఉన్నారు. అయ్యగారు ఎప్పుడూ అమ్మగారిని వెంటపెట్టుకుని బయటకుపోరు. ఒక్కరే పోతారు. అమ్మగారికికూడా బయటకుపోయే అలవాటు అంతగా లేదు' అని సమాధానమిచ్చేడు నౌకరు.

ఆమాట వింటూనే అందరూ ఒకరిముఖాలొకరు చూసుకున్నారు. ఆక్షణంలో అందరికీ నారాయణరావు ప్రతి సాయంత్రం భార్యతో కలసి సినిమాలకి, షికార్లకీ వెళ్తాననీ, ఆఫీసుటైములో తప్ప ఎప్పుడూ తామిద్దరూ ఒకరిని విడిచి మరొకరుండరనీ పదేపదే చెప్పినవిషయం గుర్తుకువచ్చింది.

'అమ్మగారిని ఓసారి పిలుస్తావా? ఆఫీసు వాళ్లెవరో ఆమెనిచూట్టానికి వచ్చేరనిచెప్పు' అన్నాడు సీతారామయ్య.

నౌకరు కొంచెం సందేహించేడు. 'ఏమోనండీ, అమ్మగారికి బయటివాళ్లంటే తగని బిడియం. ఇంత మందితో మాట్లాడటానికి బయటకు వస్తారో రారో!' అన్నాడు నౌకరు.

'అదేమిటి? ఆవిడకెందుకంత ఘోషా? బాగా చదువుకున్నావిడకూడా' అన్నారెవరో.

'బియ్యే పాసయిందిటగా మీ అమ్మగారు' అన్నారు మరొకరు.

నౌకరు అదోరకంగా నవ్వేడు. 'మీరు పొరపాటుగా వినిఉంటారు. అమ్మగారు పెద్దచదువులేమీ చదువుకోలేదు. తెలుగు చదవను వ్రాయనూ వచ్చు అంతే!' అన్నాడు.

అందరిముఖాలూ వాడిపోయినయ్. నారాయణ రావుచెప్పే విషయాలన్నిటికీ విరుద్ధంగా మాట్లాడు తున్నాడీ నౌకరు. ఇందులో తమకి తెలియని రహస్యం ఏదోఉంది. కాని ఏమిటారహస్యం ?

'మీ అమ్మగారిని ఒక్క ఐదు నిమిషాలపాటు ఇటు రమ్మను. ఆమెను తప్పకుండా చూడాలంటు న్నామని చెప్పు' అన్నాడు సీతారామయ్య.

నౌకరు కాస్త తటపటాయించేడు. తరువాత ఏమనుకున్నాడో 'సరే ఉండండి. పిల్చుకు వస్తాను.' అని లోపలికి వెళ్ళేడు నౌకరు.

ఏడెనిమిది నిమిషాలు నిమిషమొక యుగంగా ఎదురు చూసిన తరువాత నౌకరు ఒక స్త్రీని వెంట తీసుకునివచ్చి 'వీరే నారాయణరావుగారి భార్య. వీరంతా అయ్యగారి ఆఫీసులో పనిచేసే వాళ్ళటమ్మ గారూ! మిమ్మల్ని చూట్టానికి వచ్చేరు.' అన్నాడు.

ఆ స్త్రీని చూస్తూనే అందరూ కొయ్యబారి నిల్చుండిపోయేరు. ఎందుకంటే నారాయణరావు మాటలవల్ల తా మూహించుకున్న మోహిని రూపానికీ, యీ స్త్రీ ఆకారానికీ పోలికే లేదు.

వాళ్ల ఎదుట నిలబడిన స్త్రీ అప్సరసకాదు. సృష్టిలో అందునా ఒక స్త్రీలో ఎంతటి అందవికారం ఉండటానికి సాధ్యమవుతుందో అంతటి కురూపి యీ స్త్రీ. తమ కళ్లతో చూస్తూకూడా ఆ విష యాన్ని నమ్మలేక పోయేరు వాళ్లంతా.

ఎండుకట్టిలాటి శరీరం, వికృతమైన ముఖం, అందులో భయంకరమైన మెల్లకన్ను— ఎంతో దిగులుగా, నీరసంగాఉన్న ఆమెలో నారాయణ రావు వర్ణించే శృంగార దేవత పోలికలు ఎంత మాత్రమూ కనపడలేదు వారికి.

ఎలాగో అందరూ ఆమెకి నమస్కరించి 'మేమంతా యిక్కడేదో పనిఉండి వచ్చేము. నారా యణరావుని చూద్దామనుకున్నాం. మేము వచ్చినట్లు చెప్పండి.' అని యువతలకు వచ్చేరు అయోమయంగా.

వారివెంట నౌకరుకూడా గేటువరకు వచ్చేడు. వాళ్ల ముఖాలు ఎందుకంతగా మారిపోయేయో అతనికి తెలుసు. అందుకే చిన్నగా నవ్వుకున్నాడు.

'మీ అమ్మగారి పేరేమిటి?' ఎలాగో షాక్ నుండి తేరుకుని అడిగేడు సుబ్బారావు.

'గున్నేశ్వరమ్మ' అన్నాడు నౌకరు.

మళ్లీ అందరూ ఒకరిమొహం ఒకరు చూసు కున్నారు.

నౌకరు విచారంగా నవ్వేడు. 'మీ మనసుల్లో ఏముందో నాకర్థమయింది. అమ్మగారిపేరు 'మోహిని' అని చెప్పకుంటారుకదూ అయ్యగారు ?' అన్నాడు.

మరింత ఆశ్చర్యపోయి అందరూ అతనివంక చూసేరు.

'నారాయణరావు మాతో ఎందుకన్ని అబ ద్ధాలు ఆడేడు!' అనడిగేడు సీతారామయ్య జేవురిం చిన ముఖంతో.

'అయ్యగారిమీద కోపం తెచ్చుకోకండి. ఆయ నను అర్థంచేసుకుని జాలిపడండి. అయ్యగారికి పిచ్చి–' అన్నాడు నౌకరు.

'ఏమటి ? నారాయణరావుకి పిచ్చా?' కెవ్వున కేకవేసేడు గోపాలరావు.

'అబ్బే, అంతగా భయపడకండి. అది నిజంగా పిచ్చికాదు. పిచ్చిలాటి ధోరణిలో పడిపోయేరు—అయ్య గారు—పెళ్లయిన దగ్గరనుండీ.'

'అయ్యగారిది ప్రేమవివాహం అన్నమాట నిజ మేనా ?' అనడిగేడు రాజు.

'అదే నిజమైతే అయ్యగారికింత అవస్థ ఎందుకు కలిగేది బాబూ? అయ్యగారిని చిన్నప్పటి నుండి నేనేపెంచి పెద్దవాణ్ణి చేసేను. మొదట్నుండీ ఆయనకు ఎవరో తనకి నచ్చినమ్మాయిని ప్రేమించి పెళ్లి చేసుకుందామన్న కోరిక ఉండేది. బియ్యే చదువు తుండగా కాలేజీలో ఒకమ్మాయిని ప్రేమించేరు. ఆమెను పెళ్లి చేసుకుంటానని స్నేహితులకు ఇంట్లో

వాళ్ళకూ అందరికీ చెప్పేరు. కాని ఆ అమ్మాయి బీదదనీ, వాళ్లకులంపిల్లకాదనీ అయ్యగారి తండ్రి ఆ పెళ్లికి ఒప్పుకోలేదు. అయ్యగారు ఎంత ఏడ్చి మొత్తుకున్నా అయ్యగారు విన్లేదు. దానికి తగ్గట్టు ఆ పిల్లకికూడా అయ్యగారంటే యిష్టంలేదని తెలిసింది అందరికీ. ఓ వంక ప్రేమించిన పిల్లను పెళ్లి చేసికోలేకపోయేనన్న బాధ, మరోవంక ఆ పిల్ల తనని ప్రేమించలేదన్న అవమానం అయ్యగారిని ఎంతో క్రుంగదీసినయ్. తండ్రి కట్నానికి ఆశపడి యీ సంబంధం చేసేరు. దాంతో అయ్యగారికి మతి చలించి నట్లయింది. చిన్నతనంనుండి ప్రేమ వివాహం చేసుకోవాలన్న కోరిక ఎంతో బలంగా ఉండే దాయనకు. ఆ కోరిక తీరకపోవటం, దానికి తగ్గట్టు అందం చదువు లేని అమ్మాయి భార్య కావటం—ఈరెండు అయ్యగారిని పిచ్చివాడిని చేసినయ్. అందుకే బయటి స్నేహితులందరితోనూ తాను 'లౌ మేరేజి' చేసుకున్నానని చెప్పి సంతృప్తి పడుతూం టారు. ఇంట్లోనేమో భార్యంటే ఏమాత్రం గిట్టదు. ఏదోఒక నెపంతో ఆవిడను తిడుతూ, కొడు తూంటారు. రాత్రిళ్లు తప్పతాగి యింటికి వస్తారు. మిగతా అన్ని విషయాల్లోనూ మంచిగానే ఉంటారు కాని పెళ్లాం విషయం వచ్చేసరికిమాత్రం విచిత్రంగా ప్రవర్తిస్తారు.' అని చెప్పేడు నౌకరు.

అదంతా వింటూంటే అందరికీ హృదయాన్ని కెలికినట్లయింది.

మారు మాట్లాడకుండా బయటకు వచ్చేరు. కొంతదూరం నడచేక అందరూ ఈ లోకంలోకి వచ్చేరు. నారాయణరావు భార్య తా మూహించు కున్నట్లు లేనందువల్ల ఆశ్చర్యం కలిగినా ఆ తరువాత అలా లేనందుకు కొంత ఆనందంకూడా కలిగింది.

'లౌ మేరేజి చేసుకుందామన్న తీవ్రమైనకోరిక నెరవేరక పోవటంతో నారాయణరావు తనభార్య విషయాన్ని గురించి మాట్లాడుతున్నప్పుడు తనభార్య ఎలాఉందో చెప్పక, భార్యని ఎలా ఊహించు కుంటు న్నాడో చెప్పటంలో కొంత అర్థంఉంది. అంతవరకు మనం సానుభూతి చూపించవచ్చు, కాని యితర స్త్రీలనుగురించి అతనెప్పుడూ అసభ్యంగా మాట్లాలా డెందుకో!' అన్నాడు సుబ్బారావు.

'వైవాహిక జీవితంలో సుఖపడని మగవాడు ఎప్పుడూ పరస్త్రీలను గౌరవించలేడు. జీవితంలో ఎన్ని సుఖాలున్నప్పటికీ దాంపత్య సుఖాన్ని మించినదేదీ లేదు. జీవితంలో అతిముఖ్యమైన యీ సుఖాన్ని పొందలేని మనిషి — పొందలేనని తెలుసుకుని బాధపడేమనిషి—ఒక రకమైన 'పెర్‌వర్షన్'కి లోనవు తాడు. స్త్రీని చూసినప్పుడల్లా భార్యవల్ల తాను పొందలేక పోయిన ఆనందాలను గుర్తుకు తెచ్చుకుంటాడు. దాంతో అతనికి స్త్రీజాతిమీదనే ద్వేషం ఏర్పడుతుంది. తన జీవితంలో ఏది లభించ కుండా పోతుందో, దానిని గురించే ఆలోచించటం మానవ స్వభావం. తమ దాంపత్య జీవితంలో సెక్సు సుఖాన్ని పొందలేని మనుషులకు 'సెక్సు'ని గురించి తప్ప మరో విషయాన్ని గురించిన ఆలోచనే రాదు. అలాగే 'లౌ మేరేజి' చేసుకోవాలన్నకోరిక తీరక పోవటంవల్ల నారాయణరావు ఎప్పుడూ 'లౌ మేరేజి' చేసుకుంటే తన జీవితం ఎలా ఉంటుందోనన్న ఊహల తోనే సంతృప్తిపడుతుంటాడు.' అన్నాడు వెంకట్రావు.

'ఐనా నారాయణరావుమీద నాకేమాత్రం జాలి కలగటం లేదు. అంత కోరికగాఉంటే లౌ మేరేజి చేసుకోపోయేడా? ఇలా జీవితాంతం తను బాధపడట మెందుకు? మనలాంటి వాళ్లని 'ఫూల్స్'ని చెయ్యట మెందుకు?' అన్నాడు చిరాగ్గా గోపాలరావు.

'నారాయణరావుమీద మనం జాలిపడాలి. అతని పరిస్థితుల్లో ఉంటే మనమైనా అలాగే ప్రవర్తించే వాళ్లమేమో! ప్రేమించిన వ్యక్తి, పెళ్లి చేసుకున్న వ్యక్తీ భార్యే అవటమంటే మాటలా?' అన్నాడు రాజా.

'ఔను. మనం అతనిమీద జాలిపడాలి. ఎందుకంటే మనలోని ప్రతిఒక్కరిలోనూ 'ఒక నారాయణరావు' తప్పకుండా ఉండే ఉంటాడు.' అన్నాడు— ఆరుగురు పిల్లల తండ్రి సీతారామయ్య.

# ఆకాశవాణి శబ్దకోశము

## శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం

ఆకాశవాణి వారి సమాచార విభాగము పక్షమున ప్రకటింపబడిన 'ఆంగ్లము—హిందీ' శబ్దకోశం శ్రద్ధతో చూశాను. ఈ నిఘంటువులో హిందీ పిడివాద ధోరణి నాకెక్కడా కనబడలేదని చెప్పడానికి సంతోషిస్తున్నాను. ఇది సరళంగాను వ్యవహారానుకూలంగాను ఉన్నదని చెప్పడానికి వెనుదీయనక్కరలేదు. నిఘంటు నిర్మాతలు ఈలక్ష్యాన్ని ఎట్లా సాధించారో ప్రస్తావనయందు వివరించారు. ప్రధానంగా ఇది ఆకాశవాణికోసం రచనలు చేసేవారు, ప్రసంగాలు వ్రాసేవారు ఉపయోగించడానికి ఉద్దేశింపబడింది. ఇంతేకాక ఈ నిఘంటువు ఇతరులకుకూడా జ్ఞానప్రసారమునందు సాధనంగా ఉండాలని కోశనిర్మాతలు భావించి తదనుగుణంగా ఉండడానికి కృషిచేశారు. అట్టి కృషియందు వీరు కృతకృత్యులయారని చెప్పవచ్చును.

ఆకాశవాణినిఘంటుకారులు అవలంబించిన మరొక కార్యసూత్రం ప్రశంసనీయంగా ఉంది. ఎట్లంటే హిందీ ప్రాంతమునుండీ, హిందీ ఆధారముల నుండీ సేకరించిన పదజాలాన్నీ, పదబంధములనూ, ఆకాశవాణి ఇతర భాషా ప్రాంతాల కార్యకర్తలకు పంపించి, ఆ హిందీపదాలకు పర్యాయములుగా అన్యభాషీయులు ప్రయోగించే శబ్దాలను సేకరించి వాటిని కొంతవరకూ ఈ నిఘంటువులో ప్రవేశపెట్టడం జరిగింది. ఇది ఇంకా విస్తృతంగా జరిగిఉంటే భారతదేశపు వివిధభాషల సమీకరణానికి సమన్వయానికి ఆకాశవాణివారు చక్కని ప్రాతిపదిక వేసినవారు కాగలరు. భారతీయ భాషలన్నీ ఏకరాశి అవడం ఎన్నడూ సాధ్యమూకాదు, వాంఛనీయమూ కాదు. సుసంస్కృతములు, సుసంపన్నములూ అయిన విభిన్న భాషావాహినులు భారతదేశంలో ప్రవహించడమే భారత సాంస్కృతిక క్షేత్రము సారవంతము అవడానికి ముఖ్యహేతువు. అవన్నీ ఒక ముద్ద అవడం సాంస్కృతిక దారిద్ర్యానికే దారితీస్తుంది.

భారతీయభాషలు తమ తమ ప్రత్యేకభావ సంపదనూ, పదసౌష్ఠవాన్ని నిలుపుకుంటూనే ఒకదానికి ఒకటి దగ్గరగా రావడమే మనము కోరవలసినది. ఈభాషల సాన్నిహిత్య సాధనకు సంస్కృతభాషయే ముఖ్యసూత్రమని విజ్ఞులందరూ గుర్తించారు. ఆకాశవాణి శబ్దకోశంలో ఈసూత్రము వివేకంతో పాటింపబడింది. అయితే ఇక్కడ ఒక చిన్నసమస్య ఉత్పన్నమవుతూంది. భారతదేశపు ప్రాంతీయ భాషలన్నీ సంస్కృత జలాశయాన్నుండి తమ పొలాల్లోకి నీళ్లు పారించుకున్నా, ఆ జలాలను ఉపయోగించుకున్న తీరు చమత్కారంగా ఉంది. ఇక్కడకూడా ప్రాంతీయ భాషలు తమ స్వాతంత్ర్యాన్ని నిలుపుకొంటూనే వస్తున్నాయి. సంస్కృత ధాతువులు పదాలు అనేకార్థకత్వం కలవి అవడంచేత ఒక్కొక్క ప్రాంతంవారు ఒకే సంస్కృతపదాన్నిగాని, ధాతువునుగాని విభిన్నార్థములలోను, విభిన్నఅర్థచ్ఛాయల్లోను వాడడం జరుగుతూంది. అందుచేత పరిచితమైన సంస్కృత పదాలే అపరిచితంగా కనబడడం జరుగుతూంటుంది. ఒక్కొక్కప్పుడు విపరీతార్థాలు ఇవ్వడంకూడా గోచరిస్తుంది. wireless శబ్దానికి పర్యాయంగా కొందరు హిందీలో 'వితంతు' శబ్దం వాడుతున్నారని తెలుస్తుంది. వ్యుత్పత్తి అర్థాన్ని తీసుకొనిచూస్తే—తంతు విరహితమైన వార్తాప్రసారము—అనుఅర్థము సిద్ధిస్తుంది. దానిలో హాస్యాస్పదమైనది ఏమీలేదు. కాని తెలుగువారు వితంతుశబ్దాన్ని మాంగల్యమునకు నోచుకోని స్త్రీలపరంగా వాడడంచేత వితంతు కార్యాలయము మున్నగు హిందీ అనువాదాలు తెలుగువారికి నవ్వు పుట్టిస్తాయి. ప్రకృత నిఘంటుకారులు ఈ విప్రతిపత్తిని గుర్తించారోఏమోతెలియదుకాని 'వితంతు' శబ్దం గ్రహించలేదు. బేతార్ అని అను

వాదం చేశారు. అది బాగుంది. ఇట్లా అని ఒక ప్రాంతంవారి సంస్కృతపదప్రయోగసరణిని ఇతర ప్రాంతాలవారు పరిహసించాలని కాదు. వీలైనంతవరకూ సానుభూతితోను సహృదయత్వంతోను వానిని అర్థం చేసుకొని స్వీకరించాలి.

భారత ప్రాంతీయభాషల్ని సంస్కృత తంతువు మీద చక్కని మాలగా కూర్చడము శతాబ్దాలమీద కాలము చేస్తూనే వచ్చింది. అయితే అది యాదృచ్ఛికంగా జరిగింది. ఇప్పుడు మనము ప్రయత్న పూర్వకంగాను క్రియాశీలముగానుచేసి ప్రాంతీయ భాషలను ఒకదానికొకటి ఇంకా సన్నిహితం అయేటట్లు చెయ్యాలి. ఇందుకై — సంస్కృత — దేశభాషా— బృహన్నిఘంటువు నిర్మించవలసిన ఆవశ్యకత ఎంతేనా ఉంది. ఒకే సంస్కృత పదాన్నీ, ధాతువునూ భారత దేశమందలి ఆయా ప్రాంతీయభాషలు ఏ అర్థాల్లోను అర్థచ్ఛాయల్లోను వాడుకుంటున్నాయో ప్రదర్శించే కోశము కూర్చబడినట్లయితే దేశీయభాషలు అన్యోన్యము బాగా అర్థంచేసుకొని దగ్గరగా రాగలుగుతాయి. ఆకాశవాణి శబ్దకోశ నిర్మాతలు దీనిని సూత్రప్రాయంగా ఆచరణలో పెట్టారు.

వీరు వాడిన హిందీపదాలు బహుళ వ్యాప్తిలో ఉండి శుద్ధహిందీతో గాఢపరిచయములేని నాబోటివారికికూడా అవగతమయేటట్లు ఉన్నాయి. ప్రతీభాషయందును ఆ భాషా విద్వాంసులకు పరిచయమయిన వైదుష్యభూషితమైన పదజాలమూ ఉంటుంది. అభిజ్ఞులుకానివారికికూడా అర్థమయే పదజాలం విస్తారంగా ఉంటుంది. ప్రయోగించిన భాష జనబాహుళ్యానికి అందుబాటులో ఉండాలనేది పెద్దల సంప్రదాయము.

ఈ సందర్భంలో మన ప్రాచీన వ్యాకరణమైన ఆంధ్రశబ్దచింతామణి చెప్పినమాట సరసు అందరికీ శిరోధార్యం కాదగిఉన్నది. అక్కడ ఏమి చెప్పారంటే

'పేచోషాదిక శబ్దాన్
ప్రవ్యాహరంతు శబ్దజ్ఞాః।
ఇహతు ప్రవ్యాహార్యం
సంకేతిత సుప్రసిద్ధ మేవ పదమ్॥

శబ్దశాస్త్రపారంగతులైనవారు పేచ, ఊష వంటి అప్రయుక్తములైన మారుమూల శబ్దాల్ని వాడితే వాడుదురుగాక. ఆంధ్రకవిత్వమునందు (రస ప్రధానమైన రచనయందు) ఎల్లరకూ తెలిసిన సంకే తముకల సుప్రసిద్ధపదాలనే వాడదగును. ఆకాశవాణి కోశమునందు ఈ సూత్రము బాగుగా పాటింపబడి నట్లే కనిపించింది. అవి శుద్ధహిందీపదాలా, హిందు స్తానీ పదాలా అనే వివాదంలోకి దిగకుండా భారత దేశము అన్నిప్రాంతాలలోనివారు తగుమాత్రంగా అర్థం చేసుకోగల హిందీ పదానువాదమే వీరు ఇస్తూ వచ్చారు. ఇది జనసమ్మతమైనమార్గం అనడంలో సందేహంలేదు.

ఈ శబ్దకోశంలో వీరు అవలంబించినమార్గము ఉపాయంగానేఉంది. ఇది విశ్వనిఘంటువుకాదు. ఆంగ్లం లోని అపారశబ్దజాతానికంతకీ పర్యాయపదాలు సృష్టిం చడం వీరు లక్ష్యంగా పెట్టుకోలేదు. ప్రసిద్ధ ఆంగ్లపదములు, వాటిమీద ఉత్పన్నమయిన పదబంధ ములూ గ్రహించి వాటిని సులభహిందీలో ఎట్లు అనువాదం చెయ్యవచ్చునో ప్రదర్శించారు. వీరు ఎక్కు వగా తీసుకొన్నవి—భారతరాజ్యాంగచట్టము, రాజనీతి శాస్త్రము, వాణిజ్యము, ఆర్థికశాస్త్రము, న్యాయము, వార్తాప్రసారము మొదలైన ప్రసిద్ధవిషయసంబంధ మైన పదాలు. భౌతికవిజ్ఞానశాస్త్రములకు సంబం ధించిన పారిభాషికపదాల్ని స్వల్పంగా గ్రహించారు. భౌతికశాస్త్రములు, టెక్నాలజీ మున్నగువాటికి సంబం ధించిన ఆంగ్లపదాల అనువాదము చాలా చిక్కులతో కూడినది. అతిగహనమైనది. ఆకాశవాణి శబ్దకోశము ప్రధానంగా రచనాకళకు సంబంధించినదిగా ఉద్దేశింప బడడంచేత అది శాస్త్రారణ్యవీధుల్లోకి లోతుగా చొచ్చుకొనిపోలేదు. అది యుక్తంగానేఉంది. మూల భూతమైన ఆంగ్లపదం తీసుకొని దానిమీదనుంచి పుట్టి, బాగుగా వాడుకలోఉన్న పదబంధాలకు, అరు దుగా సామెతలకుకూడ సరళహిందీలో పర్యాయ పదాలూ, పెక్కుస్థలాల్లో వివరణలుకూడా ఇచ్చారు. మరొక సుగుణం ఏమిటంటే కొన్నిఆంగ్లపదాలను పట్టుదలతో తర్జుమాచెయ్యడం విడిచిపెట్టి, ఆంగ్ల పదాలుగానే ప్రదర్శించారు. వాటిని అనువాదం చెయ్య బూనడం డొంకతిరుగుడు రచనకే దారితీస్తుంది. Radio అనే శబ్దానికి రేడియో, ఆకాశవాణి అని రెండు పదాలు ప్రదర్శించారు. ఈ శబ్దంమీదనుంచి ఉత్పన్నమైన అన్యపదాలకు వివరణగాని పర్యాయ పదాలుగాని ఇదే సందర్భంలో కూర్చారు. Radio; active, Radio active fallout, Radio adaptation, Radio Circuit, Radio isotope ఈ విధంగా పెక్కుపదాలను పరిచయం చేశారు. Expend ఖర్చుకర్నా, వ్యయకర్నాఅనేశబ్దం ఎత్తుకొని దానిమీద Capital expenditure, Contingent expenditure, net, recurring, revenue—మొదలగు పదా లతో కలిపి అర్థవివరణ చేయబడింది. ఇవన్నీ నిత్య వ్యవహారంలో మనకు తగిలే పదములే.

ఆకాశవాణి శబ్దకోశములోని పర్యాయపద నిర్మాణసరణిని స్థాలీపులాకంగా గమనిద్దాము. ఆయా సందర్భాలలో తెలుగువారు ప్రయోగించే శబ్దాలను కూడా గుర్తుంచుకొందాము. హిందీవారికి నచ్చిన సంస్కృతపర్యాయపదాలు మనకు వింతగా తోచ వచ్చును. మనవి వారికిని అట్లే. ఏభాషయొక్క జీవశక్తి ఆ భాషది. కాకిపిల్ల కాకికి ముద్దు.

Committee—Select Committee—ప్రవర సమితి. ప్రాధ్యకుడు, ప్రవరసమితివంటివి తెలుగులో క్రొత్తగా అనిపించును. ప్రత్యేక సభ్యసంఘము అని తెలుగువారి వాడుక. సెలెక్టుకమిటీ అనడంకూడా మామూలు.

Commonwealth—రాష్ట్రమండలి—స్వతం త్రాధికారముగల రాజ్యాల్ని మనము రాష్ట్రముఅనుట లేదు. British Commonwealth—బ్రిటిషురాజ్య సమాఖ్యఅని తెలుగు వాడుక.

Communal—సాంప్రదాయిక—Traditional అనే పదానికి పర్యాయంగా తెలుగులో దీనిని వాడు దుము. వర్గ లేక వర్గీయ మనకు సరిపడును.

Comparative Law—తులనాత్మకవిధి — Law అనే పదాన్ని న్యాయముఅని తెలుగులో వ్యవహ రిస్తాము.

Competitor—ప్రతిద్వంద్వీ— గాఢార్థముగా ఉంది. పోటీదారుఅని తెలుగు.

Compulsory Education— అనివార్యశిక్ష— నిర్బంధవిద్యఅని తెలుగు.

**Continent**—మహాద్వీపము - భూఖండము లేక ఖండములని మనము. భూఖండాలన్నీ ద్వీపాలు కావు. ఆసియాఖండము, యూరోపుఖండము సంపూర్ణద్వీపములు కావు.

**Cooperative movement**—సహకారీ ఆందోళన—ఇక్కడ మనము ఉద్యమము వాడుతాము. Agitation అనే పదానికి పర్యాయంగా ఆందోళన ప్రయోగిస్తాము.

ఒకే సంస్కృతశబ్దము భిన్నార్థములలోను విభిన్నఅర్థచ్ఛాయలలోను ఎట్లా ప్రయోగింపబడుతూందో గమనించవచ్చును.

**Decimal**—దాశామిక—దశాంశములని మనము.

**Demilitarized Zone**—సేనావిహీనక్షేత్ర-నిస్సైనిక మండలము తెలుగులో.

**Depreciation**—ఘిసాయీఖర్చా—తరుగుదల లేక అరుగుదల ఛార్జి. సంస్కృతం అక్కరలేకుండానే ఉభయులు సరిపుచ్చుకుంటున్నారు.

**Diplomatic correspondent**—రాజనయిక సంవాదదాతా—చాలా డొంకతిరుగుడుగాఉంది. రాజదౌత్యలేఖకుడు చాలుననిపించును.

**Displaced persons**—విస్థాపితలోగ్ — 'వి' అను ఉపసర్గను మనము విశేషములను అర్థంలో తరుచు వాడుతాము. దేశనిష్క్రాంతులు, స్థానభ్రంశము పొందినవారు అనుట మనకు సరిపడును.

**Economic exploitation**—ఆర్థికశోషణ - ఆర్థికదోపిడీఅని తెలుగువారు.

ఇచ్చట ఒక విషయం గమనించాలి. ఆర్థిక దోపిడీ అనేది దుష్టసమాసంకదా. ఇటువంటివి చెల్లనిస్తే భాషయొక్క పవిత్రత చెడిపోవునుగదాఅని పండితులు ఆక్షేపిస్తారు. నిజమే. కాని క్షణక్షణము జాతీయ, అంతర్జాతీయ సంబంధములచే తెలుగువారి భావసంపద హద్దుమీరి వృద్ధినొందుతున్నది. దానిని ఎవరూ ఆపలేరు. అనంతమైన ఈ భావచ్ఛాయలు ప్రకటించుటకు అనంతమైన స్వేచ్ఛకూడా ఉండితీరాలి. పరిమితమైన కావ్యప్రయోజనాలకు రూపొందింపబడిన భాషానియమములతో వెల్లువలాంటి భాషకు గట్టుపోయడం సాధ్యమూకాదు. వాంఛనీయముకాదు. ఆర్థికమైన దోపిడీఅంటే అనుమతిస్తూనే ఉన్నాము. ఆర్థికదోపిడి అన్నప్పుడు అగు ధాతులోపము అయిందని సరిపుచ్చుకొనవచ్చును. మధ్యమపదలోపము భాషలో ఉండనేఉన్నది. వైరిసమాసములు అనుకొన్నవి ఎన్నో ఈ విధంగా సురక్షితాలు అవుతాయి.

**Economist**—అర్థశాస్త్రి. తెలుగువారు రామశాస్త్రి, కృష్ణశాస్త్రి ఎరుగుదురుకాని అర్థశాస్త్రి, తండులశాస్త్రి (Rice expert) ఎరగరు. ఆర్థికశాస్త్రవేత్తఅనుట మనకు సరిపడును.

**Efficeincy Bar** — కుశలతారోధ — ఒక ఉద్యోగి దక్షతను పరిగణించేహద్దుఅని దీని భావము. కుశలతానిరోధముఅనికాని దక్షతానిరోధముఅనికాని అనవచ్చును

**Emanicipate**— ముక్తిదేనా — ముక్తిశబ్దమును ఉదాత్తార్థంలో మనము వాడుతాము. విమోచనముచేయు—తెలుగులో సరిపడుతుంది.

**Employee**—కర్మచారి—మనకు వింతగా అనిపిస్తుంది. ఉద్యోగి అని మన వాడుక.

**Enlightened world opinion**—ప్రబుద్ధసంసారజనమత—సంసారంఅంటే మనకు కుటుంబము. ప్రబుద్ధశబ్దాన్ని Awakened అనుభావంలో ఉపయోగిస్తాము. వివేకయుత ప్రపంచాభిప్రాయము—అనుట తెలుగువారికి నచ్చవచ్చును.

**Entertainment Tax**— మనోరంజ కర—పన్నులు ఎవరికీ, ఎప్పుడూ మనోరంజకములు కాజాలవనడం తేటతెల్లము. వినోదములపన్నుఅని తెలుగువారి వాడుక.

**Environment**—వాతావరణ—. పరిసరములు అని తెలుగువారు. Atmosphere అనగా వాతావరణమని తెలుగులో వాడుక.

**Fair price shop**—ఉచిత భావ్‌కీ దుకాన్—భావ్‌అంటే ధర. ఉచితశబ్దాన్ని తెలుగులో ధర్మార్థముఅనే భావంలోకూడా వాడుతున్నాము. చవక డిపో

అని చాలా ముక్తసరైన పర్యాయపదాన్ని తెలుగువారు సృష్టించుకొన్నారు.

Family-joint— సంయుక్తపరివార; సమష్టి కుటుంబము అని తెలుగులో. పరివారమును మనము భృత్యపరంగా వాడుతున్నాము.

Favoured nation— రియాయత్ (ప్రాప్త) ముల్క్—రియాయతునే మనవారు రాయితీ అంటున్నారు.

Favoured nation clause అనగా రాయితీ దేశషరతుఅని కల్పించవచ్చును.

Food-Ministry— ఖాద్యమంత్రాలయ — సరిగ్గా అర్థంచెప్పితే భక్షించదగిన మంత్రాంగము అని వస్తుంది. ఆహారమంత్రిత్వశాఖఅని తెలుగువారు.

Gazetteer—భౌగోళికకోశ—బాగున్నది.

Gilt edged security — ప్రథమ శ్రేణి హుండీ — ఇది హుండీ విషయం కాదేమో.

Those stocks whose interest is perfectly safe—అని ఛేంబర్సు నిఘంటువు. అయినచో క్షేమవడ్డీసరుకుఅని చెప్పాలి.

Gold standard—గ్రహింపబడలేదు. స్వర్ణమూలముఅని చెప్పవచ్చును.

Grace period కూడా లేదు — రాయితీ కాలముఅని చెప్పవచ్చును.

Imbalance—అసంతులన—అసమానతఅంటే సులువుగాఉంది.

Income Tax—ఆయకర — ఆదాయపుపన్ను తెలుగులో.

Indemnity—క్షతిపూర్తి — నష్టపరిహారము అని మనము.

Interim relief—అంతరిమ సహాయతా — మధ్యంతర సౌకర్యము మనకు అనువుగా ఉంటుంది.

Intestate succession —వసీయత్‌నామేకే బినా ఉత్తరాధికార—వీలునామాలేని వారసత్వము—తెలుగులో.

Laissez Faire—అహస్తక్షేపకీ నీతి—అంత బాగాలేదు. స్వేచ్ఛావ్యాపార సిద్ధాంతము—తెలుగు.

Land alienation act— భూమి హస్తాంతరణ కానూన్—భూమి అన్యాక్రాంత శాసనము అని మనము.

Leader of the opposition— విరోధీపక్షకా నేతా—సబబుగాలేదు. అధికారపక్షము, అనధికార పక్షము—వీరు పిల్లులు ఎలుకలవలె సహజశత్రువులు కానక్కరలేదు. తెలుగులో మనమువాడే ప్రతిపక్ష నాయకుడు అనే శబ్దము బాగుందని అనిపిస్తుంది.

Longterm credit — దీర్ఘకాలికఋణము. తెలుగులోను ఇంతే.

Majority — బహుమత—మనమువాడే అధిక సంఖ్యాకబలము దీర్ఘంగా ఉంది.

Malnutrition — అపర్యాప్తి పోషణ — బాగున్నది కాని అర్థంకాదు—పోషక ఆహార లోపము(తె)

Market black—చోర్‌బజార్—చీకటిబజారు (తె).

Morphia — అఫీమ్‌కా సత—opium నుండి అఫీమ్—మత్తుమందు (తె)

Negotiable Instrument—విక్రయహుండీ.

Nepotism— సంబంధి యోంకా పక్షపాత—బంధుపక్షపాతము (తె)

Net profit—శుద్ధలాభ—నికరలాభము (తె)

Occupancy right— భోగాధికార — కబ్జా హక్కు—తె.

Oligarchy—అమీరోంకా శాసన—జమీందారీ పాలన—తె.

Over draft—వివరణ మాత్రము ఇచ్చినారు. అతిఖాతాపద్దు—(తె)

Pamphlet—పుస్తిక — కరపుస్తకము— తె. పుస్తిక—(పుస్తె) అనేసరికి తెలుగువారికి ప్రియురాలి గళసీమయందు 'బాలసూర్యప్రభాకలితంబై వెలుగొందు మాంగల్యంబు' జ్ఞాపకం రావచ్చు. మనకు కుదరదు.

Parachute—హవాయిఛత్రీ— గాలిగొడుగు—తె.

Prorogue-Parliament-సత్రావసానకర్నా-సత్ర—అనగా Session. ఇంతకన్న అధివేశనము బాగున్నది. లోకసభ అధివేశన సమాప్తి.

Penal Code—Indian— భారతీయ దండ సంహితా— చాలా పాండిత్య మండితంగాఉంది. శిక్షా స్మృతి—తె.

Periodical—సామయికపత్రిక—బాగుంది.

Plebecite—జనమత—జనవాక్య సేకరణ-తె.

Preference—share— వివరణ ఉన్నది—అగ్రలాభాంశ షేరు అనవచ్చును.

Randam Sampling—స్థాలీపులాక పరీక్షా-యాదృచ్ఛిక మాదిరింపు—తె.

Recurring expenditnre—ఆవర్తీవ్యయ—ఆవృత్తివ్యయము—తె.

Safeguard — రక్షకా ప్రబంధ—సంరక్షక హామీ—తె.

Sanctum Sanctorum — పరమపవిత్ర స్థానము—గర్భగుడి—తె.

Scorched earth policy— వివరణ కలదు. దగ్ధభూనీతి — బాగుండునేమో.

Search light — దూరదీప్ — శబ్దము పొందికగా ఉంది. శోధదీపము—తె.

Share (deferred shares) — ఆస్థగిత హిస్సే—దూరలాంభాంశపు షేరు—తె.

Single transferable vote — ఏకల సంక్రమణీయ మత. చిక్కుగా ఉంది. ఏకవర్తి బదలాయింపు వోటు—తె.

Sinking fund — నిక్షేపనిధి—బాగానేఉంది.

Sleeping partner — వివరణము ఉన్నది. ఉపేక్షాభాగస్వామి. తె.

Sliding wage scale — వివరణ కలదు. క్రమికవేతనశ్రేణి—తె.

Snap vote — అచానకవోట్ — ఆకస్మిక వోటు—తె.

Staff — కర్మచారిగణ్ — మనకు బాగా అనిపించదు—ఉద్యోగివర్గము—తె.

Stratosphere — సమతాపమండలము — స్థిరతాపవాయుమండలము—సరిగా ఉండును.

Sub marginal Standard of living— వివరణ కలదు — అవనమ్ర జీవన ప్రమాణము — బాగుండునేమో.

Suffragette—వివరణ ఉన్నది—స్త్రీ వోటు వాది. తె.

Tarif (preferential)—రియాయతీశుల్క-రాయతీమహసూలుఅని తెలుగులో అనవచ్చును.

Technology—శిల్పవిజ్ఞాన—తెలుగులో శిల్ప శబ్దమును నిర్మాణకళకు, చెక్కడమునకు వాడు చున్నాము—యంత్రవిజ్ఞానము సరిపోవచ్చును. లేదా టెక్నాలజీ.

Television— రూపవాణి — తెలుగులోకూడ సరిపోతుంది.

Title deed—స్వామిత్వపత్ర—హక్కు దస్తావేజా—తె.

Value (surrender)—వివరణ కలదు.

ఆకాలసమర్పణమూల్యము లేక సమర్పణ మూల్యము అనవచ్చును.

Veto—రోధఅధికార—నిరోధాధికారము—తె.

Vote by proxy—ప్రతిప్రతీద్వారా మతదాన-ప్రతినిధిపర వోటింగు—తె.

Wage (living)—వివరణ ఉన్నది—బ్రతికే టంత కూలి.

Ways and means position — ఆదాయ వ్యయస్థితి—తె.

Writ of hobeas corqus — నేరస్థుని హాజరుపెట్టు ఆదేశము—తె.

---

AIR Lexicon: The publications Division; Ministry of Information & Broadcasting. Government of India—New Delhi. price Rs. 10—50

# సాహితీ జగతి

## శ్రీ కాళ్ళూరి హనుమంతరావు

జనవరి సంచికలో నా 'సాహితీ జగతి' అన్న పుస్తకాన్ని శ్రీ చే. రా. గారు సమీక్షించారు. ఆ సమీక్షలో కొన్ని అభిప్రాయాలను వ్యతిరేకిస్తూ మార్చి సంచికలో నేనొక వ్యాసం వ్రాశాను. దానికి సమాధానం చెప్పే ఉద్దేశంతో చే. రా. గారు మే సంచికలో తిరిగి ఒక వ్యాసం వ్రాశారు. ఇప్పుడు నేనీ వ్యాసంలో వారి అభిప్రాయాలను పునర్విమర్శిస్తున్నాను.

సాహిత్యం సార్వజనికమైనది; అది మతాలు, సాంఘిక వ్యవస్థలు, నియమాలు మొదలైనవాటికి అతీతమైనదని నా అభిప్రాయం. చే. రా. గారు ఇదంతా రొమాంటిక్ భావన అంటారు. ఏదో సంఘ ప్రయోజనంలేని సాహిత్యమంటూ ఏదీ ఉండదనడంలో విప్రతిపత్తి ఎవరికీ ఉండదు. కాని ఆ సాంఘిక ప్రయోజనంకోసం తొందరపడకూడదనీ, సాహిత్యంవల్ల సమకూరే సాంఘికప్రయోజనం ఒక్కొక్కప్పుడు రచయిత సమకాలంలో జరక్క భవిష్యత్తులో జరగవచ్చుననీ, కనుక ఈ విషయంలో నిదానం అవసరమనీ, నిజానికీ ఈ నిదానం శాస్త్రవిజ్ఞాన ప్రయోజన నిర్ణయంలో కూడా ఆవశ్యకమేననీ నేను సోదాహరణంగా ప్రతిపాదించాను. నిప్పు ఎన్నోవిధాలుగా పుట్టినట్లు మానవత్వం వివిధమతసాంఘికాది విశ్వాసాలవల్ల వికసిస్తుంది. సాహిత్యం దీనిని నిరూపిస్తుంది.

పూర్వం రాజుల జీవితాలలో సంఘర్షణ జరడానికి అవకాశాలు ఎక్కువగా ఉండేవనీ, సాధారణంగా సామాన్యుల జీవితాలలో తదవకాశం తక్కువనీ నేనన్నాను. సామాన్యుని జీవితంలో సంఘర్షణ జరగడానికీ అతడు కథానాయకుడు అవడానికీ అవకాశం లేనేలేదని కాని, వీల్లేదనికాని నేననలేదు.

కలకత్తా సముద్రతీరంలో ఉందనడం సాహిత్య దృష్టిలో పెద్ద తప్పుకాదని నేనన్నాను, ఒప్పని అనలేదు. చే. రా. గారు అలా ఏ పరిస్థితులలోనూ అనకూడదంటారు. ప్రసిద్ధ కవులు కొందరు ఇటువంటి పొరపాట్లు చేశారు, నా పుస్తకంలో అవి ఉదాహరించాను. దానికి చే. రా. గా రేమంటారు? ఇంకొక ఉదాహరణం ఇస్తాను.

వాల్మీకి అరణ్యాలలో నివసించి తపోవనాలను యథార్థంగా వర్ణించాడు. నాగరకుడైన కాళిదాసు వాటిని ఊహించి వర్ణించాడు. రామాయణంలో తపోవనాల వర్ణనలనుచూస్తే ఆ ప్రాంతాలన్నీ భయానకాలుగా తోస్తాయి. శాకుంతలంలో సుందరప్రశాంత ప్రదేశాలుగా కనిపిస్తాయి. (రెండుచోట్లా రాక్షసు లున్నారు). దీనికి కారణం కాళిదాసు తపోవనాలను ఎప్పుడూ చూసిఉండకపోవడం, అతడు రచింపబూనిన నాటకానికి రమణీయమైన ప్రదేశం ఆవశ్యకం కావడమూను.

సాహిత్యంలో భావం ప్రధానమనీ వాస్తవికత అప్రధానమనీ ఒత్తిచెప్పడానికి కలకత్తాలో సముద్రం ఉందనడం సాహిత్య దృష్టిలో పెద్ద తప్పు కాదన్నాను. ఆ అభిప్రాయాన్ని ఆ మేరలో అర్థంచేసుకోవాలి తప్ప, సాహిత్యంలో వాస్తవికతను పాటించ నక్కరలేదనీ, ఎవరిష్టంవచ్చినట్లు వారు వ్రాయవచ్చుననీ నా అభిప్రాయమని భావించకూడదు. ఏ వాక్యానికైనా రచయిత ఏ ప్రకరణంలో ఏ చిత్తసంచలనం (Spirit)తో దాన్ని వ్రాశాడో వాటినిబట్టి అర్థనిర్ణయం చెయ్యాలి. తండ్రి కోపంగా కొడుకుతో 'మళ్లీ ఇలా చేశావంటే చావగొడతాను' అంటే తండ్రి కొడుకుని అక్షరాలా దుడ్డుకర్రతో చచ్చేదాకా కొడతాడని అర్థంకాదు, కఠినంగా దండిస్తాడని అభిప్రాయం. శంకరాచార్యులు 'భజగోవిందం భజగోవిందం...' అని ఒక వ్యాకరణ విద్యార్థిని హెచ్చరిస్తే లౌకికవిజ్ఞానాల నశ్వరత్వం పారమార్థికజ్ఞాన శాశ్వతత్వం అతని మనస్సులో నాట జేయడమే ఆచార్యులవారి ఆశయమని గ్రహించాలి తప్ప

అందరిని చదువుసంధ్యలు కట్టిపెట్టి అహోరాత్రాలూ గోవిందభజనచేస్తూ కూర్చోమనికాదు. అసలు ఆచార్యులవారే అలా కూర్చోలేదు. 'కలకత్తా బీచిలో ఆ యువతీయువకులు కూచొని మాటాడుకొంటున్నారు' అనడం సాహిత్యదృష్టిలో పెద్ద తప్పుకాదు. ఆ యువతీ యువకులసంభాషణ ముఖ్యం—అన్న నా అభిప్రాయాన్ని సరిగా ఆకళించుకోకుండా అలా అనకూడదని చే. రా. గారు వాదించారు. ముళ్లపల్లె, మర్రిచెట్టుకథ వేరని, ప్రసిద్ధ ప్రదేశాలనుగురించి తప్పుగా వ్రాయడం సాహిత్యకారుడు చెయ్యకూడనిపని అని చే. రా. గారు వ్రాశారు. సాహిత్యంలో వాస్తవికత భగ్నమవవచ్చునా, కాకూడదా అన్న సిద్ధాంత చర్చ చెయ్యాలితప్ప ప్రదేశం ప్రసిద్ధమా అప్రసిద్ధమా అన్నది ప్రశ్నకాదు. ప్రసిద్ధ ప్రదేశాలంటే ఏవి ? లక్షజనాభా కలవా ? రచయిత ఎప్పుడూ వాస్తవికతకే ప్రాకులాడుతాడు. సమర్థుడైన రచయిత అవసరాన్నిబట్టి వాస్తవికతకు విరుద్ధంగా వ్రాసి ఒప్పించగలడు.

శ్రీశ్రీ కి మార్క్సిజంతో పరిచయం ఉందని చే. రా. గారు శ్రమపడి నిరూపించారు. ఈ నాడు మనం రాజకీయాలలో దొర్లుతున్నాం. ఇట్టిస్థితిలో సంప్రదాయ విమర్శకులకు శ్రీశ్రీ రచనలు అర్థం చేసుకొనేపాటి రాజకీయ పరిజ్ఞానం ఉండదని చే. రా. గారు అనుకొనడం పొరపాటు. .'శ్రీశ్రీ కవిత కేవల సాహిత్య దృష్టితోచేసే వ్యాఖ్యానాలకికూడా లొంగ దనే నే ననేది' అన్నారు, చే. రా. గారు. రాజకీయ వ్యాఖ్యానాలకు లొంగినా లొంగకపోయినా సాహిత్య వ్యాఖ్యానాలకు, లొంగకపోతే అది సాహిత్యంకాదు.

తొండా కుక్కా జంతువులు కనుకా, వాటిలో మానవత్వారోపణకన్నా జంతుస్వభావ వర్ణనమే ఎక్కువచేసి ఉన్నందునా ఆ పద్యంవలన కవి పతితకు అక్కడ కలిగించవలసినంతగా గాఢమైన అనుభూతిని కలిగించ లేకపోయాడు.

ఇక వ్యాకరణం సంగతి. శైశవంనుంచీ ప్రతి మనిషిలోనూ అలిఖిత వ్యాకరణం ఉంటుందనీ, భాషా వ్యవహారాన్ని అదే నడిపిస్తుందనీ, లిఖిత వ్యాకరణా లన్నీ కేవలం రైళ్లరాకపోకలను సూచించే టైమ్ టేబిల్స్, తపాలా ఛార్జీల పట్టికలవంటివి అనీ, ఆధునిక భాషా శాస్త్రజ్ఞుల (linguists) అభిప్రాయం. దీనినే చే. రా. గారు 'వాటిని guides అనో style sheets అనో అనాల్సి ఉంటుంది. వాటినికూడా వ్యాకరణాలని వ్యవహరించటం ఇంకో మంచి మాట దొరక్కనే' అని పాణినీయం మొదలైన లిఖిత వ్యాకరణాలు సిసలైన వ్యాకరణాలు కావని, రైళ్ల రాకపోకల పట్టికల వంటివనీ తేల్చారు. శైశవంనుంచీ మనుష్యులలో అలిఖిత వ్యాకరణం ఉంటుందనడానికి ఆధారాలేమీ లేవు. చుట్టుప్రక్కల వారి భాషా వ్యవహారాన్ని గమనించి మనిషి భాషను అర్థం చేసుకొనడం, తిరిగి మాటాడడం, తన ప్రతిభనుబట్టి క్రమంగా క్రొత్త వాక్యాలు నిర్మించడం నేర్చుకొంటున్నాడు. అంతేకాని వ్యాకరణ విజ్ఞానం పెంపొందించుకొనడం లేదు. అది వ్యాకరణ విజ్ఞాన మయితే కొన్ని కొన్ని విలక్షణములైన చోట్ల కొందరైనా సందేహాలకు లోనుకావలసి ఉంది. కాని మన అనుభవంలో అలాటిదేదీ కనిపించడం లేదు. పైగా చదువుకొనే పిల్లలు మొట్టమొదటిసారిగా వ్యాకరణాంశాలు మేష్టరు చెప్పినప్పుడు ఆశ్చర్య పడతారు. రాముడు+అతడు=రాముడతడు అని అవు తుందంటేనూ, 'అశోకుని సైన్యమున కెదురొడ్డి పోరాడిరి. ఆ యుద్ధమున రక్తపుటేరులు పారెను' అన్న వాక్యాలలో సంధులను విడదీసి చూపుతేనూ పిల్లలు మొదట్లో నమ్మరు. అలిఖిత వ్యాకరణమే ఉండి, ఈ అంశాల సూత్రాలు తెలియకపోయినా ప్రక్రియలు వారికి అదివరకే తెలిసి ఉంటే ఈ అంశాలు గురువుగారు చెప్పిన ఉత్తరక్షణంలో ప్రతిబాలుడూ గ్రహించి ఉండేవాడు. చిన్న పిల్లలు మాటాడడం నేర్చుకొంటున్నప్పుడు 'నాన్న చెప్పింది', 'మేం వెళ్లాం' మొదలైన వ్యాకరణం తప్పులు చెయ్యడం, పెద్దలు వారిని దిద్దడం చూస్తున్నాం. ఏ భాషలోనైనా.భాషముందూ వ్యాకరణం తర్వాత పుడతాయి. పిల్లలలో అలిఖిత వ్యాకరణం ఉంటుం దంటే వారిలో భాషకన్నాముందో తత్సమకాలం లోనో వ్యాకరణం ఉదయిస్తోం దనడమన్నమాట. ఇది లోకవిరుద్ధం. ఏ భాషలోనైనా ఏ వ్యాకరణమూ పుట్టకముందే ఆ భాషలో సాహిత్యం పుట్టడం చూస్తున్నాం. కనుక ఆధునిక భాషాశాస్త్రజ్ఞులు చెప్పే అలిఖిత వ్యాకరణం గగనకుసుమం. అటువంటి దేదీ ఉండదు. భాషా వ్యవహార సంప్రదాయంమాత్రం ఉంటుంది.

ప్రబలంగా అమలులోకి వచ్చిన ఏ వ్యాకరణ మైనా తన చట్రంలో ఇముడని కొన్ని శబ్దాలను కత్తిరించివేస్తుందని నేను వ్రాసినదానికి 'కత్తిరించివేస్తుందట ! కత్తిరించి ఎక్కడ పారేస్తుంది? భాషలో లేకుండాచేస్తుందా?' అని ఆశ్చర్య పడి చే. రా. గారు ప్రశ్నించారు. పాణినీయం ప్రబలంగా అమలులోకి వచ్చింది. అది రామాయణ భారతాలలోని కొన్నిపదాలను సమ్మతించనందున ఆ మాటలను తర్వాతివారు ఉపయోగించలేదు. కనుక పాణినీయం రామాయణ భారతాలలోని కొన్నిమాటలను తర్వాతివారు ఉపయోగించకుండా కత్తిరించివేసింది. ప్రజలు చేసిన పనినే వ్యాకరణంమీద ఆరోపించడం. నేను కత్తిరించివేస్తుందన్నానుగాని కత్తిరించి పారేస్తుందనలేదుకదా! రామాయణ భారతాలలోని పదాలను పారెయ్యడానికి మధ్య పాణిని ఎవడు? ఆ మాటలు ఆ కావ్యాలలో ఉండకుండా ఎక్కడికిపోతాయి? విస్తృతమైనభాషలో అప్రయుక్తమైన శబ్దమే ఉండదని పతంజలి పస్పశాహ్నికంలో అన్నాడు.

లిఖితభాషలకే సాహిత్యదృష్టిలో వ్యాకరణం అవసరం. అలిఖితభాషలకు ఆ భాషల లక్షణాలను తెలుసుకొందుకు వ్యాకరణాలు వ్రాస్తే వ్రాయవచ్చును. తోడాభాషను పరిశీలించి వ్యాకరణం వ్రాస్తే దాని వలన ఆ భాషతో సన్నిహితమైన భాషల సంగతి తెలియవచ్చును. కాని దానివలన తోడాభాషకీ, తోడలకీ చేకూరే ప్రయోజనం ఏమీలేదు.

'పాణిని పతంజలులు మహామేధావులు. కాని మానవవిజ్ఞానంవారితోనే ఆగిపోయిందని నేననుకోను' అని చే. రా. గారన్నారు. ఆగిపోయిందని ఎవరన్నారు? ఆగిపోలేదుకనుకనే వారి తర్వాత ఎందరో వ్యాకర్తలు వచ్చారు. వారిలోకూడా పాణినితో ఆగిపోయిందనుకొంటే కాత్యాయనుడూ, ఆయనతో ఆగిపోయిందనుకొంటే పతంజలీ వచ్చిఉండేవారుకారు. వారి ముగ్గురిలోనూ 'యథోత్తరం మునీనాం ప్రామాణ్యం' అని అర్వాచీనుడే ప్రమాణమన్నారు తప్ప ప్రాచీనుడు చెప్పిందే శిలాక్షరమని ఏ వ్యాకర్తా అనలేదు. పాణినికూడా హఠాత్తుగా ఊడిపడలేదు. ఆయనకుముందు అనేక వ్యాకర్తలు వెలశారు. పాణిని పతంజలులు మహామేధావులని కీర్తిస్తూనే పాణినీయం గైడు పుస్తకం వంటిదని; దాన్ని వ్యాకరణం అనడం ఇంకో మంచి మాట దొరక్క గత్యంతరం లేకపోవడం వలననే అనీ చే. రా. గారెందుకంటున్నారో అర్థంకాదు.

ఆధునిక భాషా శాస్త్రజ్ఞుల అభిప్రాయం భాషకి వ్యాకరణం అనవసరమనీ, వ్యవహర్తలే భాషని నడిపిస్తారనీ, ఎవడు ఏం వ్రాసినా మాటాడినా అదంతా ఒప్పేననీను. సభ్యభాష, అసభ్యభాష రెండూ ఒక్క అర్థాన్నే బోధించినా, వాటిలో శిష్టులు ఉపయోగించే భాషని ప్రమాణీకరించి వ్యాకర్త వ్యాకరణం రచించి ఉత్తరోత్తరా వ్రాతకోతలకు ఆ భాష ఉపయుక్తమయేటట్లు వ్యవస్థ కల్గిస్తున్నాడు. చిన్నపిల్లల తొక్కు పలుకులనుకూడా మనం అర్థం చేసుకొంటున్నాం. కనుక వారి భాషకూడా వ్యాకరణ యుక్తమే అనతగదు. చిన్నపిల్లల తొక్కుపలుకులు అర్థం చేసుకొనడంలో క్లేశం అనుభవిస్తాం. ఆ పిల్లల సన్నిహిత బంధువులు అర్థం చేసుకొన్నంత తేలికగా ఇతరులు గ్రహించలేరు. వ్రాతకోతలకు ఉపయోగించే భాషలో ఇంతటి వైవిధ్యం, అర్థబోధనలో క్లిష్టతా ఉండకూడదు.

ఏ భాషని వ్యాకరించడం? శిష్టభాషనా, అశిష్టభాషనా? అని ప్రశ్నించుకొని పతంజలి శిష్టభాషని వ్యాకరించడమే లాఘవమూ ప్రయోజనవంతమూ అని నిశ్చయించాడు. ఇప్పుడు భాషా శాస్త్రజ్ఞులు దీనికి పూర్తిగా విరుద్ధ పద్ధతిని అవలంబిస్తున్నారనిపిస్తుంది. శిష్టులు వ్యవహరించే భాషలకి రచితములైన వ్యాకరణాలు అసలు వ్యాకరణాలే కావనీ, భాషలకి లిఖితవ్యాకరణాల ప్రయోజనం ఏమీలేదనీ అంటున్నారు. అనాగరకులైన తోడాలు మొదలైనవారి భాషలకు వ్యాకరణాలు వ్రాస్తున్నారు. ఈ పరిశీలన నిష్ప్రయోజనమని నా ఉద్దేశంకాదు. కాని అభివృద్ధి చెందని భాషలకు వ్యాకరణం వ్రాయడం చాలా కష్టం. దానిలో గురుత్వమేతప్ప లాఘవం ఉండదు. అభివృద్ధిచెందినభాషఅయితేనే ఒక్కొక్క సూత్రంతో అనేకరూపాలు నిష్పన్నాలవుతాయి. సంస్కృత వ్యాకరణంలోకూడా రూఢపదాలను ఉణాదిసూత్రాలద్వారా వ్యాకరించారు. ఒక్కొక్కమాటకు ఒక్కొక్కసూత్రం

చెప్పవలసివచ్చింది. ఈ ఉణాదిసూత్రాలు నేటికీ ఎవరూ వ్యాకరణప్రయోజన దృష్టితో చదవరు. ప్రజలలో బాగా వాడుకలోఉన్న మాటల విషయంలో వ్యాకరణ ప్రయోజనం కనిపించదు. కాని భాషా సమష్టికి వ్యాకరణం అవసరం.

నిజానికి వ్యాకరణం ఒక మిథ్య. రామ+డు= రాముడుఅని ఉకారాదేశాన్నీ; తాన్ + తాన్=తాంస్తాన్ అని సకారాగమాన్నీ వ్యాకరణాలు విధిస్తున్నాయి. కాని 'రాముడు', 'తాంస్తాన్' అన్నవే వాస్తవ పదాలు. వైయాకరణులు విధించిన ఉకారాదేశ సకారాగమాలు మిథ్య. లేనివాటిని సౌలభ్యంకొరకు ఉన్నాయనుకొనడం.

'ఒక గ్రంథాన్నీ, ఆ గ్రంథంలో వ్యక్తమయ్యే గ్రంథకర్త ప్రతిభనీ, దృక్పథాన్నీ అంచనావేసే అధికారం విమర్శకుడికి ఖచ్చితంగాఉంది... 'ప్రౌఢ వ్యాకర్తకి మంచిపరిశీలనఉందికాని సూత్రరచనలో నేర్పులేదు' అని ఎవరైనా రాశారనుకోండి. ఇట్లా రాయడానికి విమర్శకుడు ప్రౌఢవ్యాకర్తకన్నా గొప్పవాణ్ణి అనుకోనక్కరలేదు......కొన్నిసాహిత్య సిద్ధాంతాల్ని విమర్శించేటప్పుడు చూపిన హేతువాదదృష్టిని భాషనుగురించి రాసేటప్పుడు శ్రీ హనుమంతరావు గారు చూపించలేదని నేనభిప్రాయపడ్డాను. అందువల్ల వారి హేతువాదదృష్టి పరిమితమన్నాను.' అని చే. రా. గారు వ్రాశారు.

'హేతువాదదృష్టి పరిమితము' అంటే సాహిత్య సిద్ధాంతాల విమర్శలో హేతువాదదృష్టి ఉందనీ భాషనుగురించిచేసిన ఆలోచనలో లేదనీ సమీక్షకుల అభిప్రాయమని ఏ పాఠకుడూ ఊహించలేదు. 'వీరి సాహిత్యసిద్ధాంత విమర్శ హేతువాదబద్ధంగాఉంది, భాషనుగురించిన పరిశీలనలో హేతువాదదృష్టిలేదు, అని చే. రా. గారు ఖచ్చితంగా వ్రాసిఉండవలసింది, ప్రౌఢవ్యాకర్తగురించి ఎవరో వ్రాసినట్లుగా.

యతిప్రాసల చర్చలో చే. రా. గారు మొదటి సమీక్షలో 'ఆంధ్రకవితా సరస్వతికి బరువునగలు' అనే వ్యాసంలో యతిప్రాసలు తెలుగు కవిత్వానికి బరువులనీ, మహాకవులే ఆ బంధాల్నుంచి తప్పించుకోలేక పోయారనీ నిరూపించటానికి ప్రయత్నించారు' అని వ్రాశారు. ఎట్లా ప్రయత్నించాను, లేదా ఆ ప్రయత్నం ఫలిత మేమైందిఅనివారు సూచించలేదు. పైగా 'నిరూపించారు' అనకుండా 'నిరూపించడానికి ప్రయత్నించారు' అనడంవలన ఆ నిరూపణ సరిగా జరగలేదేమోఅని పాఠకుడు సందేహించడానికి అవకాశం కల్పించారు. రెండో వ్యాసంలో 'వారు చూపిన ఉదాహరణలు కన్విన్సింగ్‌గా ఉన్నై'అని వ్రాశారు. ఈ వాక్యం మొదటి సమీక్షలోనే వ్రాస్తే వారి అభిప్రాయం విస్పష్టంగా అందరికీ తెలిసేది. అలా వ్రాసినతర్వాతమాత్రమే వారు గణాలుకూడా బంధాలు కావచ్చుననీ, అదీ పరిశీలనార్హమనీ సూచించి ఉండవలసింది.

[ఈ చర్చను ఇంతటితో ముగించుచున్నాము.]



# జీవితాన్ని సూత్రీకరించకు...

శ్రీ కె. శివారెడ్డి

నీవు
జీవితాన్ని సూత్రీకరించమన్నావ్.--
నేను
జీవితాన్ని విశ్వసించి
మంచో చెడో, ఆనందమో విషాదమో,
అమృతమో విషమో
గుండె నిండుగా అనుభవించాను.

నే నెప్పుడూ
ఒక్క పగలే కావాలని
ఒక్క పగలే ఉంటుందని
అనుకోలేదు, ఆశించనూలేదు.

ఈ నాణానికి
రెండుప్రక్కలుండటం
ధమనులు, సిరలున్నంత అవసరం.
కన్నీళ్లు చిరునవ్వులు
ఎండా వానలు, వెన్నెల—చీకట్లు
వీటంటితో(లో), కలిపి, మెదిపి
తయారుచేసిన 'రసగుళికే' జీవితం.

అందుకే
నేను జీవితాన్ని సూత్రీకరించలేదు
కేవలం ఊహలకు ఊలుదారా లల్లలేదు
బతుక్కి కంచిపట్టుచీర కాకపోయినా
కలనేతచీరయినా కట్టటానికే
ఆచరణ రాపిడిలో

దీని నాణ్యం పరీక్షించటంలోనే
జీవితాన్ని అనుభవించాను.

'దిగులు గదికి'
తాళా లెప్పుడూ వేసేఉంచాను.
గత చరిత్ర తాలూకు
విచారసంబంధమైన ఫైళ్ళన్నీ
దాన్లో బంధించబడి ఉన్నాయి.

కొంతమందికి
దిగులు దేవునిగది.
రోజుకొక సారన్నా తాళంతీసి
గంటో అరగంటో పూజించి
మననంతో గుండె పుటల్నిండా
'చింత'ల రామకోటి రాసుకుంటారు.

గురికి బెత్తెడన్నట్లు
కార్యాచరణ పట్టాల మీద
బతుకు రైలు డిరైల్ అవుతుంటే
వెక్కిళ్ళు మాత్రమే మిగుల్చుకుంటూ
దీనత్వంతో దరిద్రంతో ముఖాన్ని కప్పుకుని
కుమిలి, కుమిలి, కుళ్ళి కుళ్ళి కృశిస్తారేతప్ప
ఆచరణకు అంటుకట్టటం కాని
ఆర్థికస్థోమతుకు నీళ్ళుపోయటం కాని
చేతకానివాళ్ళు
తూరుపు ముఖంమీద
చెల్లాచెదరుగాపడ్డ మేఘం ముంగురుల్ని
సరిదిద్దలేరు.

వీరోచితంగా
పోరాడే శక్తి లేనివాళ్ళు

ప్రపంచం వాకిట్లో, బతుకు కోర్టులో
సిగ్గుతో తలొంచుకుని నిళ్ళు నములుతారు.
కనురెప్పలెత్తే ధైర్యం లేనివాళ్ళు
భవిష్యత్తు నాహ్వానించలేరు.

అందుకే
జీవితాన్ని సూత్రీకరించకు
మాటల్లో వ్యాఖ్యానించకు
జీవితాన్ని జీవించు.

---



## శ్రీ పెన్మెత్స అప్పలరాజు

తెలుగు సాహిత్యంలో భావకవిత్వానికి శ్రీ దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రిగారు పర్యాయపదంగా నిలబడ్డారు. ఆధునిక కవిత్వ సాహిత్యాకాశంలో హరివిల్లులా దూసుకువచ్చిన ఈ భావకవిత్వానికి కృష్ణశాస్త్రిగారు లాలిత్యాన్ని, విశిష్టతనేకాక శాశ్వతత్వాన్ని కూడ సంతరింపచేశారు. ఈ సాహిత్య ప్రక్రియకు 'మరింత మాన్యత చేకూర్చి ఆంధ్రశెల్లీగా మాన్యులయ్యారు.'

నిజానికి శాస్త్రిగారి 'కంచుకోట కవిత్వమే' అయినా మిగిలిన రచనా ప్రక్రియల్లోకూడ వారిది అందెవేసిన చేయియని వారి వచన రచనలు చదివిన వారికి తేటతెల్లమగుచున్నది. శ్రీ ఇంద్రగంటివారన్నట్లు—ఆయన కవితనుమించిన వచనమూ, యక్షగానాలూ, నాటికలూ వ్రాసి లోకాన్ని దిగ్భ్రాంతము చేశారు.

'గద్యం కవీనాం నికషం వదంతి'—అని వచనాన్నే రచయితలకు గీటురాయిగా పండితులంగీకరించారు. కవితా రచన తపస్సయితే వచన రచన మహాయజ్ఞములాంటిది. కొంచెము ఇటూ అటుగా కృష్ణశాస్త్రిగారి మాటల్లోనే చెప్పాలంటే కవిత పక్షిలాంటిది. వచనము మనిషిలాంటిది. వచనానికి శాస్త్రాధ్యయనం, ఆలోచనాశక్తి, పెద్దల సాహచర్యం, పరిశీలనాశక్తి, పర్యటనానుభవం, అన్నిటినీ మించిన భాషాపాటవం మొదలైనవి ఎంతయినా అవసరము. కృష్ణశాస్త్రిగారి వచన రచనలలో ఈ విశేషాలు పుష్కలంగా వున్నాయి. అందుకే వారు మంచిరచయిత కూడా.

మొదటినుండి జీవితంలో తటస్థపడిన పరిస్థితులు, చారిత్రక సందర్భాలు, కృష్ణశాస్త్రిగారి వ్యక్తిత్వాన్ని అసాధారణంగా, కళాత్మకంగా నిర్మించాయి. కృష్ణశాస్త్రిగారు—కలికి పాటల కోయిల కొలను—వంటి పండిత కుటుంబములో జన్మించారు. కవుల, పండితుల, సాహచర్యం ఇంటివద్దే వారికి లభిస్తూవుండేది. విద్యార్థిదశలో ఆంగ్లసాహిత్య విశారదుడైన రఘుపతి వేంకటరత్నంగారి ఆచార్యకం లభించింది. తరువాత రాజారామమోహనరాయలుతో పుట్టిన మానవోద్యమం, నా జాతి మానవజాతిఅన్న మానవతావాదం శాస్త్రిగారిని బాగా ప్రభావితం చేశాయి. జంఝామారుతంవంటి సంఘ సంస్కరణోద్యమాన్ని ప్రవేశపెట్టిన వీరేశలింగంగారు, దేశాన్నంతటిని రాజకీయంగా ఒకటిగాచేసిన గాంధిగారు—భారత సాహిత్యసీమలో హిమాలయ శిఖరములా ఆకాశంలోకి పొడుచుకొని పైకిలేచిన రవీంద్రులు—శాస్త్రిగారికి ఆదర్శపురుషులుగా నిలిచారు. స్వయంగా సాహిత్య ఉద్యమాల్లో పాల్గొన్నారు. తెలుగు, ఇంగ్లీషు సాహిత్యాంబుధిని బాగా తరిచారు. ఆకాశవాణిలో తెలుగు సాహిత్యప్రయోక్తగా పనిచేశారు. ఈ అన్ని అనుభవాలు మరెన్నో యిలాంటి వలుకుబడులు వారి వచనరచనలకు అర్థగాంభీర్యాన్నీ, లోకజ్ఞతనీ చేకూర్చాయి. ఈ సత్యాన్నే పద్మరాజుగారు యిలా వెల్లడిస్తారు—కృష్ణశాస్త్రిలో కృష్ణపక్షము వ్రాసిన కవి ఒక మూల ఉన్నాడు. మరొక మూల లోకాన్ని బాగా దగ్గరగా ఎరుగున్న గడసరీ, మనుషుల్ని—అన్ని రకాల వాళ్లనీ—కొంటె చిరునవ్వుతో పరిశీలిస్తూ, వాళ్లంటే పిచ్చిఇష్టంతో పడిచచ్చే సంఘజీవి ఉన్నాడు. అప్పుడూ, యిప్పుడూ కూడ ఈ రెండో వ్యక్తే బలవంతుడు. ఇది తెలుగు సాహిత్యం అదృష్టం మహాఅదృష్టం.

నిజానికి తెలుగులో వ్యాసరచనా ప్రక్రియ సమృద్ధంకావడం లేదు. చక్కని వ్యాసరచనకు భావ

సంపద, భాషాశక్తితోపాటు శిల్పనైపుణ్యము ఎంతో అవసరము. అప్పుడే వ్యాసం సాహిత్యపరమై పాఠకునికి కాలక్షేపంతోపాటు జ్ఞానాన్నికూడా ప్రసాదించ గలుగుతుంది. కృష్ణశాస్త్రిగారివి ఈ లక్ష్యాన్ని నెరవేర్చగల ఉత్తమ వ్యాసాలు.

కృష్ణశాస్త్రిగారి విషయ పరిజ్ఞానము పాఠకుణ్ణి చకితపరచేటంతటి విస్తృతమయింది. బహుకాల దర్శనం - అన్నవ్యాసంలో ముప్పయి యేళ్లక్రితం దేశంలో నాన్‌కోఆపరేషన్‌లో ఆస్తి పోగొట్టుకొని జైలులో మగ్గి, యిప్పుడు పూట గడవని స్థితిలో పడి ప్లాటుఫారంవద్ద వేచివుండి వచ్చిపోయేవారిని 'బహుకాల దర్శనం' అని పలకరిస్తూ ఏ వరద పేరుపెట్టో కాస్త పైసాలు కాచేసే శ్రీరాములనే వ్యక్తిని గురించి పరిచయము చేస్తారు. యిలా దేశం కొరకు నిజంగా త్యాగంచేసి చివరకు పొట్టకి మోసం చేసే స్థితికి దిగజారడానికి సంఘానికే బాధ్యత అన్న ధ్వని యిందులో నిక్షిప్తంగా ఉంది. అందుకే శాస్త్రిగారు శ్రీరాముల్ని నిందించక యిలా అంటారు—తక్కువవాడు మోసంచేస్తే అది దారుణమైన నేరము. ప్రభుత్వమూ, ప్రతినిధులూ చేస్తే అది రాజకీయ తంత్రము—శాస్త్రిగారు ఆ నాడు చేసిన ఈ విమర్శకి యిప్పటికీ కాలదోషం పట్టలేదు!

'అవ్వతిరునాళ్లలో— తప్పిపోయింది' అన్న వ్యాసంలో వొళ్కే వొళ్కు పన్నుగల అవ్వ స్వభావాన్ని, స్వరూపాన్ని ఎంతో హృద్యంగా చిత్రిస్తారు. ఇలాంటవ్వలు మన ఆంధ్రలో ఏ పల్లెలోనైనా యిట్టే ప్రత్యక్షమవుతారు. శరీరము ముడుతలుపడి, పల్లూడి జుత్తుపండిపోయినా జీవితేచ్ఛ చావదు. తీర్థయాత్రకు వెళ్లినా, యింటి దగ్గరి మనవలకి జీళ్లు, జంగిడీ మిఠాయి కొనాలన్న మమకారంపోదు. ఆవిడ రూపురేఖలూ శాస్త్రిగారి శబ్దాల్లో చూద్దాం—నాన్నగారి మేనత్త—డెబ్బయ్యేళ్ళు పైమాట. నడుం నిటారుగా కదురులా నిలబెడుతుంది. యిష్టం లేనపుడు మాత్రం తెలుగులో—ఐ—లాగా వొంగిపోతుంది. మాట్లాడుతుంటే ఏమీ తెలియదు. రొచ్చులో నడుస్తున్నట్లు పుసుకూ పుసుకూ గాలి పోసుకుంటుంది—ఇలాంటి అవ్వ—వ్యాసం ముగిసేసరికి పాఠకుల మదిలో ప్రతిమలా కూర్చుంటుంది.

రిక్షావాలా వ్యాసంలో ఏవరేజి రిక్షావాలా స్వభావాన్ని చిత్రిస్తారు. ఈ వ్యాసంలో శాస్త్రిగారి పరిశీలనా శక్తి, మనోవిజ్ఞానపరిచయం అద్భుతంగా ప్రత్యక్షమవుతాయి. రిక్షావాలా అహమ్మద్ మెలకువలు గురించి యిలా వ్రాస్తారు—అహమ్మద్ సైకిలు తొక్కుతూ, తొక్కుతూ నడుము అజంతా బొమ్మలా ఒకప్రక్కకి విరవడం; తొక్కుతూ, తొక్కుతూనే రెండుచేతులూ గాలిలోకి చాపేయ్యడం—వంటివి. వర్షాకాలంలో కప్పుకునేందుకు కీలుగుడ్డవుండేదికాదు. చిరిగి తడిముద్దైన మామూలు గుడ్డనే మొహందగ్గరనుండి కప్పేవాడు—అంటూ చివరిగా వాక్యాన్ని యిలా ముగిస్తారు. —అహమ్మద్ దర్జాయే వేరు. ఎత్తునుంచి దిగే గుణము కాదు—అంటే అహమ్మద్ కూటికి పేదఅయినా గుణానికి కాదని ధ్వనింపచేశారు శాస్త్రిగారు. మనిషి విలువని కొలవడానికి శీలాన్ని కాక పైసాలని కొలబద్దగా అంగీకరిస్తున్న యీనాటి సంఘానికి యీ వాక్యం కొరడా దెబ్బలా తగుల్తుందంటే అతిశయోక్తి కానేరదు. నిజాయతీ, నీతి ప్రశ్నేవస్తే యీనాడు అహమ్మద్‌లాంటి రిక్షావాలాలకే ఎక్కువ మార్కులు లభిస్తాయి. తనతో అహమ్మద్‌ని సరిపోల్చుకుంటూ యిలా అంటారు—సిగ్గూ, బిడియం లేక గాని, అహమ్మద్‌కంటే నే నేమంత గొప్పవాణ్ణి? బట్టలూ, చదువులూ, పదవులూ, సంస్కారాలూ, తెచ్చిపెట్టుకున్న కృత్రిమపు హోదా? ఆ శ్రమజీవి శీవిముందు తెల్లబోయి వీటిని ధూళిలో దాచెయ్యాలనిపిస్తుంది. అలా అని అహమ్మద్ కేవలం యాంత్రికజీవికాదు. హృదయమూవుంది. అందము, ఆడపిల్లలయెడ ఆ యిది కూడా ఉంది. అందుకే—అహమ్మద్‌కేకాక అతగాడి రిక్షాకి కూడా ఆడపిల్లల అలికిడి యిట్టే పసిగట్టడం వచ్చును.

బూటు పాలీష్ — వ్యాసంలో చెప్పులుకుట్టే నారయ్యను పరిచయంచేసి పనిలో ఏముంది, చేసే విధానంలో వుందిగాని—అన్న శ్రమ విలువని, తత్వాన్ని వివరిస్తారు. దీనికి సాక్ష్యంగా భక్త రైదాస్ పదాన్ని ఉటంకిస్తారు — భగవంతుడు జోళ్లు కుట్టేవాడు,

గొప్పగా కుడతాడు...అలా అని శాస్త్రిగారు ఆ వృత్తిని సమర్థించరు. సంఘంలో అట్టడుగున వుండిపోయిన ఇటువంటివారికి తొందరగానే మంచిరోజులు లభిస్తాయన్న నమ్మకాన్ని యిలా వ్యక్తంచేస్తారు—నారయ్య కొడుకు మాత్రం చెప్పులు కుట్టడు. చదువుకుంటున్నాడు. పాత చెప్పువంటి నారయ్య గుడిసెకు యెప్పటికైనా వాడే మాసికలు వేయాలి — అని రూపకం చేస్తారు. ఈ వాక్యంలో నిజంగా మారుతున్న సాంఘిక పరిణామక్రమం, భావియెడ రచయితగా వ్యక్తంచేసిన గొప్ప నమ్మకం పెనవేసుకొన్నట్టున్నాయి. ఇలా వారు వ్రాసిన ప్రతీ వ్యాసంలోనూ, వారి పాండిత్యం, అనుభవం, పరిశీలనాశక్తి, సంఘంయెడ వారికున్న హేతుబద్ధమైన దృక్పథం, దగా పడుతున్న వారియెడ వారి సానుభూతి తొంగిచూస్తాయి.

రాముడు, శ్రీ కృష్ణావతారతత్వం, అన్నమాచారివంటి వ్యాసాలు కృష్ణశాస్త్రిగారి తాత్వికజ్ఞానానికి, శాస్త్రపరిచయానికి చక్కని ఉదాహరణలు. పుష్పలావికలు, సువాసనాద్రవ్యాల్లాంటి వ్యాసాలు వారి లోకజ్ఞానానికి, శబ్దసంపదకూ, రచనా కౌశలానికి మంచి ఉదాహరణలు.

వారు వ్రాసిన ప్రతివ్యాసంలోను, ఏదో ఒక ప్రత్యేకత ప్రతిబింబిస్తుంది. శాస్త్రిగారి వ్యక్తిత్వం, ప్రతిభ, తొంగిచూస్తూనే ఉంటాయి. ఇంకా వాక్య సరళి, పదప్రయోగం, శబ్దసంపద అక్కడక్కడ వాడే సామెతలు, జాతీయాలు, అచ్చతెనుగుమాటలు, అవసరమైనచోటపడిన యితర భాషాపదాలు వ్యాసము యొక్క ప్రభావాన్నీ, సొగసునీ యినుమడింపచేస్తాయి. సున్నితమైన హాస్యమూ వుంటుంది. దానివెనుక సంఘముయొక్క చెంపని చెళ్ళుమనిపించి, వీపుని చరిచే వ్యంగమూ వుంటుంది. మా వూరు పోయిందన్న వ్యాసంలో పల్లె—పట్టణ తారతమ్యాన్ని ఎంతో చమత్కారంగా క్లుప్తంగా వెల్లడించారు.—ఏంచెయ్యనో, పట్టణం ప్రవాసమైపోయింది నాకు. యిది ఆప్యాయంగా నాతో మాట్లాడదు. స్వార్థం యిది. పట్టణంలో వున్నన్ని గోడలు మా పల్లెలో లేవు. అక్కడ మనిషికీ, మనిషికీ, చెట్టుకీ, పిట్టకీ, చేనుకీ గట్టిచుట్టరికంవుంది—మరొకచోట అంటారు—పల్లి తల్లివంటిది, పట్టణం ప్రియురాలివంటిది. ఈ వాక్యం శాస్త్రిగారి పరిశీలనాశక్తికి, అనుభూతికి, శబ్దశక్తికీ, శిల్పానికి మచ్చుతునక.

అందుకే వెంకటేశ్వరరావుగారు కృష్ణశాస్త్రిగారిని—పెర్‌ఫెక్టునిష్టా — అని చమత్కరించారు. పద్మరాజుగారు—శాస్త్రిగారు తన తెలుగును చెక్కుతారు. దానికి నగిషీ కొడతారు. మెరుగుపెడతారు. ఆయన మనస్సులో ఎక్కడో అసలైన తెలుగు భాషకు నమూనా ఏదో ఉంది—అంటారు. నిజంగానే ఉంది.

అందుకనే కృష్ణశాస్త్రిగారిది వచన రచనలోనూ అందెవేచిన చేయి; వారి రచనలు తెలుగు సాహితికి యెనలేని రతనాలు!

---



# "యౌవనే విషయైషిణాం"

## "ఆంగీరస్"

మనుష్యజన్మే విచిత్రమైంది. ఈ మనుష్యజన్మ జంతుజన్మకన్నా విశిష్టమున్నూ, విపరీతమున్నూ అయినది. ఇందుకు బహుకారణాలు వుండవచ్చు. ముఖ్యమైన కారణం మెదడులో వున్నదనిపిస్తుంది. ఆకారంలోనేమి, బరువులోనేమి, పరిమాణంలోనేమి, అభివృద్ధి విషయంలోనేమి జంతువుల మెదడుకు, మనుష్యుల మెదడుకు చాలా తేడాలు వున్నాయి. కుందేలు, ఎలుక, పిల్లి, చివరికి కుర్కురము—మెదడులు ఏదో సాధారణంగా మనుష్యుల మెదడులను పోలివుంటాయే కాని, మనుష్యుల మెదడులు కావు. మనుష్యుల మెదడుతో పోల్చిచూస్తే, ఆ ఇతరమైన జంతువుల మెదడులు—చివరికి మనుష్యులతో పోలికలగల ప్రాణి విశేషాలయొక్క మెదడులుగూడా చాలా చిన్నవిగాను, బరువు తక్కువఅయినవిగాను; పట్టి ప్రాథమిక స్థితిలో వున్నటువంటివిగాను కన్పిస్తాయి. ఈ తేడా మనుష్యుణ్ణి సర్వప్రాణికోటిలోను విశిష్టుణ్ణి చేస్తున్నది. మనుష్యుడు ఎక్కువ ఆలోచనలు చేయగలవాడు, తెలిసి వ్యవహరించగలవాడు అవుతున్నాడు. ఇంకా ఎంతవాడో అవుతున్నాడు. అయితే ఈ ఆలోచనలు, మొదలైనవి ఒకపద్ధతిలోపడి, వానికి ఒక మార్గము, వ్యవస్థ ఏర్పడటానికి చాలాకాలం పట్టివుంటుంది: మానవ జాతిలో నాగరికతాతారతమ్యాలను, చరిత్రనుబట్టి ఇటువంటి విషయాలను కొంత తెలుసుకోవచ్చు. అంతేగాక, మానవుని ఊహాపోహలకు వయస్సుకూడా కారణం అవుతున్నది. ఒక వయస్సులోని ఊహాపోహలు ఇంకొ వయస్సులో వుండాలని లేదు. 'నువ్వు మరీ పసివాడివి అయిపోతున్నావు' అని వృద్ధులను ఆ వృద్ధులకన్న వయస్సులలో చిన్నవారైనవారు అనడం వింటూవుంటాం. అనగా పసివాని ఆలోచనములకు, వృద్ధుల ఆలోచనములకు తారతమ్యం వున్నదని, వుంటుందని అనియేకదా—అర్థం.

మరి ఈ వయస్సును మనీషులు స్థూలంగా నాల్గువిధాలుగా విభజించారు. మహాకవియైన కాళిదాసు తన రఘువంశంలో వయస్సుయొక్క దశలను, ఆ దశలలో మానవుని ప్రవృత్తి నివృత్తి వ్యాపార ధర్మాలను శిల్పసుందరంగా చెప్పివున్నాడు.

> శైశవేభ్యస్త విద్యానాం
> యౌవనే విషయైషిణాం
> వార్ధకే మునివృత్తీనాం
> యోగేనాంతే తనుత్యజాం' అని.

అయితే కొందరు ఈ వయో విశేష వికాసంలో ఇంకా కొన్నిదశలను అంతర్దశలనుగూడా ప్రస్తావించివున్నారు. కౌమారము, పౌగండము—ఇట్లా. ఇది అంతా ఎందుకంటే, మనుష్యునియొక్క వేరు వేరు దశలలో అతని ఆలోచనలు, ఊహాపోహలు, జీవితానుభవము మొదలైన సమస్తమున్నూ మారుతూ వుంటాయని అనడానికి.

ఇట్టి ఈ మానవుణ్ణి ఒకసామాన్యమైన ధర్మంమీద నిల్పడం ఎట్లా అన్నది అనాదినుంచీ గూడా మనుష్యునికే పెద్దసమస్య అయిపోయింది. ఏదేశం ధర్మశాస్త్రం చూచినా, ఇది ఇట్లా అని తెలుస్తుంది. మనుష్యుడు మనుష్యుడేగాని మనుష్యునిలో అగ్నిపర్వతాలదగ్గరనుంచి మురికి గుంటలలదాకా వున్నాయి. ఆ మనస్సు ఒక్కవిధంగా పనిచేయదు. అందరిలోను అది ఒక్కతీరులోనే వుండదు. అందరికి వుండే చిత్తవృత్తిధర్మాలు ఒక్కటేఅయినా, వానిలో తీవ్రతామాంద్యాలు,గోతులు, పల్లాలు, హిమవన్నగోన్నత

శిఖరోత్తాలమైన ఔన్నత్యాలు, పాతాళకుహరనిపాత సన్నిభాలైన పడిపోవుటలు—ఇన్ని వున్నాయి. ఇచ్చట ఒక సమ్యగ్ధర్మసాధన లేకపోతే మనిషి చెడతాడు. మనుష్యప్రపంచమూ చెడుతుంది. ఈ విషయంమీదనే మతాలు, నాగరికతలు, సమాజాలు, వ్యవస్థలు లేచాయి. లేస్తున్నాయి. మనుష్యజాతి వున్నంతవరకు లేస్తాయి.

మనుష్యునియొక్క స్థితి ఇది అవడంచేత ఇచ్చట అంతరాలు ఏర్పడుతున్నాయి. తరము తరము మధ్య ఇవి గోచరిస్తున్నాయి. ఒక తరము 'వృద్ధమై', మరియొక తరము యౌవనాయత్తమౌతూ వున్నప్పుడు, ఆ యువతరం ఆవృద్ధతరం విషయంలో తప్పులు పట్టడము, న్యూనంగా చూడటము, ఇంకా ఏమేమో అనడము కన్పిస్తుంది. ఇది మానవజాతిలో ఇప్పుడే కొత్తగా పుట్టిందికాదు. మానవజాతి అభ్యుదయమో, పతనమో, అంతా ఇట్టి సంఘర్షణమీదనే నడుస్తూ వస్తున్నది. ఒక భావాన్ని, ఇంకో భావం అంది పుచ్చుకొని, అదే ఇది అయినట్లుగా పరిణామం చెందుతూ మానవజాతి సాగిపోగల్గితే, సంఘర్షణలు వుండవు. కాని అట్టిది సాధారణంగా జరగదు. భావానికి భావానికి సంఘర్షణ వుంటుంది. ఇప్పుడు ప్రపంచంలో తరముల అంతరం నాబడుతున్న విశేష వాదం ఇటువంటి భావ సంఘర్షణకు చెందిందే.

## 2

ఈ రకమైన భావసంఘర్షణ ఐరోపాలో, అమెరికాలో స్పష్టరూపం దాల్చి కన్పిస్తూవుంది. మనవంటి దేశాలలో లేదాఅంటే వున్నదిగాని, అంత ప్రచురంగా, కాష్ఠస్థాయికివచ్చి కన్పించడం లేదు.లేదో, మన మేధావులు ఆ సంఘర్షణను గురించి ఆలోచించి దానికి స్వరూప లక్షణాలను ఇదమిత్థంగా నిరూపించి, దాని అక్షరరూప నిరూపణం చెయ్యలేక పోతున్నారని అనవలసి వుంటుంది. ఎందుకు ఇట్లా అనడంఅంటే, ఇచ్చట ఏ రకమైన ఉద్యమ పరిణామ విపరిణామాలు పొటమరించినా, వానిని పాశ్చాత్య పరిభాషలోనే మన మేధావులు వ్యక్తీకరణ చెయ్యడానికి ప్రయత్నిస్తున్నారు. ఇది సరియైన పద్ధతేనా అనిపిస్తుంది.

ప్రతిసమాజంయొక్క పరిణామం చరిత్ర ఒక్క విధంగా వున్నప్పుడు అట్టిదికుదరవచ్చు. లేదా మానవుని పురోగతిలో అన్నిదేశాల మధ్యను సమానమైన అభ్యుదయ సత్తా సాధ్యం అయి, అట్టిది ఏర్పడినప్పుడు — అట్టిది సాధ్యం కావచ్చు. ప్రపంచంలో ఇంకా ఏదేశం సభ్యత, ఏదేశం నాగరికత ఆ దేశానిదిగా వుంటున్నది. ఏ దేశచరిత్ర ఆ దేశానిది, ఏ దేశం సాహిత్యం ఆ దేశానిది, ఏదేశం జీవితం ఆ దేశానిది అయివుంటున్నది. జీవిస్తున్న వారంతా మానవులే అవడంచేత కొన్ని సామాన్యధర్మాలు అచ్చట అచ్చట కన్పించవచ్చు. అన్నింటికంటె మించి సాంప్రదాయం అన్నది ఒకటివున్నది. దీన్ని చాలామంది అధునాతనులు—దానివిషయం ఏమిటో తెలియకుండానే కొట్టిపారవేస్తూ వుంటారు. అది ఏదో అభివృద్ధి నిరోధకమైన దినుసు అయినట్లుగా గేలిచేస్తూవుంటారు. ఈ అనభిజ్ఞతను ఏమనాలి? దానిని దానికి పెట్టవలసిన పేరుపెట్టి చెబితే ఆ అందరికి కోపంవస్తుంది. అయినా అదివుంది. మహా మేధావియైన వైట్‌హెడ్‌కావుల్సు తను ఒకానొక గ్రంథంయొక్కపీఠికలో తాను నాగరికత అని, సభ్యత అని అంటున్నప్పుడు గ్రీకులతోను, రోమనులతోను పుట్టిపెరిగిన నాగరికతా విశేషాన్ని మాత్రమే దృష్టిలో పెట్టుకు మాట్లాడుతున్నామని, తమకు ప్రాచ్యదేశముల విషయము తెలియదని వ్రాశారు. అంటే, తాను వ్రాసిన గ్రంథానికి, గ్రంథవిషయానికి సాంప్రదాయానుబంధం ఆయన కల్పించుకుంటూవున్నారన్నమాట. మన తెలుగుదేశంలో ఏ ప్రబంధాన్ని తీసుకుచూచినా, ఈ 'సాంప్రదాయానుబంధము', 'అభ్యుదయ పరంపరాభివృద్ధి' అన్న పదబంధాలు కన్పిస్తాయి. వాని అర్థం ఏమో తెలుసుకొన్న, ఆ ఆలోచనాపద్ధతిలోని శాస్త్రీయ వైశారద్యం కన్పిస్తుంది. ఈ సాంప్రదాయానుబంధ విచ్ఛిత్తి జరిగిందోఏమో, మనలో మేధావులము అనుకునేవాళ్లు, ఎక్కడో ఏఖండంలోనో జరుగుతున్న అక్కడి సమాజావ్యవస్థలోని, సమాజాల ధర్మాలలోని వత్యాసవైధర్మ్యాలవల్ల సంప్రాప్తమైన, అవుతున్న భావ సంఘర్షణ విశేషాలను చూచికాదు— చదివి—

వానిని ఇచ్చట సాంఘిక ప్రకోపనాలమీద అధ్యారోపం చేసి, అప్పుడు ఆ ప్రకోపనాన్ని గురించిన వింగడింపును ప్రారంభంచేస్తూ వున్నందువల్ల, అచ్చట అన్నమునకు అన్నమూ మెతుకునకు మెతుకూ తెలియని ఒకానొక అయోమయ స్థితి ఏర్పడుతున్నది.

భావబహుత్వ, అభిప్రాయ బహుత్వ, సిద్ధాంత బహుత్వ సమాజాలను గురించేకాక, ఏకాకారభావ, ఏకాకార అభిప్రాయ, ఏకాకార సిద్ధాంతావలంబనం చేత విశిష్టాలైనట్లు స్వయంగా భావిస్తున్న సమాజాలలోగూడా ఈ సాంప్రదాయ ప్రాబల్యాలను చూడవచ్చు. రష్యా చైనాలు రెండూ కమ్యూనిస్టు సిద్ధాంతాలను అవలంబించి నడుస్తూవున్నామంటున్న రాజ్యాలే. కాని ఆ రెండు రాజ్యాలమధ్యను ఇప్పుడు పచ్చగడ్డివేస్తే భగ్గుమంటున్నది. ఇందుకు ఇతరమైన బహుకారణాలను చెప్పవచ్చు. కాని ప్రధానంగా ఆ రెండు దేశాల మధ్యనువున్న సాంప్రదాయవైధర్మ్యం ఇందుకు కారణమని అనిపిస్తుంది. ఇది పైకి కన్పించనికారణం—మనస్సులో అవ్యక్తమైన ఆ మనస్సుయొక్క లోపలి పొరలలో వుండి, పైకి కన్పించరాక, తనపనిని తాను మరి ఒక కంటికి కన్పించకుండా చేసుకుపోతూవుండే, అతి ప్రబలమైన చైత్తికధర్మవిశేషంగా దానిని మనం భావించవచ్చు.

## 3

ఇట్లా సాంప్రదాయానుబంధం కల్పించుకొని ఇచ్చటి పురాతనులు మనుష్యజీవితాన్ని గురించి ఎట్లా ఆలోచించిందీ పరిశీలిస్తే ఒక్కవిషయం స్పష్టంగా కన్పిస్తుంది. ఆ పురాతకులు ధర్మానికిముందు, మోక్షానికి చివర ప్రాధాన్యం ఇచ్చారు. మధ్య అర్థాన్ని, కామాన్ని బిగించారు. వానిని నాల్గింటిని కలిపి పురుషార్థాలన్నారు. వీనిని అంతా అనుసరించాలని ఆ పురాతనులు ఎంతగా భావించినా అట్లా జరిగిందని చెప్పడానికి చరిత్రలోగాని, చరిత్రకాని పురాణాదికాలలోగాని ఆర్బేద ఖలాలులేవు. ఉపనిషత్తులలో ఒక కథ వుంది. బ్రహ్మ వున్నాడు. ఇంద్రుడు, వైరోచనుడుగావుల్చు ఆయనవద్దకు వస్తారు. జీవితంలో పరమార్థం ఏదో అది చెప్పవలసిందిఅని ఆ బ్రహ్మను వారు కోరుతారు. బ్రహ్మ వారికి బహువిషయాలు బోధిస్తూపోతాడు. ఒక దశలో వైరోచనుడు తృప్తిపడి, మళ్లీ రాడు. ఆ వైరోచనుడు బ్రహ్మద్రవ్యాన్నిగురించి తప్ప తక్కిన అన్నింటిని గురించిన్నీ మాత్రము బ్రహ్మ వలన తెలుసుకుంటాడు. ఇంద్రుడు ఆ తర్వాతగూడా వచ్చి బ్రహ్మవిద్యను పొందుతాడు. ఇది కథ. ఇందులో వైరోచనుడు కోరిన, పొంది సంతృప్తిపడిన జీవిత పరమార్థం ఈ చెప్పిన పురుషార్థాలలో మూడింటిలో ఇమిడిపోతుంది. అనగా అతను త్రైవర్గ్యుడు మాత్రమే అవుతాడు. ధర్మము, అర్థము, కామములతో అతను తృప్తి పొందాడు. పరమపురుషార్థమైన నాల్గవ పురుషార్థం అతనికి అక్కరలేక పోయింది. అతని మనస్సే దానిమీదకు ప్రసరించలేదు. ఇదే విధంగా ధర్మము, మోక్షములతో నిమిత్తములేని అర్థ, కామాలనే అనుష్ఠించేవారు వుండవచ్చు.

ఇట్లా ఈ పురుషార్థాలు మనుష్యుని జీవన ధర్మ పరమార్థాలుగా భాసింపచేయబడినప్పుడు మనుష్యుని జీవనగమనంయొక్క పిండీకృతార్థం పరమమైన స్థితిలో ఆ పురాతనులచేత ఊహించబడింది. ఇప్పటికీ—ఆచరణలో లేకపోయినా 'ధర్మార్థకామమోక్ష చతుర్విధ పురుషార్థ సిద్ధ్యర్థం' అని చెప్పకుంటూ వుండటం వుండనే వున్నది.

పురుషార్థాలలో కామం బలీయమైనదని అనాదిగా అంగీకరింపబడుతూనే వచ్చింది. తిరిగి ఆ పురాతనులే మనుష్యునకు — అంతశ్శత్రులెవ్వరు అని ఆలోచించి, కామానికి మొదటిపీట వేశారు. భగవత్ గీతలలో ఇట్లా వుంది.

ధ్యాయతో విషయాన్ పుంసః
సంగస్తేషూపజాయతే
సంగాత్ సంజాయతే కామః
కామాత్ క్రోధోఽభిజాయతే
క్రోధాత్ భవతి సంమోహః
సంమోహాత్ స్మృతి విభ్రమః

స్మృతిభ్రంశాత్ బుద్ధినాశో
బుద్ధినాశాత్ ప్రణశ్యతి.

అట్లాగే ఇంకోచోట గీతలలోనే—

కామఏష క్రోధఏష
రజోగుణ సముద్భవః
మహాశనో మహాపాప్మా
విద్ధ్యేన మిహ వైరిణం

ఇట్లా అనేకవిధాలుగా కామంయొక్క బలం గుర్తింపబడివుంది. ఈపైన ఉదాహరింపబడిన గీతా శ్లోకంలో ఆ కామము రజోగుణమువలన పుట్టినదని, అది సఫలము కానపుడు క్రోధరూపాన్ని ధరిస్తూ వున్నదనిన్నీ, ఆ కామము తనివితీరనిదనిన్నీ, పాప భూయిష్టమైనదనిన్నీ ఆత్మయోగమునకు అదిశత్రువు అనిన్నీ కామంయొక్క ఔద్ధత్యం స్పష్టపరచబడివుంది.

అరిషడ్వర్గాలుగా చెప్పబడిన కామక్రోధాదులు వున్నాయంటే, వానిని తీసుకొని వానియొక్క వస్తుస్థితి ప్రవృత్తినిబట్టి చూచినా, అవి అన్నీగూడా కామంయొక్క తీవ్రమందాదిదశావిశేషాలేగాని వేరే కాదువలె కన్పిస్తుంది. ఆ కామంయొక్క వివిధ వృత్తులే అవి. ఉపనిషత్తులలో గూడా సృష్టిని గురించిచెప్పే కొన్ని కొన్ని పట్టులలో—

'సో ఒకా మ య త'

అన్నపద్ధతి వుంది. అచ్చట ఆ కామశబ్దం అర్థం ఇంకొకటి అనుకున్నప్పటికి సృష్టికార్యం జరపాలన్న ఉత్సుకతకల్గిన ఆ తొలిదైవంలోని సంకల్ప వృత్తికి 'కామ' శబ్దంచేత ప్రతీతిని కల్గించవలసి వచ్చిన స్థితిని గమనించవలసి వుంది.

## 4

ఇప్పుడు ఈ చెప్పబడిన కామభావనకు బహు రకాలయిన అర్థాలు ఏర్పడ్డాయి. వాత్స్యాయనుని నాటికి, అతనికి ఎంతో కొంతముందు—ఈ కామము అన్నపదము ఇప్పుడు ఇంగ్లీషులో 'సెక్సు' అన్న శబ్దముచేత చెప్పబడు సర్వమైన అర్థానికి అనువర్తనం చెందివున్నట్లు కన్పిస్తుంది. అయితే ప్రేమకు, కామానికి భేదం ఎంచబడుతున్నది. కామము అంటే, ఒక పురునికి అన్యస్త్రీయందు, ఒక స్త్రీకి అన్యపురుషుని యందు కలిగేటటువంటి ఒకానొక అధర్మ శృంగారభావ విషయంఅన్నఅర్థం ఇప్పుడు వ్యాప్తిలో వుంది.ఇక ప్రేమ అన్న దానిని గురించి చెప్పనవసరం లేదు. అది చాలా పవిత్రమైన వస్తువు అని అందరు వ్రాస్తూనే వున్నారు. ఇంగ్లీషులో ఈ ప్రేమను love అని, కామాన్ని lust అని అంటున్నారు. స్త్రీ పురుష విషయకమైన సర్వఅనురాగవ్యాపారాన్ని చెప్పడానికి 'సెక్స్' అంటున్నారు. అయితే శాస్త్రకారులు 'కామాన్ని' ఇప్పటి సెక్సు అన్న అర్థంలోనే వాడినట్లు కన్పిస్తూంది గనుక, ఆ 'సెక్సు' అన్న అర్థ ప్రతీతికి 'కామం' అన్నమాటను వినియోగం చెయ్యవచ్చు. ఎందుచేతనంటే, ఇప్పుడు ఆ పూర్వులువాడిన పరిభాష అమలులో లేదు. ఇంగ్లీషు పరిభాషనే చాలా వరకు అనుసరించడం జరుగుతోంది. అందువల్ల, అటువంటి విషయాలను గూర్చి చెప్పవలసి వచ్చినప్పుడు—పూర్వపు శాస్త్రాలలో చెప్పబడిన 'కామం' స్థానే 'సెక్సు' అన్నమాటను పర్యాయంగా వాడుకుంటే అటూఇటూగూడా కుదురుతుంది.

'సెక్సు' విషయాలను గురించి ఎవరు ఏమి చెప్పినా, లేక ఎవరు మాట్లాడినా, అది ఏదో పెద్ద దోషం అయిపోయినట్లు, ఆ మాట్లాడటం పాపం అయినట్లు మనలో చాలామంది భావిస్తారు. కాని సంఘజీవనంలోనేగాక, సంఘంయొక్క సుస్థితికి, నీతికి, మర్యాదకు, చివరికి శరీరస్వస్థతకుగూడా ఈ విషయాలు అందరికి తెలియడం అవసరంఅని, మన పూర్వులకు తెలిసినంతగా, ఇప్పటి మనకు తెలియకపోవడం విచిత్రమే అనిపిస్తుంది. ఆ పూర్వులు ఇందులో శాస్త్రాలను రచించారు. అక్కడితో ఆ మీమాంస మనదేశంలో ఆగిపోయింది. వాత్స్యాయనుని తర్వాత సమాజంలోని అతిప్రధానమైన ఈ విషయాన్నిగురించిన విజిజ్ఞాసే దాదాపు అడుగంటిపోయింది.

ఏహో కాకమ్మకథలవంటి సంగతులు ఆ శాస్త్రం స్థానాన్ని ఆక్రమించుకున్నాయి. ఇచ్చట సంఘాన్ని తీసుకొని దానియొక్క సర్వవైఖరులను పరిశీలించి, మీమాంసించి నిమగనంచేసే పద్ధతి పోయింది. శృంగారం అన్నది అన్నిరసాలకు తల్లివంటిదిఅని ఆలంకారికులు అయితే చెప్పారుగాని, ఆ భావనగూడా విభావానుభావ వ్యభిచారీభావ సంచారీభావాలచుట్టూనే ఇప్పటికీ తిరుగుతోంది. ఆ తర్వాత దానినిగురించిన మీమాంసే లేదు. అందువల్లనే సమాజాలయొక్క అభ్యుదయాలకు, నీతిధర్మాల నిలకడకు ప్రాణఘాతమైన విషయం ఎక్కడో ఎక్కడిఒక సమాజంలోనో ఎవరో శాస్త్రజ్ఞులు జరిపిన పరిశోధనల ఫలితాలను అంటబట్టుకొని, మనం ఇక్కడ పోవలసివస్తున్నదేగాని, ఇచ్చటి సమాజంలో ఈ కామం ప్రవృత్తిపద్ధతి పరిణామాదికాలు ఎట్లా వుంటున్నదీ అనుశీలించి,ఆ అనుశీలనాన్ని శాస్త్రస్థాయికి తీసుకొనిపోతున్న లక్షణం కన్పించదు.

ఈ రకమైన పరిశీలనం ఎంత ముఖ్యమో, ఆ 'సెక్సు' అన్నది కొన్ని కొన్ని సమాజాలలో ఏమి చేస్తున్నదో, ఆచ్చటి పెద్దలువ్రాయగా దానిని చదవ కల్గితే కొంత మనకుగూడా, అటువంటి అనుశీలనము సమాజంయొక్క, జీవితంయొక్క సమ్యగవగాహనకు, ఆ అనుశీలనంయొక్క అవసరము విస్పష్టమై, దృష్టిగోచరాలవుతాయి.

ఇది ఒక విధంగా ఎవరి ఆత్మను వారు పరిశీలించుకొనడం వంటిది. ఎందుచేతననగా మనుష్యునిలో పుట్టే ఆలోచనలు భావాలు విరివిగా, అనంతంగా, మధురంగా, వికారంగా, శ్రేయస్కాముకంగా, దౌర్గత్యంగా—అనేక విధాలుగా వుంటాయి. మనసు లక్షణం అది. పూర్వపు శాస్త్రాదికాలలో అంతశ్శత్రు మీమాంస జరిగిందంటే, దానిఅర్థం ఇదే. ఇచ్చట బహుమానవ అంతర్గత ప్రకోపకారి సర్వభావ సంపత్తిని సాధ్యమైనంతవరకు అవలోడనంచేసి, వానికి కేవల స్థితిని నిరూపించి, ఆ పూర్వులు కామము, క్రోధము, మదము, మాత్సర్యమూ మొదలైన చిత్తవిక్షేపాలను నిరూఢికి తెచ్చారు. అవి ఏదేశంలో, ఏ కాలంలో, అయినా నిరవచ్ఛిన్నంగా అర్థం అవుతాయి. **అయితే** సంఘం అన్నది మారుతూవుంటుంది గనుక, ఈ కేవలస్థితికి చేర్చబడిన చిత్త ప్రకోపన విక్షేపణ విషయాదికాలు, ఆ మారినసంఘంలో ఎట్లా అనువర్తిస్తున్నాయో, అంతఃపూర్వపు సంఘం పద్ధతులతో ఎట్లా వికటిస్తున్నాయో, వానికి ఘర్షణఎట్లా ఏర్పడుతున్నదో, పరిశీలనచేసి, అందుకు కారణాలను తెల్పి, సరియైన సమన్వయ మార్గాన్ని అన్వేషించని పక్షంలో సంఘం యావత్తూగూడా ఒక విధమైన అవ్యవస్థపాలుకాగలస్థితి ఏర్పడుతుంది.

ఈ సంఘర్షణ మనదేశంలో కొన్నికొన్ని విషయాలలో ప్రచురం అయినట్లు 'సెక్సు', అందుకు సంబంధించిన నీతి నిబంధనల విషయంలో ప్రచురం కాలేదు. అట్లాఅని అది అక్కడ లేదనికాదు. దానిని మనము చూడటంలేదు. చూచినా పట్టించుకొనడం లేదు. సంఘంయొక్క శ్రేయస్కాముమైన మనదృష్టియందలి లోపమునకు, జనులయొక్క సుస్థితియందు మనయందుగల ఔదాసీన్యానికి ఇదిఒక తార్కాణ. ఈ స్థితి చాటుమాటలకు, చీకటి గుసగుసలకు కారణమవుతున్నది. ఒకప్పుడు చలం ప్రభృతి కొందరు రచయితలు ఇటువంటి విషయాలనుగురించి కొంత వ్రాశారుగాని, అవి కొన్ని కొన్ని సిద్ధాంత జడిమల వలన ఏకదేశం అయిపోయినాయి. ఆ రోజులలో హాల్ కైన్ ప్రభృతి కొందరు పాశ్చాత్య నవలాకారుల ప్రాబల్యం ప్రబలినంతగా, శాస్త్రదృష్టి ప్రబలలేదు. అందువల్ల ఆనాటి ఆ రచనలు వస్తునిష్ఠ అనుశీలనం లేనివై, కథలుగా మిగిలి, కాలంమీద నిష్ప్రయోజకాలై పోయినాయి.

ఈ రకమైన కృషి రచయితలుచేయగా సమర్థులేఅయినా, వారియందు నికషమైన శాస్త్రదృష్టి వుండదు. మనుష్యులను, వారి చిత్తవృత్తులను రచయితలు సూక్ష్మంగా పరిశీలించగల శక్తిగలవారే అని అనుకున్నా, ఆ పరిశీలనం వారియొక్క రచనకు ఇతివృత్తమైన కథావిషయాభిముఖంగాపోయి పరిధి పరిమితము, అనుశీలనం అనిష్కృష్టము అయిపోతాయి. **అందువల్లనే** సమాజశాస్త్రమర్మాలను ఎరిగినవారు, చరిత్రగతి తెలిసినవారు, వస్తునిష్ఠమైన అనుశీలనం చేయడంలో నిష్ణాతులు మాత్రమే ఇందుకు తగుతారు. అటువంటి వారివలననే విషయం విశ్లేషించబడి, శాస్త్రంగా నిరూపించబడుతుంది. (సశేషం)

కిలగూరిగింప:

# వేంకటాధ్వరి

భారతి ఏప్రిల్ 1971 ప్రతిలో, ప్రధానముగా నన్ను ఆకర్షించిన వ్యాసము, శ్రీమాన్ ఈయుణ్ణి వేంకటవీరరాఘవాచార్యులవారి 'ఆంధ్రులైన సంస్కృతకవిశేఖరులు'. వీరిలో వేంకటాధ్వరి గురించి మరికొన్ని అంశములను వివరించుటకుగల ఉత్సాహముచే ఈ వ్యాసమును వ్రాయడమైనది. వేంకటాధ్వరి అసలుపేరు అరశాణపాలెం వేంకటాచార్య. వీరు కాంచీపురమునకు దగ్గరగానున్న అరశాణపాలెంలో జన్మించారు. వీరి తండ్రి రఘునాథాచార్య. తల్లి సీతమాంబ. వీరు ఆత్రేయగోత్రజులు. వీరి పితామహులు అప్పయాధ్వరిగా ప్రసిద్ధిచెందిన శ్రీనివాసాచార్య. శ్రీనివాసాచార్యగారు, పంచమతభంజకులుగా ప్రఖ్యాతులైన కాంచీపురం తాతాచార్యులవారి మేనల్లుడు. వేంకటాధ్వరి 17 వ శతాబ్దివాడు. వీరు వడగల సాంప్రదాయముగల శ్రీవైష్ణవులు. వీరు వేదవేదాంతముల కూలంకషాధ్యయనపరులు. వీరికి తర్కమీమాంస వ్యాకరణ నాటకాలంకార శాస్త్రములందు అసమానపాండిత్యము గలదు. వీరి శ్లేషకవితాకౌశలము అద్వితీయము. వీరు శ్లేషయమకచక్రవర్తులు. వీరు కొంతకాలము ప్రళయకావేరి ఆస్థానపండితులుగా నుండిరి. వేదాంతదేశిక సాంప్రదాయానుయాయులు. వేదాంతదేశికుల తర్వాత అంతటి ప్రజ్ఞకలవారు వేంకటాధ్వరియని చెప్పవచ్చును. వీరు రచించిన గ్రంథములలో విశ్వగుణాదర్శచంపు, లక్ష్మీసహస్రము ప్రసిద్ధములు. విశ్వగుణాదర్శచంపు రచనా విధానములో నొకచోట భగవదపచారము అగుటవలన వీరికి దృష్టిపోయినదని, పాదుకాసహస్రము (వేదాంతదేశికులది) వలె 'లక్ష్మీసహస్రము' 1000 శ్లోకములతో స్తోత్రము చేయుటవలన పునః దృష్టి ప్రసాదము గలిగినదని చెప్పబడినది. అధ్వరి అనుపదము నామాంతము లందుండుటచే, వేంకటాధ్వరి, వీరి పూర్వవంశీయులు యజ్ఞములజేసిన వారలని తెలియుచున్నది.

వేంకటాధ్వరికి వ్యాకరణము కరతలామలకము. వీరి వ్యాకరణ విజ్ఞాన ప్రజ్ఞావిశేషము వీరు రచించిన మరియొక్క కావ్యము '**శ్రీరాఘవయాదవీయము**' నందు ప్రస్ఫుటమగుచున్నది. ఈ కావ్యము 30 శ్లోకములుగలది. ఈ శ్లోకములను అనులోమముగా చదివినయెడల రామచరితము, ప్రతిలోమముగా చదివినయెడల భాగవతమునందలి విషయములు తెలియును. కావున ఈ కావ్యము 60 శ్లోకముల పరిమితి యగుచున్నది. కావ్యారంభమున తిరుపతి శ్రీవేంకటేశ్వరస్వామిని, శ్రీరామచంద్రుని, శ్రీకృష్ణుని స్తుతించెను.

కించి త్సంచిన్త్యయా గోపీ
కిలకించిత వంచితమ్।
అంచితం జ్యోతి రమరై
రంజనాద్రావుదంచితమ్॥

భావము:—కొంచెము పరధ్యానముగా నుండుటచేత గోపిక గిలిగింతకు వంచితమైన గొప్పజ్యోతి అంజనాద్రియందు దేవతలచే పూజింపబడి ఒప్పుచున్నది.

భద్రోల్లాసం భాస్కరాపత్య
వాహిన్యస్తర్ద్విడ్వ్యస్తవైర్యుగ్రబాణః।
నాథో౽హల్యానందహేతుః
ప్రదత్తాం రాజీవాక్షో రాఘవో యాదవో వా॥

భావము :— సూర్యవంశ మనెడునదియందు క్రీడించునట్టి, నశించిన శత్రువులుగల, ఉగ్రబాణములుగల, అహల్యయొక్క ఆనందమునకు హేతువునగు రాజీవాక్షుడైన ప్రభువైన రాఘవుడు (శ్రీరామ

చం(దుడు)గాని, యమునానదిలో (క్రీడించువాడును, శ(త్రునిర్మూలకుడును, ఉ(గబాణములు కలవాడును, బలరామునికి సంతోషమునకు కారణమైన (ప్రభు వైన యాదవుడు ((శ్రీకృష్ణుడుగాని) మంగళ వికాస మును (ప్రసాదించుగాత,

కావ్యాంతమున కావ్యరచనాపద్ధతి చెప్పబడినది.

అనువర్ణిత రామకృష్ణవృత్తే
రనులోమ (ప్రతిలోమ వాచనాభ్యాస్ ।
కృతిముల్లసితాం విధాయపద్యైః
వివృణోతి స్వయమేవ వేంకటార్యః ॥

భావము : అనులోమ (ప్రతిలోమ పాఠభేదము చేత రామకృష్ణ చరితములను వర్ణించిన వేంకటా ధ్వరి తన 'రాఘవయాదవీయము'నకు తానే వృత్తిని రచించినాడు.

వేంకటాధ్వరియొక్క విశ్వగుణాదర్శ చంపు, లక్ష్మీసహస్రము ఇత్యాది (గ్రంథములు ఒకయెత్తు. (శ్రీ రాఘవయాదవీయము మరియొక యెత్తు. సంస్కృతములో శ్లేషను కవితోపకరణముగాజేపి నాయకద్వయ మును చిత్రించెడు (గ్రంథములు పెక్కుకలవు. ఈ రచనా విధానములో వేంకటాధ్వరి నిష్ణాత. కాని అంతకంటె మిన్నయగు అనులోమ (ప్రతిలోమ పఠన ముల వలన జ్ఞాతమగు నాయకద్వయచరితములుగల ఈ కావ్యము అపూర్వము, మరియు దుష్కరము. ఇటువంటి రచనా పద్ధతియందు భాషా శైలి సారళ్య రహితముగను, అర్థమగుట కష్టసాధ్యముగాను ఉండుట సహజము. శబ్దములపై (క్రీడింపవలె నన్న యెంతయో వ్యాకరణ విజ్ఞాన వైదుష్యము అవసరము. (శ్రీరాఘవయాదవీయము వేంకటాధ్వరి విశిష్టశాబ్దికచాతుర్యమును చాటుచున్నది. ఈ కావ్య మును పండితుడైనను సామాన్యముగ అర్థము చేసి కొనుట సాధ్యముగాదు. ఇటువంటి విచిత్ర వినూత్న రచనా విధానము ఏ భాషలోనైనను అరుదేయని చెప్పవచ్చును. ఈ కావ్యమును అనులోమముగా జదివిన యెడల, రామచరితము తెలియును. ఇందలి రామ చరితాంశములకు వాల్మీకిరామాయణములోని అంశ ములకు వైరుధ్యము లేదుగాని, (ప్రతిలోమముగా జదివినపుడు తెలియు కృష్ణచరితములోని అంశము అనగా (శ్రీకృష్ణుడు (ప్రద్యుమ్న సహితముగా పారి జాతముకొరకు పోవువిషయము, భాగవతములోని అంశమునకు ((శ్రీకృష్ణుడు సత్యభామ సమేతముగా పోవు అంశము) భిన్నముగానున్నది.

విద్యున్మాలా, అనుష్టుప్ వృత్తములలో ఈ కావ్యము నిబంధింప బడినది—26 అనుష్టుప్‌లు, 3 విద్యున్మాలలు, ఒక (స్రగ్విణి.

కావ్యముయొక్క మొదటి శ్లోకము

శ్లో॥ వందేఽహం దేవం తం (శ్రీతం
రంతారం కాలం భాసాయః ।
రామోరామా ధీరాప్యాగో
లీలామారాయోధ్యేవాసే ॥

పద విభాగము

వందే అహం దేవం తం (శ్రీతం రంతారం కాలం భాసా యః; రామః రామా ధీః ఆప్యాగః లీలాం ఆర అయోధ్యేవాసే; రామాధీ =రామాయాంధీః యస్యసః, సీతయందు మనస్సుకలవాడై, ఆప్యాగః =ఆప్తుం యోగ్యాః అగాః యస్యసః— సహ్యమలయాదిపర్వత ములకు వెళ్లినవాడై, యః రామః అయోధ్యే= అయోధ్యాభవే వాసే=గృహే, అయోధ్యలో తన నివాస ములో, లీలాం=(క్రీడాం, ఆర=(ప్రాప్తవానితిభావః. భాసా కాంత్యా కాలం రంతారం (క్రీడితారం ఇతి యావత్, (శ్రీతం=(శ్రియా ఇతం (ప్రాప్తం. తం దేవం అహం వందే, (ప్రణమామీత్యర్థః.

భావము : సీతకొరకు వ్యాకులమనస్కుడై సహ్యమలయాదిపర్వతములనుదాటి రావణుని చంపి, తిరిగి సీతతో అయోధ్యకువచ్చి, చిరకాలము స్వనివా సమునందు (క్రీడించిన (శ్రీరామచం(దునికి నమస్క రించుచున్నాను.

(ప్రతిలోమ పాఠః

శ్లో. సేవాధ్యేయో రామాలాలీ
గోప్యారాధీ మారామోరాః ।

యస్సాభాలంకారంతారం
తం శ్రీతం వందేఽహం దేవం ॥

ప ద వి భా గ ము

సేవాధ్యేయఃరామాలాలీ గోప్యారాధీ మారా మోరాః యఃసాభాలంకారంతారం తం శ్రీతం వందే అహం దేవమ్.

మారామోరాః=మా యాః లక్ష్మ్యాః ఆరామభూతం ఉరః వక్షః యస్యసః=లక్ష్మికి భోగ్యస్థానమగు వక్షము గలవాడు.

సేవాధ్యేయః = సేవాదిభిః ధ్యేయః ధ్యాతుం యోగ్యః—తపోయజ్ఞాది సేవలచేత ధ్యానింపదగినవాడు.

రామాలాలీ= రుక్మిణ్యాదిఅష్టమహిషులను, లాలయతి=లాలించువాడు; యః=కృష్ణః, గోప్యారాధీః= గోప్యః రాధమొదలగు గోపికలను, ఆరాధయతి= ఆరాధించువాడు; (గోపీ ప్రేమారాధకుడు); సాభాలంకారం=సాభాః సదీప్తికాః, అలంకారాః=కౌస్తుభాది భూషణములు,యస్య=ఎవనికికలవో,తం శ్రీతం=లక్ష్మితో కూడకొనిన వానిని, తం దేవం=శ్రీకృష్ణుని, తారం= ఉచ్చైః బిగ్గరగా, వందే=స్తామి–స్తుతించుచున్నాను

(వది స్తుత్య ఖవాదనయోః లట్ ఏకవచనము)

భావము:—లక్ష్మీదేవికి భోగ్యస్థానమగువక్షము కలవాడును, తపోయజ్ఞములతో ధ్యానింపదగినవాడును, రుక్మిణ్యాది అష్టభార్యలను లాలించువాడును, రాధ మొదలగు గోపాంగనలను ఆరాధించువాడును,కౌస్తుభాది భూషణములతో భాసించువాడును అగు శ్రీకృష్ణుని బిగ్గరగా స్తుతించుచున్నాను.

—శ్రీ ఇరంగంటి రంగాచార్య.

# పత్తుపాట్టు
## (పదిపాటలు)

తెలుగు సాహిత్యాన్ని పఠించేటప్పుడు సౌలభ్యంకోసం కొన్ని యుగాలుగా విభజించుకున్నాము. అలాగే తమిళంలోకూడా విభజన ఉన్నది. వాటిలో మొదటిది సంఘకాలము. ఇది సుమారు రెండువేల సంవత్సరాలకు ముందు వెలసిన సాహిత్యం. ప్రాచీన తమిళుల చరిత్ర, వారి జీవిత విధానములు, అభిరుచులు, ప్రేమలు, వివాహాలు వగైరా తెలుసుకునేందుకు ఈ సాహిత్యం ఉపయోగపడుతుంది.

ఆ కాలంలో రచింపబడినవని చెప్పబడుతున్న పది పెద్దపాటలే 'పత్తుపాట్టు' అనే పేరుతో ప్రసిద్ధి వహించాయి. ఇవి వర్ణనాత్మక గీతములు. వీనిని ఆంగ్లంలో 'Idylls' అంటారు. ప్రకృతిలోని చిత్రవిచిత్రములైన దృశ్యాలనుగాని, జీవితంలో రస పుష్టిగల చక్కని సన్నివేశాన్నిగాని వర్ణించే గీతాలను 'Idylls' అంటారు. ఈ పది పాటలలో ఆ కాలంలో వారు కన్నదీ, విన్నదీ అత్యంత మనోహరంగా చిత్రించ బడింది. ఆ నాటి తమిళుల దైనందిక జీవనము, కొండలు, కోనలు, ఆకులు, పూవులు, పక్షులు, జంతువులు, నదులు, సముద్రాలు ఈ పాటలలో కవులు వర్ణించారు. వారి విషయాలు ముఖ్యంగా మూడు—ప్రకృతి, ప్రేమ, యుద్ధము.

ఈ పదిపాటలపేర్లు వచ్చునట్లు రచింపబడిన పద్యమిది.

మురుగు పొరునాఱు పాణిరండు ముల్లై
పెరుగు వళమదురైక్ కాఞ్చి—మరు వినియ
కోలనెడు నల్వాడై కోల్కుఱిఞ్చిప్ పట్టినప్
పాలై కడాల్ తొడువ్ పత్తు.

ఈ పద్యములో పేర్లు వరుసగా లేవు. కాల మునుబట్టి కొంతవరకు సమంజసమైన రీతిలో ఈ పదిపాటలనుగూర్చి క్రింద వివరిస్తున్నాను. ఈపది పాటలకు జె. వి. చెల్లయ్యగారు చేసిన ఆంగ్లానువాద మున్నది. తమిళమూలం అతిక్లిష్టమైనది. అది తమిళులకే అర్థంకాదు. అందువల్ల ఈ వ్యాసంలో ఉదాహరించిన చోట చెల్లయ్యగారి ఆంగ్లానువాదాన్నే ఇచ్చాను.

### 1. పొరునరాట్రుప్పడై :

ముడత్తామక్కణ్ణియార్ అనుకవి కరికాళ చోళుని కంకితముచేసి పాడింది. దీనిలో 'పొరునన్'

అను సంగీతవిద్వాంసుడు కరికాళ చోళుని సేవించుట ఉన్నది. కవే పొరునన్‌గా వ్యవహరిస్తాడు. యాల్ అనే సంగీత వాద్యాన్నిగూర్చి ఉంది. ఈ పాటలో 248 పాదములు ఉన్నవి. ప్రాచీన తమిళుల జీవన విధానం ఇందులో చక్కగా వ్యక్తమవుతుంది. అసామాన్యములైన వర్ణనలున్నవి. ఉపమానములు విశిష్టములు. పాదములను కుక్కల నాలుకలతో పోల్చడం, చూపులను ఆడునెమలి చూపులతో పోల్చడం మొదలైనవి వారి వర్ణనల్లోని ప్రత్యేకతను చూపుతున్నవి.

స్త్రీవర్ణన :

'A belt of many beads adorn her hips
That seem the seat of bees. Her thighs are round
And closely set resembling thick-set trunks
Of huge she-elephants. Her small fair feet
Resemble tongues of panting dogs and suit
Her smooth-haired ankles well. As when she walks
On strong ground as red as vermilion,
Her feet are blistered much and seethe with boils
That look like masal fruits that are mature.
She does not travel in the noon-day sun.
These are the traits of the worthy female bard
Who has the pea-hen's looks.

## 2. పట్టినప్పాలై :

కడియలూర్—ఉరుత్తిరఙ్గణ్ణన్ వ్రాసినది. కరికాళచోళుని కంకితము. పట్టినప్పం అనగా పట్టణము. ఈ పాటలో కావేరిపట్టణమును కవి వర్ణించాడు. పాలై అంటే వియోగము. ఈ పాటపేరుకు పూర్తిఅర్థం—కావేరిపట్టణానికి పోదలచిన ప్రియునికి ప్రేయసితో వియోగము సంభవించిందన్నమాట. దీనిలో 301 పాదములున్నవి. కవి కరికాళచోళుని వద్దకు పోవాలనుకుంటాడు. అతని భార్య వియోగ భారాన్ని సహించలేకపోయింది. ఈ పాటలో చోళ రాజధానినిగూర్చి, చోళరాజునుగూర్చి కవి చక్కగా వర్ణించాడు. కావేరిపట్టణ వర్ణన చేసేటప్పుడు కవి ఆ కాలంలో వ్యాపారం ఎలా జరిగేది చెప్పాడు. ఈ వర్ణన ఆనాటి తమిళులు ఎంతగొప్పగా వ్యాపారంచేసేవారో తెలుపుతుంది.

'Himalayas sends gems and gold
While Kudda hills, the sandal wood
And akhil; pearls from the south seas come!
Red coral from the eastern sea
The Ganges and the Kaveri bring
Their yield: Ceylon provides its food.
And Burma, manufactures rare.

## 3. ముల్లైప్పాట్టు :

నప్పూతనార్ చెప్పినది. ముల్లై అనగా అడవి ప్రదేశము. సువాసనగల పుష్పములు పూచే ఒక తీగ ముల్లై. ఆ అడవిలో ఈ తీగలు ఎక్కువ. ఈ పాటలో భర్త వానాకాలం వచ్చేలోపల తిరిగివస్తానని పోతాడు. కాని రాడు. వానలు వస్తాయి. భార్య దుఃఖిస్తూ ఉంటుంది. ఏడు అంతస్తుల భవనంలో అతనికొరకు ఎదురుచూస్తుంటుంది. ఈ పాటలో ఆ కాలపు ప్రజల పద్ధతులు, నమ్మకాలు, యుద్ధవిషయాలు వర్ణింపబడినవి. నీటిగడియారం ఆ కాలంలో ఉపయోగించేవారని తెలుస్తోంది. దీనిలో 103 పాదాలున్నవి. అన్నిటిలోకి చిన్నది.

## 4. పెరుమ్బాణాట్రుప్పడై :

కడియలూర్ ఉరుత్తిరఙ్గణ్ణనార్ వ్రాసినది. తొణ్డైమాన్ ఇళన్దిరైయన్‌కు అంకితము చేయబడినది. ఈ పాటలో 500 పాదములున్నవి. దీని కర్థం—యాల్అనే వాద్యం (పెద్దది కాబట్టి పెరుమ్ అని చెప్పబడింది) సాధన చేయడంలో నిపుణుడైన పాణాన్‌నుగూర్చి చెప్పినట్టిది. ప్రాచీనతమిళులు, వారి ఆచారవ్యవహారాలు, వారి ఆహారం, మొదలైనవి దీంట్లో తెలుపబడ్డాయి. జంతువులని వేటాడడం, వరి పండించడం మొదలయినవి ఉన్నవి. స్త్రీలు ఆ కాలంలో స్వతంత్రంగా ఉండేవారు. ధనవంతులైన స్త్రీలు బంతియాడడం మొదలైనవి వర్ణింప

ఉద్దాయి. సుబ్రహ్మణ్యేశ్వరుని (మురుగన్) పై భక్తి కన్పించును. ప్రకృతివర్ణనలు చక్కనివి వున్నవి.

## 5. చిఱుపాణా(ట్రుప్పడై :

నత్తత్తనార్ పాడినది. నల్లియకొండన్ అను వానికి అంకితము. దీనిలో 269 పాదములున్నవి. ఇది చిన్న యాల్ వాద్యమును ప్రయోగించు పానాన్‌ను గూర్చి చెప్పబడింది. దీనిలోకూడ వర్ణనలు చాలా ఉన్నాయి. స్త్రీ వర్ణనలు విలక్షణంగా ఉన్నాయి...

'Their teeth shine like
The juice of breast-shaped young palmyra fruits
That grow in clusters large.'

## 6. నెడునల్ వాడై :

మదురై క్కణక్కాయనార్ కుమారుడు నక్కీరనార్ వ్రాసినది. నెడుఞ్జెలియన్ను గూర్చి పాడినది. ఈ పాటపేరు కర్థం గొప్ప ఉత్తరపుగాలి అని. అంటే శీతాకాలము. ఈపాటలో 188 పాదాలున్నాయి. శీతాకాలాన్ని గూర్చి గొప్ప వర్ణనలున్నాయి. ఇదియొక వియోగగీతం. ఆనాటి సంఘజీవితం పద్ధతులు, తమిళ దేశంలో ఉండే, యవనాది విదేశీయులు, తమిళుల నృత్యాలు మొదలైనవి వర్ణింపబడ్డవి. ఒక విలక్షణమైన స్త్రీ వర్ణన చూడండి.

"She looks like a picture drawn without the paint
Soft maids complexioned like the mango shoot,
Whose skins have patches wide of beauty spots,
Whose soft, round shoulders are like bamboo smooth,
Whose breasts that look like lotus buds are bound..."

## 7. కుఱిఞ్చిప్పాట్టు :

కపిలర్ పాడినది. తమిళ కవిత్వ లక్షణాలను ఆర్యప్రభువైన పిరకత్తనుకు చెప్పడానికి ఈ పాట ఉద్దేశింపబడింది. దీంట్లో 261 పాదాలున్నాయి. కురించి అనేది ఒకచెట్టు. అది యెక్కువగాఉంటే కొండప్రదేశాన్ని వర్ణించే పాటయిది. ఇది ఒక ప్రేమ గీతముకూడ. ప్రథమ వీక్షణముననే కల్గిన ప్రేమని గూర్చి వర్ణిస్తున్నదీ పాట (Love at fist sight). అచ్చటచ్చట ప్రాచీన తమిళుల జీవనవిధానం వర్ణింపబడింది. కొండప్రజలు ఎక్కువగ బట్టలు ధరించే వారుకాదు. హారాలు, పుష్పాలు, ఆకులు ధరించేవారు. స్త్రీలు, తమ జడల్ని 5 పాయలుగ చేసేవారు. ఇప్పుడు తమిళులలో ఈ విధానం కనబడకపోయినా బర్మాలో కనిపిస్తుంది. చందనాది సుగంధద్రవ్యాలు ఆ కాలంలో వాడేవారు. వేట వారిముఖ్యజీవనము. నీరు చేతిలోకి తీసికొని శపథంచేసే ఆచారం ఉండేది. ఉపమానంలోనే మరొక ఉపమానం ఉండే విచిత్రమైన అలంకారాలు రెండు ఉన్నవి. హఠాత్తుగా ప్రియుడు ప్రియురాలిని కౌగిలిస్తాడు. ఆమె ప్రేమతో తత్తరపాటుతో వణుకుతుంది. మత్తుపదార్థం సేవించిన నెమలితో ఆమె పోల్చబడింది. కవి అంతటితో వదలలేదు. ఆ నెమలి త్రాడుమీద నృత్యంచేసి అలసిపోయిన నాట్యగత్తెలాగున్నదని పోల్చాడు. ఈ పాటలో ఆ కాలంలో కవికి తెలిసిన 99 పుష్పముల పేర్లు చెప్పాడు. ఈ పాటలో సాయంకాల వర్ణన చాలా రమణీయంగా ఉంది.

"The wide-rayed sun that drives its seven-horsed car
Sank down and disappeared behind the hills.
The deer took refuge under trees in crowds
And herds of cows that into commons crowd
Called out their calves. The bent billed nightingale
Whose voice is trumpet-like called to its mate
From broad-leaved palmyras. The smoke its gem
Disgorged. The ambal tune that herdsman play

On sweet clear lutes is sounded here and there.
The ambal opened out its petals bright:
The priests performed religious rites at eve;...."

## 8. మదురైక్కాంచి :

మాంగుడి మరుదనార్ వ్రాసినది. నెడుంజెళియన్‌కు అంకితము. మధురనుగూర్చిన పాట. పాండ్య రాజు, ఆయన రాజ్యము, పరిపాలన, రాజధాని మధుర లను వర్ణించే గీతమిది. అన్నింటికంటె పెద్దది. 782 పాదాలున్నవి. వ్యంగ్యంగా రాజు ఎలా పరి పాలించాలి, ప్రజలను ఏ విధంగా చూడాలి—అనే విష యములు తెలుపబడినవి. చాలవరకు పాండ్యరాజు విజయాలు వర్ణించాడు కవి. ఈ పాటలో ఎక్కువ ప్రాముఖ్యం వహించేది, మధురాపట్టణ వర్ణనము. ఆ నగరం ప్రొద్దున, సాయంకాలం, రాత్రి, అర్ధ రాత్రి, వేకువ ఎలా ఉంటుందో విపులంగా వర్ణించాడు కవి.

## 9. మలైపడు కడామ్ :

పెరుఙ్‌గౌశిర్‌నార్ నన్నన్ అను వానిని గూర్చి పాడినది. 583 పాదములున్నవి. మలైపడు కడామ్ అనగా కొండనుండి స్రవించు ద్రవమని అర్థము. కొండ మదజలమును స్రవించు ఏనుగుతో పోల్చబడినది. ఈ పాటకు అసలు అర్థం 'కొండనుండి వచ్చే ధ్వనులు' అని. దీనిలో ఎక్కువగా పర్వత వర్ణన లున్నాయి. ఆ నాటి ఆచారాలను గూర్చికూడ ఉంది. కన్నులలో ఎఱ్ఱజీర ఉన్నచో అందమని వారి అభి ప్రాయం.

'Deer-like and red-streaked eyes they have.'

## 10. తిరుమురుగాట్రుప్పడై :

నక్కీరుడు చెప్పినది. కుమారవేలన్ (మురు గన్)కు అంకితము. దేవునిగూర్చిన పాట. యుద్ధదేవు డైన మురుగనిగూర్చి చెప్పినది. దీనిలో మురుగన్ దేవాలయములు, కొండలు, ప్రాచీన తమిళుల జీవితము, మొదలైనవి కవి వర్ణించాడు. శైవులు ఈ గ్రంథాన్ని పవిత్రంగా ఎంచుతారు. దీనిలో 317 పాదాలున్నవి. మురుగన్ వైభవము వర్ణితము. మధుర, తిరుపరన్ గున్ఱమ్, తిరువావినన్‌గుడి, తిరుచెందూరు, తిరువేరాగన్ మొదలైన క్షేత్రాలను కవి వర్ణించాడు. ఈ పాటలో పురాణాలలో ఉండే కథలున్నాయి.

సంక్షిప్తంగా ఈ పది పాటలను గూర్చి పైన వివరించాను. ఈ పది పాటలలో తమిళులనుగూర్చి ఎన్నో విషయాలు మనకు తెలుస్తాయి. వీనినిగూర్చి మరికొంత వివరాలు ఈ క్రింద ఇస్తున్నాను.

### భాష :

ఈ పాటలలో భాష చాలా కఠినమైంది. చాలవరకు సంస్కృత ప్రభావంలేని దినాలలో వ్రాయ బడ్డాయివి. సంస్కృత పదాలు చాలా తక్కువ. ఇవి వ్రాయబడిన విధానంకూడా విలక్షణంగా ఉంది. వ్యాఖ్యానం లేకుండా అర్థంకావు.

### మతము :

మురుగన్ ప్రధాన దైవం. మురుగన్ ఆర్యుల కార్తికేయునితో సమానుడు. ఆర్యుల దేవతలనుకూడ కొంతమందిని పూజించేవారు. ద్రావిడుల యుద్ధదేవత కొట్రవై. ఈమె ఆర్యుల దుర్గతో సరిపోలును. ముల్లైప్పాటులోవచ్చే మాయన్ విష్ణువు. శివుడు ఒకటిరెండు గీతాలలో వస్తాడు. వీరుకాక ఇంకా కొందరు చిల్లర దేవుళ్లనుకూడా వారు కొలిచేవారు.

### ఈ పాటల ఔన్నత్యము :

పటిష్ఠమైన భావాలు, విలక్షణమైన భాష, విశిష్టమైన రచన వీని ప్రత్యేకత. కఠినంగా ఉన్నప్ప టికీ వీనిలోని కవిత్వం రసహృదయాల్ని చూర గొంటుంది.

### వర్ణనలు :

కృత్రిమమైన రచయితలు కారీకవులు. తమ చుట్టుఉన్న ప్రకృతిని అత్యంత మనోహరంగా ఈ పాటల్లో చిత్రించారు వారు. కొండలు, మేఘాలు,

సముద్రము, నదులు, అడవులు, జంతువులు, పక్షులు మొ॥ వి వారి వర్ణనలు. పుష్పములపైన వారికి ఎన లేని ప్రీతి. వారి సహజత్వం ప్రకృతి వర్ణనల్లోనేకాక స్త్రీ వర్ణనలలోకూడా కనిపిస్తుంది. వారి అలంకారాలు చాలా సున్నితమైనవి. వారి వర్ణనలు అత్యంత సహజములైనవి.

**సాంఘిక జీవనము :**

ఆర్యుల చాతుర్వర్ణ్య విధానంలేదు. తొల్కాప్పియర్ వేరే వర్గీకరణం చెప్పాడు. రైతులు, జాలరులు, గొల్లలు, వేటకాండ్రు, కంసాలులు, వడ్రంగులు, మొ॥ వారు ఉండేవారు. స్త్రీలు స్వాతంత్ర్యం కలిగి ఉండేవారు. పరదా పద్ధతిలేదు. యువకులలో కలిసి నృత్యం చేసేవారు. చాలావరకు నగ్నంగానేఉండేవారు. ఆకులు, పుష్పము మొ॥ వారి దుస్తులు. వరి యెక్కువగ ఆహారము. శాకాహారులుకాదు. అన్నం—పేకు, తాటిఆకుల్లో తినేవారు. వారిగృహాలు గుడిసెలు. ధనవంతులు ఏడుఅంతస్తుల మేడల్లోకూడ నివసించేవారు. నృత్యాలు, గానము, నాటకాలుమాడడం, మల్లయుద్ధం మొ॥ వారి వినోదాలు.

**రాజ్యము :**

చేర, చోళ, పాండ్యరాజ్యాలు, పరిపాలనా విధానం వర్ణింపబడ్డాయి. రాజులు, మంత్రులు మత గురువులు, సైన్యాధికారులు. రాయబారులు, గూఢ చారులు, న్యాయాధిపతులు, మొ॥ వారినిగూర్చి ఉన్నది. ప్రాచీన తమిళులు తగవులలో ఆసక్తి కలవారు. ఉద్రేక స్వభావులు. చతురంగ బలములుండేవి. ఆనాడు సముద్రాలుదాటి వ్యాపారం చేసేవారు. గ్రీసు, రోము, చైనాలతో వ్యాపారం జరిగేది. నెమళ్లు, రత్నాలు, మిరపకాయలు, ఉప్పు ఎగుమతి చేసేవారు. గుర్రాలు మొ॥ వి దిగుమతి చేసుకొనేవారు. కావేరీపట్టణం వీటికి కేంద్రస్థానం. ఈ విధంగా ఈ పదిపాటలవల్ల మనకెన్నో విషయాలు తెలుస్తాయి. ప్రాచీన తమిళుల జీవితానికి ఈ పాటలు దర్పణముల వంటివి.

(సంప్రతించిన ముఖ్యగ్రంథము : పత్తుపాట్టు (అనువాదము. జె. వి. చెల్లయ్య)— దక్షిణ భారత శైవ సిద్ధాంత సొసైటీ. తిరునల్వేలి—6.)

—శ్రీ రాళ్లపల్లి సుందరం

# వచనకవిత్వం—ఒక పరిశీలన

వచనకవితాభిమానులు వచన కవిత్వానికి లేనిపోని గొప్పలు అంటగట్టి టప్పాలు కొడుతున్న విమర్శకులను భుజాలు తడుముకొనేట్లు చేసింది నోరి నరసింహ శాస్త్రిగారి 'వచన కవిత్వము—అభిమానుల అత్యుక్తులు' అనే వ్యాసం. ఆధునికులకు ప్రాచీనులకన్న అధికులమన్న అహంకారం ప్రబలంగా వుండటమేగాక, వారిని వారి కవిత్వాన్ని దూషించకపోతే వీరి కవిత్వం నిలబడలేదన్న భయమూ కనిపిస్తున్నది. ఈనాడు ప్రాచీనకావ్యాలు చదువక గాసటబీసట చదువులు చదివి వచన కవిత్వాన్ని ఆశ్రయిస్తున్నవారు అధికం. వ్యాకరణం రాదు. భాష రాదు. అలంకారా లంతకన్నా సున్నా. అందరికీ సులభమైపోయింది. ప్రతీవాడూ కవిత్వం రాసేవాడైపోయాడు. ఉబలాటం కనిపిస్తుందే గాని, తగిన అధ్యయనం, అభ్యాసం కొరవడిపోయాయి. సమర్థుడైన కవి ఛందస్సులో రాసినా, వచనంలో పలికినా అందంగానే వుంటుంది. వచనకవిత్వం పేరిట వెలువడుతున్న కావ్యాలలో కవిత్వమనదగింది చాలా స్వల్పం. ప్రాచీనులలోవున్న ప్రతిభా వ్యుత్పన్నతలు చాలామంది వచనకవులలో వున్నవనుకోవడం భ్రమ. ఛందస్సులో రాయటం చేతగాక రాస్తున్నామంటే ఒప్పుకోవచ్చుగాని కవిత్వానికి ఛందస్సు అడ్డంకంటే కవి సామర్థ్యాన్ని శంకించవలసివస్తుంది. ఒకదాన్ని తిట్టటం వలన ప్రయోజనంలేదు. అక్షరాల కూర్పుతో ఒక విధమయిన లయ ఏర్పడుతుంది. ఆ లయను కత్తిరింపగా గణా లేర్పడినాయి. ఆ గణాలవరస మారుస్తూ పేర్చుకొంటూపోతే పద్యా లేర్పడ్డాయి. ఈ గణబద్ధపు పద్యాల్లో భాషలో సహజంగావుండే యతిప్రాసలు చేరాయి. ఇది సూక్ష్మంగా ఛందోవిచారణ. తిక్కన భారతాన్నిచూస్తే ఈ గణబద్ధ ఛందస్సు ఎంతగా సౌందర్యాన్ని సృష్టించిందో తెలుస్తుంది. 'ముక్త

ఛందస్సులోకూడా నియమబద్ధమైన గురులఘువుల కూర్పువుంది. వచనకవిత్వాన్ని రాసి మెప్పించినవారు బహుకొద్ది. వారైనా పూర్వాశ్రమంలో గణబద్ధ ఛందస్సులో పద్యాలల్లినవారే. డొక్కశుద్ధిగా కావ్య భాష ఎరిగినవారు, శ్రీ శ్రీ, తిలక్—కుందుర్తి వంటివారు నిలబడగలిగారు.

ఇటీవల సాహిత్యంలో వామపక్ష ధోరణులు ప్రబలినవి. రాజకీయాల లుకలుకలతో కవిత్వాన్ని కూడా రాజకీయ జంబాలంలో ముంచివేయుటకు విఫల యత్నం చేస్తున్నారు. సాహిత్యంలో వ్యంగ్యం, చమత్కారం నశించిపోయింది. ఇది సాహిత్యానికే అపచారం. 'Letarature is the intellectual essence of the nation' అన్నాడు లెస్సింగ్. ఆ వాక్యానికి మన సాహిత్యం ఎంతదూరంలో వుందో విజ్ఞులు గుర్తించగలరు. తెలుగులో ఆలంకారిక చర్చ జరగ వలసిన అవశ్యకత ఎంతో వుంది.

కవులు పామరులుకాదు. వారి ఆవేశం ఆలోచనాత్మకం. వచనకవుల్లో హృదయం లోపిస్తున్నది. ఇది ఆరోగ్యకరంకాదు. మేధ హృదయం—ఈరెంటి యొక్క అపూర్వమాధుర్యసమ్మేళనంగావుండాలికవిత్వం. ఛందోబద్ధ కవిత్వాన్ని, వచన కవిత్వాన్ని ఒక గాట కట్టివేయరాదు. దేని గొప్పదనం దానికుంది.

—శివకుమార్.

# వీ ర శ్రీ నా థ ము

**జూన్** నెల భారతిలో శ్రీ బాలసుబ్రహ్మణ్యంగారి 'వీర శ్రీనాథము'—అను వ్యాసము వారికి పల్నాటి వీర చరిత్రముపైగల ప్రగాఢాభిమానమును వ్యక్తము చేయుచున్నది. కాని, వారు నేలవిడచి సాముచేయుట మాత్రము ఉచితముగలేదు. వ్యాస ప్రారంభ భాగమున వారు ఆంధ్ర సాహిత్యమునుగూర్చి కొన్ని యభిప్రాయ ములను ప్రకటించినారు. వారి యభిప్రాయములు తొందరపాటుతో కూడినవిగ తోచుచున్నవి.

" 'కవిః క్రాంతదర్శీ'. యను నానుడిగాని, 'నానృషిః కురుతే కావ్యమ్' అను నియమముగాని మన తెలుగుకవుల కన్వయించుట క్వాచిత్కమే యనుట సాహసముగాదు. కారణ మేమనగా తెలుగు కవులు ముప్పాతిక ముప్వీసముమంది క్రాంతిని దర్శించినది లేదు''—ఈ విధాన వారి వాదన కొనసాగినది. తెనుగు కవులు అనువాదములు చేయుటచే వారు క్రాంతదర్శులు గాని, ఋషులుగాని కాలేకపోయిరి — అని బాల సుబ్రహ్మణ్యముగారి వాదము. స్వతంత్రకావ్య నిర్మాత ఎంతటి క్రాంతదర్శియగునో అంతటి క్రాంతదర్శనము అనువాదకునకు గూడ నుండవలెననునది విమర్శకలోక మంగీకరించినదే. ' భారత పరమార్థమును గ్రహింప కయే నన్నయ అనువదించెనా? వాల్మీకివలె గెడ్డములు పెంచనంత కారణమున రంగనాథుని రామాయణమున క్రాంతదర్శిత్వము కొరవడినదా ? అనుభూతిలేక మానసిక పరిపక్వతలేక ఎవడైన స్వతంత్రమో, అస్వతంత్రమో కవనమల్లగలడా? పోతన రసమయ జగత్తును సృష్టించినాడే! అతని గతి యేమైనది? తిక్కన వీరి దృష్టిలో 'సంస్కృత గ్రంథముపై స్వారి చేసిన తెలుగు రౌతు!'. వేమన వీరి దృష్టిపథమున లేడు గాబోలును! కథాకావ్యములను తేటతెనుగున రచించిన కొఱవి గోపరాజువంటి కవుల నీ వ్యాసకర్త విస్మరించెనా?

'నన్నయ్య తెలుగు కవి ఎప్పుడైనాడు?' అని వీరి ప్రశ్న. అతడు భారతాంధ్రీకరణమును సంస్కృత శ్లోకముతో ప్రారంభించినంత మాత్రమున తెనుగు కవి కాకపోవునా? కేవలము తెలుగు మాటలనే ఉపయోగించి, సంస్కృతపువాసన సోకని స్వతంత్రకావ్యము వ్రాయలేదని నాటి నన్నయపై నేడు ఆరోపణచేయుట కొంత వింతగ గన్పట్టుచున్నది. నన్నయకు పూర్వము కొన్ని కేవలము తెలుగు రచనలు వెలసినట్లు శాసనాదులవలన కొన్ని యాధారములు గన్పట్టుచున్నవిగదా? అవి కాలగర్భమున కలసిపోయి మన కలభ్యములగుటకు గల కారణముల నీ వ్యాసకర్త అన్వేషింపవలెను. సంస్కృతభాషకుగల విశేష ప్రాభవము దానికికారణమై

యుండవచ్చునేమో! అట్టి తెలుగుభాష నుద్ధరించుటకు—సంస్కరించుటకు కావ్యభాషగ రూపొందించుటకును నన్నయ ఎంతటి ప్రణాళిక ననుసరించి యుండునో మన మూహించవలెను. క్రమక్రమముగ సంస్కృతపు గుప్పిటనుండి తెలుగుభాషను తప్పింపవలయునేగాని, యొకేసారి తెలుగును మాత్రమే కావ్యభాషగ గ్రహించినచో తనకు ముందుపుట్టిన తెలుగు రచనల గతియే తన కృతికి గూడ పట్టునని నన్నయ తలపోసియుండును. ఆంధ్ర సాహిత్య క్రమపరిణామమును పరిశీలించినవారి కీ విషయము తెల్లము కాగలదు. 'అతని రచనాపద్ధతి అచ్చపు సంస్కృతము'—ఈ విషయముగూడ సరి కాదు. నన్నయ రచనాపద్ధతినిగూర్చి ఇతఃపూర్వ మనేకులు కాచివడబోసియున్నారు. వారి రచనలను పరిశీలించిన నన్నయది సజీవసృష్టియో, సంస్కృతమునకు అంధానుకరణమో గ్రహింపగలము. 'దండతాడితుఁ జేసెదన్' ఇది సంస్కృతమా! నన్నయ రచన సంస్కృత ప్రచురమన్నది లోకవిదితమే. కాని, అందలి తెలుగు 'చేసెదన్'వంటి క్రియాపదములకు మాత్రమే పరిమితమై యున్నదని తలచుట సమంజసముగలేదు.

'ఇక భావుకత విషయముననో — నానారుచిరార్థము లిచ్చు రమ్యములైన అక్షరముల మాత్రమే తనవియని కంఠోక్తముగ జెప్పియేయున్నాడు! అర్థములు మాత్రము వ్యాసునివే!'

—అనువాదగ్రంథమున అర్థములు వ్యాసునివిగాక నన్నయవి కాగలవా? 'రమ్యములైన అక్షరములు' అనగా ఆకర్షణీయములైన, గుండ్రని—లేక-శ్రుతిసుభగములు మాత్రమైన అక్షరములని వీరు తలచినట్లు కన్పట్టుచున్నది.

ఏభాషయందైనను అందఱు కవులు 'క్రాంతదర్శులు'గాని ఋషితుల్యులుగాని కాలేరు—కారు. ఆలెక్కకువచ్చిన తెలుగుకవులు ఇతరభాషలయందలికవుల కెవ్వరికిని తీసిపోరు. కాలమాన పరిస్థితులను గమనించుచు తెలుగుకవి ప్రతిసమయమునందును తన కర్తవ్యమును నిర్వహించుచున్నాడు. ప్రకృతిఇచ్చిన పిలుపు నందుకొని ఉద్యమశీలి యగుచున్నాడు. కావున—'ఆలోచించి చూడగా కవులకు లాక్షణికులు నిర్దేశించిన లక్షణములు తెలుగు కవులలో పదింట తొమ్మిదిమందికి లేవు'. ఇట్టి వ్రాతలు మిక్కిలి శోచనీయములుగనున్నవి.

'వసుచరిత్రకుగల గౌరవము కళాపూర్ణోదయమునకేది?' కళా పూర్ణోదయమునకు గౌరవము రాకపోవుట వసుచరిత్రకారుని దోషమా? పాఠకుల యభిరుచిని వదలి కవిని దూషించుట న్యాయమా! కాలానుగుణముగ ప్రజల అభిరుచులు మారుట లేదా?

'వేముల పూసెను, వేములకాసె, కడసారి ఫలములు కాకులకాయె'—ఇత్యాది రచనలకు గౌరవము లేకున్న నేటివఱకు ద్విపదకావ్యములెట్లు నిలచినవి? 'సింహాసన ద్వాత్రింశిక' వంటి కథా కావ్యములలోగల తెలుగు పాలెంతటిదో వ్యాసకర్త గుర్తింపలేదా? జానపద గేయములలోని రమ్యకల్పనలను రసజ్ఞులాదరించకుండిన నేటివఱకు నవెట్లు నిలచినవో! వేమనపద్యముల కేమైన చెదలుపట్టినవా! ఒకే రచన అందఱకును అభిరుచిని కలిగించునా? అందఱి అభిరుచులును ఒకేతీరున నుండునా?

ఉత్కృష్ట మనోధర్మ ప్రతిపాదకములగు 'భావములకు' తెలుగు గ్రంథములు 'మరుభూములై' నవట! 'కనీసమొకటి—రెండు ఒయాసిస్సు'లనైనను మనకొఱకు వీరు కనిపెట్టినారు. కాని, తెలుగు పాఠకులు నాలుక తడియారి—గొంతుక పిడుచ కట్టుకొనిపోయి లేరు. ఆంధ్రసాహితీ క్షేత్రమున జీవనదులు ప్రవహించి తేనెపంటలు పండినవి.

'తెలుగు ప్రతిభ వెలి విరియునని యు, తెలుగుదనము నిండినవియు, ఆద్యంతమును హృదయము నాకర్షించు నవియునగు కావ్యము లొకటో రెండో మాత్రమే తెలుగున నున్న'ట్లు వీరికి తోచినదట!

సహృదయముతో—సాహిత్యపువిలువల పరిధిలో సమ్యగవగాహన గలవారికి తెలుగు సాహిత్యము 'అంతటి నిరాశాజనకముగ మాత్రము లేదు.

రాయలు 'అతుకులబొంత'ను కూర్చుటకుగల 'కారణమేమి? ఆతని శ్రీవైష్ణవ మతాభిమానమే గాదా! స్థలపురాణమును రచించినంతమాత్రమున రామకృష్ణుని ఖ్యాతికేమి లేమివచ్చినది? ఒక్క నిగమశర్మోపాఖ్యానమే చాలదా! పల్నాటి వీరచరిత్ర వంటివి ఇంకను బొబ్బిలికథ, కాటమరాజుకథ మొదలగునవి కలవుకదా!

వ్యాసకర్త పల్నాటి వీరచరిత్రనుగూర్చి తమ యభిప్రాయములను చక్కగ వెలువరించినారు. వారి పరిశీలన చక్కగానున్నది.

—**ఉపాధ్యాయుల అప్పల నరసింహమూర్తి.**

---



# గ్రంథవిమర్శలు

## విషాద మోహనము

[కావ్యము; కవి: శ్రీ నాయని సుబ్బారావు; ప్రతులకు : ఆంధ్రసారస్వత పరిషత్తు : తిలక్‌రోడ్డు — హైదరాబాదు—1. (లేక) కవి, 8—3—898/5 ఎల్లారెడ్డిగూడ— హైదరాబాదు—38; 75 పేజీలు: వెల : రూ. 2—50.]

బాధ పడగలిగిన హృదయమే ప్రేమిస్తుంది. కవి హృదయం గాయపడినప్పుడు లోకానికి ఒక్కొక్కప్పుడు కావ్యం లభిస్తుంది. తన బాధనుకూడ లోకానికి కావ్యరూపంలో అందించి రసానందాన్ని కల్గించే కవి ధన్యజీవి. 'తరుః ప్రసూతే పుష్పాణి మరుద్వహతి సౌరభమ్' అన్నట్లు కవి కన్నీరుకార్చి, గద్గద కంఠంతో పలికితే, వణకే చేతులతో వ్రాస్తే ఆ కావ్యం ఆ బాధ నంతటినీ ప్రపంచపు మూలమూలలకూ కొనిపోతుంది. కీట్సుమరణం షెలీచేత 'Adonis' కావ్యం వ్రాయించింది. షెలీ కవనశక్తి రసజ్ఞు లెందరిచేతనో కీట్సుకై కన్నీళ్లు పెట్టించింది.

'కృష్ణరాయలతో దివికేగలేక జీవచ్ఛవంబగుచు' బ్రతికానని వాపోయిన పెద్దనవంటివారి రచనలలోను, నేటి తెలుగులో వస్తున్న ఎలిజీలలోను విషాదం సమానాంశమైనా వాటి రచనా పద్ధతులలో భిన్నత్వం కానవస్తున్నది. ఇప్పటి ఎలిజీ రచనలపై ఇంగ్లీషు కవితాప్రభావం అత్యధికం. వడ్డాది సుబ్బారాయకవిగారి 'సతీస్మృతి', విశ్వనాథ సత్యనారాయణగారి 'వరలక్ష్మి త్రిశతి' చాలవరకు ప్రాచీనపద్ధతికి చెందిన రచనలు. కొంపెల్ల జనార్దనరావుపై శ్రీ శ్రీ వ్రాసిన గీతమూ, నారాయణబాబుకోసం ఆరుద్ర వ్రాసినదీ, శ్రీదేవి మరణానంతరం శ్రీమతి నాయని కృష్ణకుమారి వ్రాసిన గీతమూ, బాలగంగాధరతిలక్ మరణించినప్పుడు 'ఇస్మాయిల్' వ్రాసినదీ సాహితీ బంధువులకోసం కవులు వ్రాసిన ఎలిజీలు. ఈ విధమైన ఎలజీలలో పైన పేర్కొన్నవి విశిష్టమైనవిగా ఎన్నిక చెయ్యవచ్చు.

'కృష్ణశాస్త్రి బాధ ప్రపంచానికిబాధ' అన్నారు చెలం. కృష్ణశాస్త్రిగారి వియోగ గీతికలతోపాటు బసవరాజు అప్పారావుగారు తమ చిన్నారిపాప మంగళప్రద, మరొక మగశిశువూ మరణించినప్పుడు వెలువరించిన కావ్యఖండికలు, నాయని సుబ్బారావుగారు తల్లి చనిపోయాక విలపిస్తూ వ్రాసిన 'మాతృగీతాలు' తెలుగుభాషలో అత్యుత్తమ కావ్యఖండికలు.

'విషాదమోహనము' వ్రాసిన నాయని సుబ్బారావుగారు సౌభద్రుని ప్రణయయాత్ర, వేదనావాసుదేవము, జన్మభూమి మొదలైన కావ్యాలద్వారా సుప్రసిద్ధులైన కవులే. మాతృగీతాల తర్వాత గుండెల్ని కదిలించి, కంటతడిపెట్టించి 'విషాదమోహనము'అనే ఈ కావ్యం చదువరులను రసపరవశులను చేస్తుంది. 'ఎలిజీ' రచనలో బసవరాజు, నాయనికవు లిరువురిలోనూ సమానమైన అంశాలున్నాయి. అవి గుండెల్ని దూసుకుపోయి, పాఠకులు తాదాత్మ్యం పొందటమే కాక వారితో కలిసి కన్నీళ్లు కార్చకుండ ఉండలేరు. గుండెల్ని చీల్చుకువచ్చిన వీరి కవిత్వానికి రక్తపుజీర కూడ అంటుకుని మరపురాని అనుభూతిని కలిగిస్తుంది. 'మరపురాని బాధకన్నా మధురమేలేదు.'

తన కుమారుడు మోహనకృష్ణుడు ముప్పైఐదు సంవత్సరాలు జీవించి మరణించగా అది పెద్దతనంలో భరించరాని కడుపుకోతకాగా ఎంతగానో దుఃఖించి ఆ దుఃఖాన్ని మాటలలోకి తీసుకురావటానికి చేసిన ప్రయత్నమే ఈ 'విషాదమోహనము.' తలంపులన్నీ తను కుమారునిగురించే అయినా చదువరులకు దాన్ని కావ్యవస్తువుగా స్వీకరించటానికి ఏమీ అభ్యంతరం ఉండదు. తండ్రీ కొడుకులు నిత్యమూ కలిసి జీవించిన సామాన్యసాంసారికదృశ్యాలే కుమారుడు పోయాక తలచుకొంటే గుండెలు బద్దలు చేయగా దాన్ని కావ్యంగా మలచటం అసాధారణమై

గుండెనిబ్బరం కలిగిన కవి మాత్రమే చేయగలిగినపని. తనకంటెముందు తన కుమారుని తీసుకొనిపోయిన ఈశ్వరుని సూటిగా, గొంతు చించుకొనిఅరిచి అంత లోనే వివేకం తెచ్చుకొని—

'ఏకై కసుతవియోగానలజ్వాలలేర్చ సంపిహిత
శోక మా రుసిజంట యిచ్చెనటనరేశునకు శాపమ్ము
ఏకై కసుత వియోగానలజ్వాల లేర్చుచుండియును
ప్రాకృతులము పరేశునకు నేమి శాపమ్మీయగలము!'

అని పలికి మానవుని అశక్తతకు క్రుంగిపోతారు. 'తలచుకొన్నకొలదీ ఎన్నెన్నో తలంపులు వీరిని కలచి వేస్తాయి. కుమారుడు కొనియిస్తానని చెప్పినపుడు గడియారముతో అవసరములేదని చెప్పారట. కాని యిప్పుడు కుమారుని గడియారం పెట్టుకొని

'దీనిని ధరియించలేను
వలదంచు తీయను లేను
దీని యాగని కొట్టుకొనుట
నీ గుండె తీరై ధ్వనించి'నదని కన్నీళ్లు పెట్టు కొంటారు. తనతోబాటు తన భార్య దుఃఖాన్నిగూడ వర్ణిస్తూ'

మా గుండె గుబులు పెల్లుబికి విరియ
మా కన్నులు నీరు వదలినపెన్నకాలువలు'

అని పేర్కొని ఆ దంపతుల దుఃఖాన్ని పాఠకు లందరూ పంచుకొనేటట్లు చేశారు. నాయని వారి పత్ని 'వత్సల' తెలుగు పాఠకులకు 'సౌభద్రుని ప్రణయ యాత్ర'ద్వారా పరిచితురాలే. కుమారుడు జబ్బుపడగా మాతృమూర్తి వత్సల పూజలెన్నోచేసి గూడ విఫలమైనదట. దానిని వివరిస్తూ—

'జీవన్మరణ సంధి, గొట్టుకొనుచున్న
చిన్నారి సుతుని
ప్రోవు మంబా! యంచు
శోకబాష్పావరుద్ధ కంఠమున
శ్రావణ శుక్రవారమున
వరలక్ష్మి సన్నిధి వగపుక్రోవి
వత్సల కొట్టినట్టి టెంకాయ
కుళ్లిపోయినది'

అనిచెప్పి కుమారుడి మరణాన్ని సూచించిన అమంగ ళాన్ని జ్ఞాపకానికి తెచ్చుకొన్నారు. ఏ పని చేయ బోయినా, రోజూ కలిపి భోజనం చేసినట్లుగా ప్రక్కన వెలితిగా ఉన్న కుమారుడి స్థలాన్ని చూచ కొని అన్నం మింగుడుపడక పడిన బాధను, తన కడగొట్టుకూతురు తన యింటికివచ్చి

'మీ యింట నుండిన ఖర్చునుచు
తటిమితిరిగా మమ్ము
మీ యింటి కేనేలవత్తు
నమ్మకు మీకు పట్టైన
మాయన్నయింటికి వచ్చితి
ననుచు మధుర హాసములు
పూయంగ. మోమున
నాకు బదులు చెప్పను కన్నతల్లి !
ఇప్పుడేమని యామె నందు
నామె యేమిచ్చు జవాబు!'

వంటి కడు చక్కని సాంసారిక దృశ్యాల జ్ఞాపకాలను, దీపావళికి మేనమామ తెచ్చియిచ్చే టపాకాయల కోసం ఎదురుచూచే మేనల్లుడిని ఊరడించటానికి తాతగారు

'దేవుడే కాల్చుకో ప్రీతిపడి
తన్ను తెమ్మనె నంట
కావడించుక టపాకాయ
లన్నియు కదలెరా మామ
దేవుని సన్నిధానమున కికరాడు
తిరిగి యనంగ
దేవనాకృతి యాచు వీడుపెట్టురా
దిగులు మొగమ్ము!'

అని కనుపించని కుమారుడితో బాధగా చెప్పు కొంటారు.

'దీపావళీ పర్వదినము కాదిది
తీవ్ర మత్సర్వ
పాపావళీ ప్రచోదిత
మహాతమఃపర్వదినమ్ము!—
నాయనివారి ఈ భావానికీ,

ఇంటింట దీపావళీ
మా ఇంట శోకాంధతిమిరావళీ'

అని పలికిన బసవరాజు అప్పారావుగారి భావానికీఉన్న సాన్నిహిత్యం ఈ కవు లిద్దరనూ సన్నిహితులను చేస్తున్నది. అందుకేనేమో నాయనివారు—

'కొడుకులో కూతులో పోవ నడలడెఁ
గూరి తాటలును
తడపలై కాలమ్ము వెళ్లబుచ్చెదు
తల్లిదండ్రులకు
పుడమి విషాద విశేష కావ్యముల్
పొంకించి కరుణ
కడమలంటిన ప్రాక్తనాధునాతన
కవి కవీ తతికి'

'విషాద మోహనము' కావ్యాన్ని అంకితం చేశారు.

'మాతృగీతాల'లో తల్లిని కోల్పోయిన తనయుని బాధను వర్ణించినట్లే తనయుని కోల్పోయిన తల్లి వత్సల విషాదాన్ని కుమారునితో చెప్పుకుంటూ—

'ధీరత్వ మాకారమైన
వత్సల ధీరత్వ మెల్ల
నీరుకాఱిన యట్లు
కాఱిపోయెరా నీవు పోవంగ
నూరక చేతులు త్రిప్పు
తనలోన నూరక గొణుగు
శ్రీ రాజరాజేశ్వరీవిరతపూజ !
చిత్తనిస్తేజ !'

పొఱదు తనబుద్ధి
నిత్యగృహకార్యభారమ్ములందు
నూరక పన్నుండి
నీ పటము వంక నొక్కటే చూపు సారించు
వారక నేత్రములవెంట సందింతలేక
కాఱెడు కన్నీరు ధారలై నింప
కర్ణరంధ్రములు!'

అని వ్రాశారు. కరుణరసాన్ని పోషించటంలో నాయని వారు అందెవేసిన చేయి అని యీ పద్యాలద్వారా నిరూపించుకొన్నారనిపిస్తుంది. పద్యం వ్రాయుటంలో నిరిది ధారాళమైన శైలి. ఎంత కటువైన సమాస మైనా వీరి చేతిలో వెన్నముద్దలా మారిపోతుంది.

'ఎవడురా వాడు!
నిర్ణీత నిరవధి సృష్టి కార్యమ్ము
నవధరించిన మహావేధ
గహ్వరాయతచతురాస్య
వివర నిర్గచ్ఛ దపూర్వ
నిర్ఘోష విదిత ఛాందసు డ
శివ వక్రరేఖ మానుదుట
నిట్లు గీసిన వ్రాతకాడు!'

ఇటువంటి పద్యాలు చదువగానే సంతకం అక్కర్లేకుండానే యిది నాయనివారి శైలి అని తెలిసిపోతుంది. 'మాతృగీతాల'లోని

'ఎవ్వడా విరసాత్మకుం డెవడు? సాంధ్య
రాగమంజులరేఖావిరాజమాన
మంగళాకాశ సీమంతరంగమందు
కారుచీకట్లరాసులు గ్రక్కినాడు'

అనే పద్యం జ్ఞాపకం వస్తుంది.

నాయనివారి శైలి విషయాన్ని గురించి చెప్పటానికి శ్రీ ముద్దుకృష్ణ 'వైతాళికులు' కవితా సంకలనంలో 'పద్యాలు జీవితాన్ని చీల్చుకుని వస్తవి. అందుచేతనే అంతబాధాకరంగా ఉంటవి. గుండెలకు తగిలేటట్టు చెబుతాడు, యత్నం లేకుండా. పద్య నిర్మాణానికి పాటుబడినట్టు కనిపించదు. అదే ఈయన కళ, గొప్పది. కవిత్వం ఈయనని వరించింది. వలపులో,విరహంలో, వేదనలో, మాతృప్రేమలో ఈయన కవిత్వం హృదయానికి గీటురాయి. ప్రియురాలి యెడబాటు పిచ్చివాణ్ణి చేసింది. తల్లి మరణం ఘోరు మనిపించింది. ఆనందంలో స్వర్గవీథులలో విహారం చేయిస్తాడు; బాధలో హృదయాన్ని బద్దలు కొడతాడు; బతుకులో కవిత్వం ఏరుకుంటాడు. ప్రతి పాదం జీవించే పలుకుతాడు. ఈయన గీతాలు ఉజ్వలములూ, ఉన్నతములూ'నని వ్రాసిన మాటలకంటె

అధికంగా ఏమీ చెప్పనక్కరలేదు. తల్లిమరణం భోరు మనిపించినట్లే పుత్రశోకం ఆయన కన్నులను 'పెన్న కాలువలు'గా మార్చింది. ఆ కన్నీటిచారల అక్షర రూపమే 'విషాదమోహనము' అనే విషాద మధుర కావ్యము. సౌభద్రుని ప్రణయయాత్ర ద్వారా కీర్తి తెచ్చుకొన్న నాయని సుబ్బారావుగారు శృంగార రస పోషణలోనేగాక, 'మాతృగీతాలు', 'విషాద మోహనము' కావ్యాలద్వారా తమ కీర్తిని అజరామరంగా చేసు కొన్నారు. సహృదయులు పదేపదే చదివి, కవిహృదయం లోని శోకాన్ని పంచుకొని కరుణరసానందాన్ని పొంద గల ఉత్తమకావ్యం 'విషాదమోహనము.'

—రామహనరాయ్.

# విక్రమోర్వశీయము

(అనువక్త, ప్రకాశకులు: శ్రీ మోచెర్ల రామకృష్ణకవి, అత్తితోట అగ్రహారము, నెల్లూరు. డెమీ 1/8 పే. 94 లు. వెల రు. 3/—లు.)

కాళిదాసుని అభిజ్ఞానశాకుంతలమును, మేఘ దూతమును పలువురాంధ్రీకరించిరికాని విక్రమోర్వశీ యాంధ్రీకరణములు కొద్దియే ఉండుటచేత ఈ ప్రయ త్నము సమ్మోదావహము.

శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారివంటివారు తమ 'మున్నుడి'లో కవిని అనువాదకులలో ఉత్తమ శ్రేణికి చెందినవారని ప్రశంసించుటచేత కావ్యపఠన మును ఉత్కంఠతో నారంభించితిమి. కాని నాందీ శ్లోకానువాదమే అసంతృప్తి కలిగించినది.

'వేదాన్తేషు య మాహు రేకపురుషం
వ్యాప్యస్థితం రోదసీ
యస్మి న్నీశ్వర ఇ త్యనన్యవిషయః
శబ్దో యథార్థాక్షరః
అంతర్యశ్చ ముముక్షుభి
ర్నియమితప్రాణాదిభి ర్మృగ్యతే
సస్థాణుః స్థిరభక్తియోగసులభో
నిఃశ్రేయసా యా స్తువః.'

'రోదసి నిండియున్న శివ
రూపు డెవండు, నుతించునేవిభున్
వేదశిఖాళి, సార్థమయి
నెక్కును నెవ్వరి కీశ్వరాఖ్య, ప్రా
ణాదుల నోర్చి యోగులు హృ
దంతరమం దెవనిం భజింతు రా
ర్యాదయితుం డతండు పురు
షార్థ పరంపర మీ కొసంగెడున్.!'

స్థాణువునకు విశేషణముగా ఉన్న మొదటి వాక్యము రెండుగా చీలినది, అందులోని 'ఏకపురుషం' పోయి నది. తక్కిన భాగములో 'అనన్య విషయః శబ్దః— ముముక్షుభిః— భక్తియోగ సులభః— అను ముఖ్య శబ్దములు లోపించినవి. స్థాణువుకు మారు ఆర్యా దయితుండు వచ్చినాడు. అనువాదము సులభ గ్రాహ్య ముగా నుండుటే అనువాదకుల ప్రధాన లక్ష్యమా అనిపించినది.

కాని ఎన్నో వచన భాగములలోగూడ మూల శబ్దములు ఆంధ్రములో సులభగ్రాహ్యములు కాకు న్నను అట్లే ఉంచినారు. పే. 21 'అతిముక్తలతా మండపము' అని ఉంచినకంటె మాధవీలతా మండ పము అంటే ఎక్కువ గ్రాహ్యముగా ఉండేది. అదే పేజీలో 'ఊర్వశీ గతమైన నీ యుత్కంఠను వినో దింప జేసికొనుము' అని ఉన్నది. 'వినోదింప'కు బదులు 'అపనయింప' అంటే ఆంధ్రులకు సులభగ్రాహ్యము. పే. 57 'పరావృత్త భాగధేయులకు' అనుటకంటె 'భాగ్యహీనులకు' అంటే బాగా తెలుస్తుంది. పే. 72 'దశావిపర్యయములు పరిభవాస్పదములు' అని మూల శబ్దములనే వాడుటకంటె 'భాగ్యవిపర్యయములు అవ మాన హేతువులగును' అనుట తేటతెలుగు. కాని ముఖ్యముగా గేయములలో కొన్నియెడల మూల శబ్ద ములను యథాతథముగా గ్రహించుటచే మాధుర్యము చేకూరినది. చూడండి.

ఫలిఅ సిలాఅల ణిమ్మల ణిజ్ఝరు
బహువిఅ కుసుమే విరఇఅ సేఅరు
కిణ్ణర మహురుగ్గీఅ మణోహరు
దేక్ఖావహి మహు పిఅఅమ మహిఅరు

(సం. ఛాయ. స్ఫటిక శిలాతల నిర్మల నిర్ఝర
బహువిధకుసుమై ర్విరచిత శేఖర

కిన్నర మధురోద్గీత మనోహర
దర్శయ మమ ప్రియతమాం మహీధర.)

దీని యాంధ్రీకరణము.

పే. 69.

'స్ఫటిక శిలాతల నిర్మల నిర్ఝర
బహువిధనవసుమవిరచితశేఖర
కిన్నర మధురోద్గీత మనోహర
చూపుము నా ప్రియతమను మహీధర'

ఇట్లనే మరికొన్ని మూలశబ్దముల రుచులతో చవి గొల్పుచున్నవి.

విక్రమోర్వశీయ మంతటిలో చతుర్థాంకము కవిత్వరీత్యా అద్భుతమైనది. కాళిదాసు అందులో సంస్కృత శ్లోకములేకాక అనేక ప్రాకృత గేయములనుగూడ చేర్చినాడు. ఊర్వశితో పురూరవుడు గంధమాదనమున విహరించుచుండగా ఊర్వశికి అసూయకలిగి కోపమువచ్చినది. ఆ కోపములో ఒడలు మరచి స్త్రీలు ప్రవేశింపరాని కుమార వనములో ప్రవేశించి లతగా మారినది. ఆకస్మికముగా మాయమైన ఊర్వశిని గానక పురూరవుడు విరహవిధురుడై ఉన్మత్తవేషముతో తిరుగుచు మృగములను పక్షులను వృక్షములను పర్వతమును నదినిగూడ తన ప్రియురాలి వార్త నడుగుచు పరిభ్రమించును. ఇందులో సంగీతము నృత్యము కవిత్వము త్రివేణిగా పెనగొని అద్భుతమైన ప్రాచీనయక్షగానము వలె సాగినది. కొన్ని పురూరవునివి కొన్ని నేపథ్యములోనివి కలసి, ఎంతో నిశితముగా పఠించిననేగాని సందర్భము బోధపడకుండును. చర్చరి, జంభలిక, ఖండధార, ఖండిక, భిన్నకము, ఖురకము, ద్విపదిక, కుటిలిక, మల్లఘటీ– మొదలైన ప్రాకృతగేయము లెన్నో ఇందున్నవి. వాని స్వరూపస్వభావములు వ్యాఖ్యాతలే స్పష్టపరచలేకపోయిరి. పైగా కొన్ని పాఠభేదములును ఈ చిక్కుకు తోడైనవి. ఈ అంకము అనువాదమును గూర్చి మున్నుడిలో శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారు, 'ప్రత్యేకించి యీ యంకమున శ్రీ రామకృష్ణయ్యగారు ప్రదర్శించిన యాంధ్రీకరణ కౌశలము ప్రశంసార్హముగానున్నదని నేను త్రికరణశుద్ధిగా భావించితిని' అని వ్రాయుటచేత ఆనందముతో పఠింప నారంభించితిమి. ఆశాభంగమైనది.

మూల గేయములలో కొన్నిటిని గేయములుగాను కొన్నిటిని కందగీతాదులుగానేకాక సమవృత్తములుగాగూడ నాంధ్రీకరించుట సరసముగా కనపడలేదు. అంతేగాక మూలభావసందర్భములను పరిశ్రమించి గ్రహించి అందించుటకు అవసరమైన శ్రద్ధయే తీసికొనక అలవోకగా అనువదించి నట్లున్నది. ఒక్క ఉదాహరణ మిత్తము.

'అయే కరిణీ సహాయో నాగరాజో నీపస్కంధ
నిషణ్ణ స్తిష్ఠతి, యావదేనం గచ్ఛామి

కుటిలికా :

కరణీ విరహ సందావి అఓ

మందఘటీ :

కాణణ ఏ
గంధుద్దుఅ మహుఅరవో

సం. ఛాయ—

కరిణీ విరహ సంతాపితకః
కాననే గంధోద్ధతమధు కరకః
(అతోఽంతరే విలోక్య)
అథవా నతావ దయ ముపసర్పణ కాలః
అయ మచిరోద్గత పల్లవ
ముపనీతం ప్రియతమాగ్ర హస్తేన
అభిలషతు తావ దాసవ
సురభి రసం సల్లకీ భంగవ్ః
(స్థానకేనావలోక్య)
అయే, కృతాహారకః
[పాఠాం. కృతాహ్నికః]
సంవృత్తః, భవతు,
సమీప మస్య గత్వా పృచ్ఛామి
అనంతరే చర్చరీ
హఃఅ పఃఅ పుచ్ఛిమి ఆఅక్ఖహి గఅవరు
[ఇత్యాది]

[సం. ఛాయ-అహం త్వాం పృచ్ఛామి ఆచక్ష్వ గజవర...]

పై భాగమును మోచెర్లకవి ఇట్లనువదించినారు :

పే. 67.

'ఈతడు నీపస్కంధనిషణ్ణహస్తుడు—కరిణీ సమేతుడైన కరిరాజు, వీని నడిగెదను నా ప్రియురాలి వృత్తాంతమును (విలోకించి) వేగిరపడరాదు.

కుటిలిక

కరిణి విరహ సంతాపితుడు

మల్లఘటి

కాననమున గంధోద్ధత మధుకరుడు

(క్షణమాత్రము నిలిచి, అవలోకించి) ఇతడు కృతాహ్నికుడైనాడు, కానిమ్ము, అడిగెదను.

'అప్పుడే మొల్చిన చివుళ్ల హరువు మెఱయ
మద్యరసగంధయుక్తమై హృద్యమైన
యుండుగుంగొమ్మను గజేంద్ర మాస్వదించు
గాక తన నోట గరమెత్తి కరిణియిడగ

(అనంతరము చర్చరి)

గేయము

నేనిన్ను బృచ్ఛింతు నెఱిగింపు గజవర...'

మూలములో గజమును పురూరవుడు ఊర్వశీ వృత్తాంత మడుగబోయి కరిణి ఆహార మందింప బోవుట చూచి ఆగి ఆహారము గ్రహించుటను వర్ణించి ఆ పిమ్మట ఇతడు కృతాహ్నికుడు, అనగా కృతాహారుడు ఐనాడుఅని ప్రశ్నించెను. కాని అనువాదములో 'కృతాహ్నికుడైనాడు, కానిమ్ము, అడిగెదను'అని ఆహార మందించుటను వర్ణించు పద్యము 'అప్పుడే మొల్చిన చివుళ్ల—' 'చేర్చుటచే సందర్భక్రమమునకు తీవ్రమైన భంగము వాటిల్లినది. 'అప్పుడే మొల్చిన చివుళ్ల—' పద్యము 'ఇతడు కృతాహ్నికుడైనాడు' అనుదానికి ముందుండవలెను. 'క్షణమాత్రము నిలిచి అవలోకించి' అను ప్రదర్శన సూచన ఆ పద్యమునకుముందు ఉండవలెను. దీనికి కారణము శ్రీ మోచెర్లవారి అవధాన లోపమనక తప్పదు. ఇట్టివి మరికొన్నియు కలవు.

శ్రీ మోచెర్ల రామకృష్ణకవి ఇంతకంటె శ్రద్ధగా మూలము పఠించి, ప్రాకృత గేయముల మాధుర్యమును ఇంతకంటె మధురముగా సందర్భశుద్ధి చెడకుండ స్వరూపావధారణమగునట్లుమార్చి రాబోవు ముద్రణములలో ఆంధ్రుల కందింపగలరని ఆశించుచున్నాము. అనితరసాధ్యమైన కాళిదాసు కవితామాధుర్యమును కొంతవరకైన ప్రదర్శించుట మధురవాక్కుకల శ్రీ రామకృష్ణకవికే సాధ్యపడును. ఇందులో కొన్నిభాగములలో చేసినట్లు చేతనైనంతవరకు మూల గేయ ఛందస్సులలోననే మూలశబ్దబాహుళ్యముతోనే ఆంధ్రీకరించినచో కాళిదాసు కవితామాధుర్యముతో పాటు గీతికామాధుర్యముకూడ మన కందింపగలిగి యుండేవారేమో అనిపించుచున్నది.

# య వ ని క

(శ్రీ శ్రీనివాసచక్రవర్తి. ప్రతులకు: జయంతి పబ్లికేషన్సు, గోపాలరెడ్డిరోడ్డు, విజయవాడ—2, క్రౌను 1/8 పే. 200/—లు. వెల రు. 4/—)

శ్రీ శ్రీనివాస చక్రవర్తికి ఆంధ్రనాటకరంగముతో గాఢపరిచయముండుటేకాక పాశ్చాత్యపద్ధతుల పరిజ్ఞానమును కలదు. స్వయముగా నాట్యకళాచార్యులుగా నాటకకళను బోధించి ఎన్నోగ్రంథాలు రచించినవారు. ప్రస్తుతము ఆం. ప్ర. సం. నాటక అకాడెమీవారి 'నాట్యకళ' మాసపత్రికకు సహాయసంపాదకులుగా పనిచేయుచున్నవారు. వారప్పుడప్పుడు పత్రికలలో ప్రచురించిన 19 వ్యాసాలు సంకలనముచేసి ప్రచురించిన గ్రంథ మిది.

'తెర'అనే మొదటి వ్యాసమే కొంత తాత్త్విక దృష్టితోగూడ వ్రాయబడుటచే గ్రంథపఠనమందు ఆసక్తి కలిగించునదిగానున్నది. దానినిబట్టియే 'యవనిక'అనే గ్రంథనామకరణముకూడ జరిగినట్లున్నది.

చివరి మూడు వ్యాసములూ, 'నటన : స్టానిస్లవస్కీ విధానం', 'ఏకాగ్రత', 'కండరసారళ్యం'–నటులు కాదలచినవారికి మంచిఅభ్యాసములుగా ఉండదగినవై యున్నవి. వానిలో ఏకాగ్రతకు సంబంధించినఅభ్యాసాలు, యోగాభ్యాసము, హిప్నొటిజము, జ్ఞాపకశక్తివృద్ధి బోధించేవారు చెప్పేవే చాలా భాగము. మహాభారతము ఆదిపర్వములో ద్రోణాచార్యులు శిష్యుల యస్త్రవిద్యను పరీక్షించు సందర్భములో కృత్రిమపక్షి శిరస్సును చూడుడని మీకేమి కనబడుచున్నదని ప్రశ్నిం

చిన కథను తలపునకు తెప్పించునవే. ఏకాగ్రత సర్వ విద్యలకు ప్రాణభూతమైనది.

'కాళిదాసుని విదూషకులు' అనే వ్యాసంలో మాలతీ మాధవములోని విదూషకపాత్ర వైశిష్ట్యము నిరూపించినారు. 'ధర్మంవరంవారి నాందీ ప్రస్తావనలు' అనే వ్యాసంలో చిత్రసేనీయ ప్రస్తావన ప్రత్యేకతను చూపినారు. 'అంతర్నాటకం' మంచి వ్యాసము. 'జాతీయోద్యమం—తెలుగు నాటకాలు,' శాంతి ఉద్యమం—తెలుగు నాటకాలు', 'తెలుగు నాటకాలలో ప్రజ', 'భారత సమైక్యభావం—ఆంధ్ర నాటక సాహిత్యం' అనే వ్యాసాలలో ఎన్నో. నాటకాల విషయం ప్రస్తావించారు. అందులో ఒక విశేషము గోచరిస్తుంది. నాటకరంగముమీద తాత్కాలిక పరిస్థితులనుబట్టి ప్రజాదరణ పొందిన నాటకాలను గురించే ఎక్కువ ప్రస్తావించినారుగాని, సాహిత్య ప్రక్రియగా ఆ నాటకాల మంచి చెడ్డలు విచారించలేదు- వారందులో పేర్కొన్న నాటకాలు చాలా భాగం సాహిత్యముగా గణింపదగినవి కాకుండుట గమనార్హము. ఈ గ్రంథము నాట్యరంగము నాటక ప్రదర్శనమునందు ప్రధానముగా దృష్టిపెట్టుకొని వ్రాయబడినది.

అచ్చుతప్పులేకాక భాషలో తప్పులును ఎన్నో దొరలినవి. 'యథార్థము' తరుచుగా యదార్థమైనది. 'హరిశ్చంద్ర—చండకౌశికం' అనే వ్యాసములో హరిశ్చంద్ర కథను ప్రస్తావిస్తూ ఋగ్వేద కథకు పురాణాల కథకూ తేడా ఉన్నదంటూ, 'దేవీ భాగవతంలోని హరిశ్చంద్ర కథలో సత్యసంధతకు ప్రాధాన్యం ఎక్కువ' అని వ్రాసినారు. కాని దేవీభాగవతంలో నేడు ప్రసిద్ధమైన సత్యసంధత కథేగాక, ఋగ్వేద కథ అంతాకూడా వరుణునితో ప్రతిజ్ఞా భంగము చేసి పడ్డపాట్ల కథకూడా అంతా ఉన్నది. స్వయముగా గ్రంథము చూడక ఇతరులెవరో వ్రాసిన దానిని ప్రమాణముగా గ్రహించుటవల్ల ఇటువంటి పొరపాట్లు దొర్లుతవి.

వ్యాసాలన్నిటిలో స్వతంత్రమైన ఆలోచన నాట్యరంగానుభవము వ్యక్తమవుతున్నవి.

నాటకాలు ముందు రంగస్థలంమీద రాణించడము అవసరమే కావచ్చునుగాని అవి నాలుగుకాలాల పాటు జీవించవలెనంటే, వాటికి సాహిత్యంగా విలువ కూడా అవసరము. ఈ విషయముకూడా గుర్తిస్తేకాని ఉభయవిధాల ఉత్తమమైన నాటకాలు వెలువడే అవకాశముండదు. సాహిత్యంగా ఉత్తమశ్రేణి నాటకాలను ప్రదర్శించగల నటులను, అట్టి ప్రదర్శనలను చూచి ఆనందించగల ప్రేక్షకులను కూడా తీర్చిదిద్దుటకు శ్రీ చక్రవర్తివంటివారు కృషిచేస్తే సంపన్నమవుతుంది.

## సుందరపాండ్య విరచితా ఆర్యా

(తెలిగింపు : శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ. ప్రచురణ : శ్రీ రాయల సాహిత్య పరిషత్తు, ప్రొద్దుటూరు (కడపజిల్లా). క్రౌను $\frac{1}{8}$ పేజీలు. వెల రు. 1—0—0)

సుందర పాండ్యుడను దాక్షిణాత్యుడగు బహుప్రాచీనకవి సంస్కృతములో రచించిన ముక్తకరూప నీతికావ్యము మూలముతో సహా శ్రీ శర్మగారి తెలిగింపు ఇందులో ముద్రితమైనది. పూర్వమీ మూల గ్రంథము శ్రీయుతులు వేటూరి ప్రభాకరశాస్త్రి, మానవల్లి రామకృష్ణకవి గారలవంటి సమర్థ పరిశోధకులు పరిష్కరించి ప్రకటించిరి. వారు రెండు వేరు వేరు ప్రతులను గ్రహించి 114 ఆర్యలు మూలముగాను, 33 ఆర్యలు అనుబంధముగాను ప్రచురించిరి. శ్రీ శర్మగారు రెండిటిని ఏకముచేసి తెనిగించి ప్రకటించిరి.

పూర్వ పరిశోధకులు లుప్త పూరణములను ఎంతో సమర్థతతో నిర్వహించి ఆ భాగములు బ్రాకెట్లలో చూపిరి. 67 లోని ద్వితీయార్థ మంతయు వారు పూరించినదే. అది ఒక్కటి చాలును వారి సమర్థతను ఉదాహరించుటకు. ఐనను శ్రీ శర్మగారు అక్కడక్కడ మూలపాఠములో చిన్న చిన్న సవరణలు సూచించి మెప్పింపగలుగుట విశేషము. అట్టి సవరణలు మూలమునను పూర్వపాఠములు అథస్సూచికలందును చూపిరి.

గ్రంథాంతమందు అనుబంధమునందు ఆర్యలయు అనువాదపద్యములయు ఆద్యభాగములు అకారాదిగా ప్రదర్శించుట ఆంధ్ర గ్రంథములలో అరుదైన సదాచారము.

మూలములో సంస్కృతరచన అలతి పదములకూర్పు బిగువుతోనుండి, విమర్శకు లభిప్రాయ పడినట్లు అతిప్రాచీనరచన యనిపించుచున్నది. 'ఇమాం కాంచన పీఠస్థాం ... స్నాపయంతి వధూమివ' అని యున్న చివరి యార్యాశ్లోకమునుబట్టి, ఈగ్రంథము 'తమిళసంగము' చేత బంగారుపీటమీద కనకాభిషేకము పొందినదని పూర్వ పీఠికాకారులు చేసిన యూహకు యోగ్యముగా నున్నది గ్రంథరచన.

ఆర్యా భేదములలో వరుసగా పాదములకు 12, 18, 12, 15 మాత్రలుండు జాతిలోనివి ఇందలి ఆర్యలు. శ్రీ శర్మగారు అనువాదములో కందము, తేటగీతి, ఆటవెలది కొంత ఛందోభేదము పాటించినను యుక్తి యుక్తముగానే యున్నది.

గాధాసప్తశతివంటి ముక్తక గ్రంథమునకు ఆంధ్రీకరణము సమర్థతతో నిర్వహించిన శ్రీ శర్మగారు దీనినికూడ మెలకువ చూపుచు ఎంతో చక్కగా తెలిగించినారు. చేతనైనంతవరకు ఆంధ్రములో కలసిపోయిన తత్సమపదములగూడ గ్రహింపక అచ్చ తెనుగు పదములనే విశేషముగా గ్రహించి రచించి మెప్పింపజాలుట శ్రీ శర్మగారికే చెల్లుబాటగును. అందుకు అనువాద గ్రంథమంతయు ఉదాహరణ ప్రాయమే యైనను మచ్చుకు ఒక్కటి మాత్ర ముదాహరించుచున్నాము.

మూలము: మూర్ఖాః న ద్రష్టవ్యాః
ద్రష్టవ్యాశ్చే న్నతైస్తు సహతిష్ఠేత్
యది తిష్ఠే న్నతు కథయేత్
యది కథయే న్మూర్ఖవత్ కథయేత్'

అను: మూర్ఖులను జూడ బోరాదు మొదలు;చూడ
వలసెనా కూడి వారితో నిలువఁదగదు,
నిలువవలె నేనియును బల్కవలదు; పల్క
వలసెఁబో మూర్ఖునట్లె తాఁ బలుకవలయు.

ఇంత చక్కగాసాగిన తెనిగింపులో శ్రీ శర్మగారికి తెనుగుదనముపై గల విపరీతాభిమానమువల్ల మూలములోని సొగసు ఇంచుక లోపించిన తావులును సకృత్తుగా లేకపోలేదు.

మూ : శబ్దార్థసూక్ష్మవసనా
సత్యాభరణా విచిత్రహేత్వంగీ
విద్వన్ముఖ నిష్క్రాంతా
సుస్త్రీవ విరాజతే వాణీ'

అను : చిత్రహేతుఘటన చెలువంపుమేను, స
త్యంబుతొడవు, పదపదార్థరచన
సన్నవలువగాఁగ సత్కాంతపోలిక
వెలయు బుధులనోట వెడలుమాట'

ఇందులో మూలములోని సూక్ష్మశబ్దము వసనమునకేకాక శబ్దార్థమునకుకూడ నన్వయింపదగిన సూక్ష్మమైన అందముతో నున్నది. సూక్ష్మవసనను సన్నవలువగా తెలిగించుటలో సూక్ష్మశబ్దము శక్తి తరిగినది-'పదపదార్థ సూక్ష్మవసన' ఇత్యాదిగాచేసినచో మూలార్థము పూర్తిగా వచ్చెడిదేమో!

ఇట్లే అనువాదములో మూలములోలేనిది ఒత్తి పల్కుట, ఒత్తి పలికినది తేలికగా పలుకుటలు కూడా సకృత్తుగా లేకపోలేదు. అట్టివి ఎంత మంచి యనువాద మందైనను తప్పవు.

అన్ని సద్గుణములతోపాటు ఆంధ్ర గ్రంథములతో అరుదైన విశిష్టలక్షణమొకటి యిందులో నుండుట ప్రశంసార్హము. గ్రంథమెంతో చక్కగా ముద్రితమగుటేకాక గ్రంథ మంతటిలో రెండుకంటె అచ్చుతప్పులు మాకళ్ల బడకుండుట—అది! 50 వ పద్యములో 'గమ్మకున్న' మ వత్తు లోపించినది. 148 వ శ్లోకములో మొదటిపాదములో చివరి బ్రాకెటు గుర్తు లోపించినది. ఇందుకు ప్రీడము ప్రెస్సు వారిని ప్రత్యేకముగా అభినందించు చున్నాము.

ఇట్టి మంచిగ్రంథమును వెలుగులోనికి తెచ్చిన శ్రీ శర్మగారు సాహిత్యాభిమానులకు వందనీయులు.

## 1. ప్రేమ చిహ్నము

(గేయనాటిక)

క్రౌను 1/8 పే. 24 లు. వెలలేదు.

## 2. కల్యాణవాణి

(ఖండకావ్య కదంబము)

క్రౌను 1/8 పే. 32. వెల రు. 1/-

## 3. అమృత కలశము

క్రౌను 1/8 పే. 28 లు. వెల రు. 2/—లు

(కవి. ప్రకాశకులు: శ్రీ మోచెర్ల రామ కృష్ణకవి, అత్తితోట అగ్రహారము, నెల్లూరు.)

ఆధునిక కవులలో నవ్యతకు స్వాగతమిచ్చుచు సంప్రదాయమును విడనాడని వారిలో శ్రీ మోచెర్ల రామకృష్ణకవి ఎన్నదగినవారు. వారి కవితావాణి నిర్దుష్టమై మధురముగా నుండును.

ఈకావ్యములు మూడింటిలో 'ప్రేమచిహ్నము' సీతారాములు అత్రిమహాముని సందర్శించుట, ఆ సందర్భములో సీతకు అనసూయ ప్రేమచిహ్నముగా దివ్యాంబరాభరణపుష్పములు బహూకరించుట ఇతి వృత్తముగా గల 12 పేజీల నాటిక. ఇందులో గేయములేకాక కందము చంపకమాల మత్తేభమువంటి ఛందస్సులును వచనములును కలవు. ఐనను గేయ భాగములు ప్రాధాన్యము వహించుటచే కాబోలు దానిని గేయనాటికయని నిర్దేశించిరి. మిత్రపుత్రిక వివాహ సందర్భమున మంగళాక్షత పూర్వకముగా ఈ నాటిక ప్రవచింపబడినది. ఇందులో కవికిగల సౌహార్దము ప్రకటితమైనది.

'కల్యాణవాణి' ఆయాసందర్భములలో కవిచెప్పిన 16 ఖండ కావ్యముల సంపుటి. అన్నీ పత్రికలలో ప్రకటింపబడినవే. కాని ఎందును విశిష్టత గోచరింపదు. బాగున్నవనిపించునుగాని తల యూపింపవు.

'అమృతకలశము' అట్లుకాక మొదటినుండి తుదివరకు తల యూపించును. ప్రస్తావనతో కలసి 5 భాగములుగా రచింపబడిన కృష్ణపరమైన 93 పద్యముల కావ్యము. శ్రీ కృష్ణభక్తిని కవిత్రయము, పోతన మొదలగు పూర్వమహాకవులెందరో కావ్యస్థము చేసినారు. ఆధునికులలో చామర్తి రాజశేఖరరావు వంటి వారును మంచికావ్యములు చెప్పినారు. ఐనను నిత్యనూతనమైన శ్రీ కృష్ణభక్తి శ్రీ మోచెర్లకవిచే మరియొక మధురమంజుల కావ్యమును చెప్పించినది. ఇది రసవంతమై ఉత్తమస్థాయి నందుకున్నది.

ప్రస్తావన శ్రీ కృష్ణస్మరణము. మొదటి భాగము శ్రీకృష్ణుని బాల్యక్రీడలను, రెండవది ప్రౌఢుడైన పిమ్మట కావించిన కార్యములను, మూడవది నాల్గవది భారత రణరంగములో అతడు నిర్వహించిన పాత్రను భావించుచు, కొంత శ్రీకృష్ణ భావనగా కొంత నివేదనగా మరికొంత సమర్పణముగా బహువిధములుగా సాగినది. అది సాగినతీరు చూపుటకు రెండే పద్యము లుదాహరింతుము.

పే. 8. బృందన్ శారద సాంద్ర చంద్రికలు
పేర్మిన్ లాస్యముల్ సల్ప, గా
ళిందీ సుందరి మేన వీచి పులకల్
రేకెత్తగా, గోపికా
సందోహంపుటెడందలన్ వలపు
మూర్ఛన్ ముంచె నే యవ్యయా
నందాపాదక వేణుగాన మది కృష్ణా,
నాకు విన్పింపుమా'

పే. 12 'ఎంత చెలువున్న నైశ్వర్య మెంతయున్న
నంతయును నీదుభక్తుల యాస్తిసుమ్ము
కృష్ణ, నీపాదధూళి సోకిన తలమ్మ
విష్ణులోకమ్ము, నీవాక్కు వేదబుక్కు'

మొదటిభాగము చివర

పే. 11 'కంసు మఱుగుజ్జుదాసి చక్కందనాల
రాశియయ్యెను నీ యనుగ్రహము కలిమి;
దేవ, వక్రోక్తిమయ మస్మదీయ కావ్య
మమృతకలశమ్ముకాదె నీ యాదరమున'.

అని కవి చమత్కరించినారు. కావ్యము 'అమృత

కలశ'మ్మైంది. కాని కుంతకుడు కావ్యజీవముగా భావించిన వక్రోక్తిగాని పేలవమ్మైన కేవల వక్రోక్తిగాని ఇందులో కనబడవు.

మూడు తావులలో మాత్రము ఆధునిక శబ్దముల కూర్పు చెవికి విరసముగా తాకినది.

పే. 9 'విచిత్రపు 'సినీమా' చిత్రముల్
మాధవా'!

పే. 13 'సంగ్రామ నౌకా వినాశక
టార్పెడో నావికుడవు'

పే. 14 'రేడియో' వార్తల నాలకింపగల
వారికి మాకిది వింతయే ?'

పైని సినిమా, టార్పెడో, రేడియో శబ్దములు తక్కిన రచనలో పొసగక వికటించుచున్నవి. నవ్యతకొరకు నేటికాలపు కవులు ఇట్టి ప్రయోగములుచేసి జనాదరణముపొంద నుబలాటపడుట సర్వసాధారణ మవుచున్నందున ప్రత్యేకముగా ప్రస్తావింప వలసి వచ్చినది.

అమృతకలశమువలెనే మధురపవిత్రమ్మైన 'అమృతకలశము'ను పాఠకులకు అందించిన శ్రీ రామకృష్ణకవిని హృదయపూర్వకముగా అగ్గించుచున్నాము.

## శ్రీ గీతాకోశము

(కర్త: ప్రకాశకులు: శ్రీ అ. నరసింహశర్మ, కృష్ణగీతాశ్రమము, ప్రొద్దుటూరు (కడపజిల్లా). డెమీ 1/8 పే. 148 లు. వెల రు. 5—50.)

భగవద్గీతవంటి విశ్వవ్యాప్తిగల ఉద్గ్రంథానికి ఆంధ్రములో పదకోశములేని లోపము ఈ గ్రంథము తీర్చినది. ఏ పదము ఎక్కడెక్కడ ప్రయోగింపబడినది అధ్యాయశ్లోకముల సంఖ్య లిచ్చుటయేగాక శబ్దార్థముకూడ ఇచ్చియుండుట ఈ గ్రంథవిశిష్టత. ఇట్టి గ్రంథప్రకటనకు పూనుకొనినందులకు కర్త ప్రశంసార్హులే.

ఇట్టి గ్రంథములు ప్రచురించునపుడు పదసంగ్రహములోనేకాక అచ్చు సరిచూచుటలోకూడ ఎక్కువ శ్రద్ధ చూపవలెను. యాదృచ్ఛికముగా గ్రంథము తెరచిచూచిన మొదటి శబ్దము సూచికలోనే పొరపాట్లు కనబడినది.

'పే. 127 సమం: 5-10, 6-13,32, 13—27,28 సమముగ'. వీనిలో 5 అ. 10 శ్లో. ములో సమశబ్దములేదు. ఆ అధ్యాయమంతా వెదుకగా 19 వ శ్లోకములో నున్నది.

సూచిక అచ్చులోనేగాక శబ్దములకు అర్థము లిచ్చుటలోగూడ అవసరమ్మైన శ్రద్ధ తీసికొన్నట్లు లేదు. ప్రవేశికలో 'విత్యము నెరిగి వివరణము వ్రాసెను. శ్రీ శంకరుల భాష్యము, ఉపనిషత్తులు, సూత్రములు ఇందులకు సహకరించేయి., అని ప్రతిజ్ఞా పూర్వకముగా తెలిపినారు. కాని ఆ ఒక్క 127 వపేజీలో కొన్నిపదములు పరీక్షచేయగా—

గీతలో సమశబ్దము 5 శ్లోకములో వాడబడినది. కర్త అన్నిటికి 'సమముగ' అనునర్థ మిచ్చినారు.

'కాని శాంకరభాష్యములో 5—19 క్రింద 'అతఃసమం ప్రబ్రహ్మైకం చ తస్మా ద్బ్రహ్మణి తే స్థితాః' ఇత్యాదిగా నున్నందున ఆ ప్రకరణములో సమం అనగా బ్రహ్మ అని శంకరుల భావమని తేలును.

6—13 లో కర్త ఇచ్చిన యరము సరిపోవును. కాని 6—32 లో 'సమం తుల్యం' అని శంకరులెంతో వివరించినందున ఆ యర్థము సరిపోదు. 13—27 క్రింద 'సమం నిర్విశేషం తిష్ఠన్తమ్ స్థితిం కుర్వన్తమ్,' ఇత్యాదిగా భాష్యమున్నందున, కర్తయిచ్చిన యర్థము సరిపోదు. 13—28లో వే రర్థమీయనందున పైశ్లోకములోని యర్థమే శాంకర భావముగా గ్రహింపవలెను.

'సమదర్శినః 5—18 సమదృష్టి కలవారు' అని ఉన్నది. ఆ శ్లోకమునకు శాంకరభాష్యములో నిట్లున్నది;

'సమ మేక మవిక్రియం బ్రహ్మద్రష్టుంశీలం యేషాం తే పండితాః సమదర్శినః' మరికొంత దూరము పోయిన తర్వాత 20వ శ్లోకము క్రింద 'యస్మా న్నిర్దోషం సమం బ్రహ్మ ఆత్మా తస్మాత్' అని ప్రారంభించినారు. కావున 'సమదర్శినః' అనగా 'బ్రహ్మదర్శినః' బ్రహ్మను దర్శించువారు, అని శంకరులభావమని స్పష్టపడుచున్నది. ఆ సూక్ష్మార్థము 'సమదృష్టి కలవారు' అనుమాటలో స్ఫురింపదు కదా!

మరియొక పేజీలో 'బ్రహ్మణి' అను శబ్దము పరీక్షించితిమి.

పే. 89 : 'బ్రహ్మణి; 5—10, 19,20 బ్రహ్మయందు అని గ్రంథములో నున్నది.

5—10 క్రింద శంకరభాష్యములో 'బ్రహ్మ ణీశ్వరే' అనియు, 5—19 క్రింద 'బ్రహ్మతు సర్వ గుణదోష సంబంధవర్జిత మిత్యతో బ్రహ్మణి' అనియు, 20 క్రిందగూడ 'యథోక్త బ్రహ్మవిత్ బ్రహ్మణి స్థితో ఽకర్మకృత్ సర్వకర్మసన్న్యాసీ ఇత్యర్థః' అని ఉండుటచే 'సర్వగుణదోష సంబంధవర్జిత బ్రహ్మ యందు' అనియే యర్థము సూచించిరి.

పై యుదాహరణములే గ్రంథకర్త శబ్దము లకు కేవల సాహిత్యపరులిచ్చు నర్థములిచ్చిరే కాని ప్రవేశికలో ప్రతిజ్ఞ చేసినట్లు పారిభాషికపదములున్న గీతాశబ్దములకు విశ్వము నెరిగి శాంకరభాష్యాదు లుప యోగించి వివరణములు వ్రాయలేదని స్పష్టపరచు చున్నవి.

గీత ఎంత సులభముగా కనబడునో ఏకవాక్యత కుదుర్చుట యంతకష్టము. పూర్వాచార్యు లెంతయో శ్రమచేసి ప్రకరణాదులనుబట్టి శబ్దములకు అర్థ ములు నిర్ధారించి ఏకవాక్యత కూర్చిరి. భాష్యాదులు చూడలేని పాఠకులు ఈ గీతాకోశములో నిచ్చిన యర్థ ములే, భాష్యసమ్మతములని భ్రాంతి పడుటకు కారణభూతములు కాగలవు. ఇట్టి విశేషార్థములులేని పట్టులలో పద వివరణములలో దోషములు కనిపించ లేదు.

జగత్పూజ్యములైన భగవద్గీతవంటి ఉద్గ్రంథ ములతో వ్యవహరించునపుడు ఇంతకంటె ఎక్కువ శ్రద్ధాభక్తులతో ప్రవర్తింపవలెనని సూచన చేయుచు సూచిక సిద్ధముచేయుటలో కర్తచేసిన శ్రమను అగ్గించుచున్నాము.

**నోరి నరసింహశాస్త్రి.**

# వీర భారతము

(రచన : శ్రీ వక్కలంక లక్ష్మీపతిరావు, ఎం. ఏ., ప్రతులకు : శ్రీమతి వి. సీతాదేవి. కూచి మంచివారి అగ్రహారం, అమలాపురం. తూ. గో. జిల్లా మూల్యము : ఆరు రూపాయలు.)

భారత దేశచరిత్రలో సంయుక్త పృథ్వీరాజుల పరిణయమైన సందర్భము పరమ విలక్షణ మైనది. ఏతత్ వైలక్షణ్యమును సూక్ష్మసుకుమారముగా భావించి భావించి శ్రీ లక్ష్మీపతిరావుగారీ కావ్యమును పద్య గద్య గేయాత్మకముగా పది యాశ్వాసములకు పరిమితముచేసి వ్రాసిరి. ఈ కథ మిక్కిలి ప్రసిద్ధ మైనది. ప్రాగ్విపశ్చిన్మతమున రసము నవకథా నిర్మాణమును మించి వేయిరెట్లు గొప్పది. ఈ కవి ఈ మతమువాడు. ఈ కావ్యము రసాత్మకముగా నిర్మింప బడినది.

(1) కనోజీ పురవరాధీశ్వరుడు జయచం ద్రుడు. ఆయన కూతురుపేరు, సంయుక్త. ఆమె చాల చక్కనిది. ఆమెకు పెండ్లియీడు వచ్చినది. (2) అజ్మీరుపృథ్వీరాజు పృథ్వీరాజు కలడు. ఆయ నకు సంయుక్తయందు మనసు నిలచినది. (3) పృథ్వీరాజు కీర్తివిని సంయుక్తయు ఆయన యనిన మనసు పడ్డది. (4) చాంద్ కవి భూపతికి సంగడి కాడు. పృథ్వీరాజు విజయముల నాతడు కీర్తించును. ఘోరి భారతదేశము మీది కెత్తివచ్చి పృథ్వీరాజు చేతిలో వోడిపోయినాడు. (5) సంయుక్త స్వయం వరము చాటబడినది. జయచంద్రునకు పృథ్వీరాజన్న పడదు. అందుకని ఆయన నాహ్వానింపలేదు. అయి

నను పృథ్విరాజు స్వయంవరమునకు కనోజికి బయలుదేరెను. ఆయన వచ్చునో రాడో అని సంయుక్త ఆదుర్దా పడినది. సంయుక్త పృథ్విరాజును వరించి ఆయనతో గుఱ్ఱమెక్కి పోయినది. జయచంద్రుడు వారిమీద యుద్ధము ప్రకటించెను. తనకు సహాయముగా రమ్మని మహమ్మదు ఘోరీని ఆహ్వానించెను. (6) అజ్మీరులో వారి వివాహము వైభవముగా జరిగినది. (7) వారిచేత ప్రణయ సుఖము లనుభవింపబడెను. (8) జయచంద్రునకు తోడుగ మహమ్మదు ఘోరీ వచ్చెను. ఇరుపక్షములును యుద్ధమునకు సన్నద్ధము లయ్యెను. రణప్రళయమాపుచేయ సంకల్పించి సంయుక్త జనకునివద్దకు పోయెను యుద్ధము వలదని ఎన్నో చెప్పినది. ఘోరీ సహాయముతో యుద్ధము చేయుట అసలే మంచిదికాదని చెప్పినది. జయచంద్రుడు వినలేదు. పృథ్విరాజుమీది శతృత్వమునే బలముచేసి సంయుక్తను తిరస్కరించి తూలనాడినాడు. ఆమె ప్రయత్నము వృథాయైనది. (9) యుద్ధము మొదలైనది. పృథ్విరాజుతో కలసి సంయుక్తయు యుద్ధమునకు వచ్చినది. జయచంద్రుని చేతిలో సంయుక్త మరణించినది. పృథ్విరాజును జయచంద్రునితో పోరుచున్న వానిని వెనుకనుండి ఒకడు బాణముతోకొట్టి పడవేసెను. జయచంద్రునకప్పుడు పశ్చాత్తాపము కలిగి ఆ రాత్రి యమునలో దూకి తానుగూడ చనిపోయెను. ఘోరీకి విజయము చేకూరినట్లయ్యెను. (10) ఈ ఘోరమునకు చాందుకవి తల్లడిల్లిపోయెను. జ్యోతిష్కునివేషముగట్టి ఘోరీ మహమ్మదు పురమున తిరిగి తాను మహమ్మదీయుడట్లు నటించెను. ఘోరీ ఆతనిని పిలిపించుకొని చేయి చూపించుకొనెను. శబ్దవేధి విద్య నేర్చినచో భారతదేశమును జయించుట సుసాధ్యమని చెప్పెను. ఘోరీ ఆ విద్యను కోరెను. అది పృథ్విరాజువద్ద కలదనగా అతడు మనఖైది వానినిప్పుడే తెప్పించెదనని ఘోరి ముందుకు దూకెను. ఆ విధముగా చాందుకవి పృథ్విరాజును కలసికొనెను. ఇరువురు శత్రువుచేతిలో చచ్చుట కిష్టములేక తమ్ము తామే పొడుచుకొని వీరస్వర్గము నలంకరించిరి. పృథ్విరాజు ఘోరినిచంపియే చచ్చెను. ఇది ఇందలి ఇతివృత్తము. ఇది చిత్రముగా రచింపబడినది. ఇందు అక్షరగణ బద్ధములైన పద్యము లున్నవి. మాత్రాగణబద్ధములైన గేయములున్నవి. ఇంతవరకును ఈ రెండింటిని వేరువేరుగా ఉంచి కావ్యములు రచించినవారే కలరు. శ్రీ లక్ష్మీపతిరావుగారిట్లు ఛందస్సువిషయమున సమైక్యమును సాధించి ఈ కావ్యమును రచించినారు. ఒక్క ఛందస్సు విషయముననేకాదు. మిగిలిన వర్ణనాదులయందును ఈ కవి ప్రాచీనమునకు ఆధునికమునకు చక్కని సమన్వయమును సాధించినాడు. ప్రబంధములయందు ప్రధానముగా కనిపించు పురవర్ణనము, నాయకవర్ణనము, నాయికావర్ణనము, నాయికా నాయకుల పరస్పర ప్రేమాభిరామ చిత్తవృత్తి విశేష వర్ణనము మొదలైనవి ఇందు శ్రీ లక్ష్మీపతిరావుగారు అద్వితీయమైన ప్రతిభా సంపన్నతతో రచించినారు.

ఈ కవి మంచి భావనాబలము కలవాడు. దేశాభిమానము, వర్తమాన సమాజము పోకడ చక్కగా అవగాహన చేసికొన్నవాడు. ఈ కావ్యము నిండ కావ్యార్థసూచనలు గలవు. కావ్యముయొక్క సంపూర్ణ స్వరూపము ముందుగా కవి మనస్సులో రూపుగట్టుకొని యున్న, తెలిసితెలిసి శిల్పాభిరామముగా రచన చేయవలయునన్న అభినివేశమున్న కవికిగాని కావ్యార్థసూచన విషయమున వెసులుబాటు చిక్కదు. ఆ విషయమున శ్రీ లక్ష్మీపతిరావుగా రందెవేసిన చెయ్యి. పద్యరచనయందు పరిణతివచ్చిన రచన యిది. శివభారతము, రాణాప్రతాపసింహచరిత్ర, ఆంధ్ర పురాణము, అశోకచరిత్ర ఈ మొదలైన ఆధునిక చారిత్రక కావ్యములప్రక్క తలయెత్తుకొని తన మర్యాద తనకున్నట్లు ధీమాగా నిలువగల చక్కని ప్రౌఢకావ్య మీ వీరభారతము. శ్రీ విశ్వనాథవారన్నట్లు 'ముఖేముఖే సరస్వతి. ఎవరిరచన వారిది. ఒక కవి చేయగల సొగసులు మరియొకకవి చేయలేడు. ఈయనగారి కావ్యమునందు చాల సొగసులు కలవు.'

## పారిజాత సౌరభము

(రచన : శ్రీ వక్కలంక లక్ష్మీపతిరావు. ప్రతులకు : తెలిదేవర సుబ్బారావుగారు, మాచవరం, రామచంద్రపురం తాలూకా, తూర్పుగోదావరి జిల్లా. మూల్యము : మూడు రూపాయలు.)

శ్రీకృష్ణదేవరాయలకు గజపతిరాజుకు పడదు. గజపతికొక కూతురు కలదు. ఆమెపేరు తిరుమలాంబ. ఆయన ఆస్థానమున నొక తెనుగుకవి కలడు. ఆయనను ముక్కుతిమ్మన్న యందురు. తిమ్మన్నకు రాయలయందు ప్రీతి. గజపతి రాయలవారి బొమ్మను చెక్కించి ద్వారపాలకస్థానమున ఉద్యానవాటియందుంచెను. ఆ శిల్పమునుచూచి తిరుమల మరులుగొన్నది. తిమ్మన్నకవి రాయలను వర్ణించి తిరుమలాంబ మనోరథమునకు దోహదము చేసినాడు. (2) తిరుమలాంబనుగూర్చి విన్న రాయలు గజపతితో కయ్యము చేయవలయునా వియ్యము చేయవలయునా అని గజిబిజి పడెను. కాని అప్పాజికి చెప్పలేదు. కళింగభూపతి గజపతిని జయించి తురకల బారినుండి హైందవ సంస్కృతిని రక్షించుట నెపముగాచేసి తానచ్చటకు పోగోరుటను రాయలు అప్పాజికి సూచించెను. అసలు విషయము తనకు రాయలు చెప్పలేదని అప్పాజికి తెలియును. తిరుమలాంబను రాయలు పాణిగ్రహణము చేయుటయే లెస్సయని మంత్రి భావించెను. (3) రాయల సైన్యములు గజపతి రాజధానిని చొచ్చుకొని వచ్చెను. (4) గజపతిని రాయలసైన్యములు బంధించెను. సంధి సంభాషణములు సాగినవి. గజపతి తమ్మ అమ్మాయిపై కృష్ణరాయని కన్నున్నట్లు తిమ్మరసు మాటల ధోరణిలోని ధ్వనిని వినగలిగినాడు. అట్టి వియ్యమున కాయన మనస్సంగీకరించలేదు. కాని తప్పని సరియై అంగీకరించెను. తిరుమలాంబా కృష్ణరాయలకు పరిణయ మైనది. (5) కళింగుడు తాను చెప్పినట్లు కృష్ణరాయలను పడకటింట హతమార్పవలసినదిగా కూతురు తిరుమలాంబకు నయభయముల చెప్పి చూచెను. ఆమె అంగీకరింపలేదు. విధిలేక ఒకందు కొప్పుకొన్నది. (6) పడకటింట తిరుమల రాయలనుచంపలేక తల్లడిల్లినది. రాయలామె ననునయించినాడు (7) రాయలు తిరుమాలంబతో, ముక్కుతిమ్మన్నకవితో తిరిగి విజయనగరము చేరుకొనెను. (8) ఒకనాడు మహిత రాజ్యాంగవిషయ చింతా వివశుడు రాయలు తిరుమలాంబ కడకుపోయి ఆమె నిదురపోవుచున్న శయ్యను ఆమె పాదములచెంత పరుండినాడు. ఆమె అది గమనింప లేదు. ఆమెకాలు రాజు శిరస్సునకు తగిలినది. రాయలు లేచి చిఱ్ఱుబుఱ్ఱు లాడుచు వెళ్లిపోయినాడు. మరి ఆమె మందిరమునకు పోలేదు. ఆమె తద్విరహము దుస్సహముకాగా—(9) తిమ్మన్నగారితో అసలువిషయము చెప్పినది. వారి సంసారమును కుదుటబెట్టుటకు తిమ్మన్న పారిజాతాపహరణ కావ్యమును రచించెను. (10) పారిజాతాపహరణ కావ్య ప్రకటనముతో, పెద్దనగారి వ్యాఖ్యానముతో రాయల మనస్సు మారి తిరుమలాంబను యథాపూర్వముగా సమాదరించెను.—ఇది పది యాశ్వాసముల కథ.

శ్రీ లక్ష్మీపతిరావుగారీ కథను శిల్పసుందరమైన తమ మహాకవి చాతుర్యమువెలయ కావ్యముగా రచించినారు. కవియొక్క ఉపజ్ఞ ప్రతిపుటలోను కాననగును. తిరుమల తన తండ్రిచేత రాయలను సంహరించుటకు ప్రబోధింపబడి తిరుగబడినప్పుడు, చివరకొక నిశ్చయమునకువచ్చి గదిలో ప్రవేశించిన మీదట—తిరుమల హృదయ సంవేదనమును సంక్షోభమును శ్రీ లక్ష్మీపతిరావుగారు పాలాకుడువలె రచించినారు. ఏ సన్నివేశమున కాసన్నివేశ మది ఇట్లే ఉన్నదని చెప్పవలయునట్లుగా కావ్య మామూలచూడను పరమరమణీయముగా నున్నది.

## విప్రలబ్ధ

(రచన : శ్రీ వానమామలై వరదాచార్యులు. ప్రతులకు : రచయిత, చెన్నూరు : (వయా) మంచిర్యాల, ఆదిలాబాదు జిల్లా. మూల్యము : మూడు రూపాయలు.)

మంచి చమత్కారకారియైన గేయకావ్యమిది. అభినవపోతన బిరుదాంచితులైన శ్రీమాన్ వరదాచార్యులుగారు పద్యగేయ కవిత్వముల రచనా విధానము పట్ల సవ్యసాచులు. ఇప్పటి తెలుగుకవులలో ఈయన గొప్ప ప్రతిభాశాలి. అనన్య సామాన్యమైన ఊహాపోహలు కలవాడు.

ఇది ఒక వ్యవసాయిక కార్మికుని కుటుంబ విషయము. రాజకార్ల దుర్నయములు సాగిన రోజలలో తెలంగాణమునుండి ఆంధ్రదేశమునకు వలసబోయిన కాపు కుటుంబములోనిది లక్ష్మి. ఆమెనక్కడ ఒకడు రాముడు తన తల్లిదండ్రుల యిష్టమునకు వ్యతిరేకముగా లక్ష్మిని వివాహము చేసికొన్నాడు. ఆమె గర్భవతియైనది. ఆమె హిందూ స్త్రీ కాదనియు, మహమ్మదీయ స్త్రీ యనియు ఒకవార్త రేగినది. దానికి భయపడి రాముడు తాను వేరేఇల్లు ఏర్పాటు చేసుకొనేవరకు పుట్టింట నుండవలసినదిగా పంపినాడు. ఎన్నాళ్లకు రామునిఇల్లు పూర్తికాదు. లక్ష్మిని లోకులు కాకులుగా నిందించి పలుకుచున్నారు. ఆమె అది సహించలేక భర్తవద్దకు బయలుదేరి గోదావరి వరదలో పడవమునిగి కొట్టుకొనిపోయి ఒక బ్రాహ్మణునకు చిక్కి బ్రతికి తిరిగి రామునివద్దకు వచ్చినది. ఈ మాత్రపు ఇతివృత్తమును సూత్రాత్మగా గ్రహించి శ్రీమాన్ వరదాచార్యులుగారు ఇంత చక్కని గేయ కావ్యమును సంతరించినారు. శ్రీనారాయణరెడ్డిగారన్నట్లు 'ఈ సంపుటిని కథా సమన్వయ దృష్టితో కాకుండా కవితాస్వాదనదృష్టితో చూడగలిగితే రసానంద బంధువులను పుడిసిలించుకోవచ్చు'. లక్ష్మి భర్తృవియోగముచేత విప్రలబ్ధ. గోదావరిలోపడి కొట్టుకొనిపోయి ఒక విప్రునకు చిక్కి బ్రతికి బయటపడుటచేతను విప్రలబ్ధ.

'ఈ కావ్యనిర్మాణమునకు ప్రస్తుతం దేశంలో అచ్చటచ్చట జరుగుతూఉన్న మతకల్లోలాదికములే కారణాలు. అవే నా హృదయాన్ని కలతపెట్టినవి. కాలోనున్న అంతర్వాణి ప్రేరేపించినదీ కావ్యనిర్మాణమునకు.'అని కవిగారు చేసిన విజ్ఞప్తి గమనింపదగినది. శ్రీ దాశరథి మాటలలో చెప్పవలయునన్న 'కులాలకు మతాలకు అతీతమైన మానవతా ప్రబోధమే ఈ కావ్యధ్యేయం.' కులమతాల ప్రసక్తి ఎంతగా పనికిమాలినదిగా మనము చెప్పుచున్నామో వాస్తవజీవితములో అప్పుడప్పుడు ఆ కులమతములే పనిచేసి సమాజ భవితవ్యమును నిర్ణయించుచున్నవి. ఈ అంతర్బహిః స్వభావప్రవృత్తుల నడుమ ఘర్షణపడి శ్రీమాన్ వరదాచార్యులుగారీ కృతిని రచించిరి. ఇప్పటి సమాజ జీవనము సలక్షణముగా సాగుట కవసరమైన ప్రబోధము లక్ష్యముగాచేసి రచింపబడిన ఈ కావ్యము మంచి పాకమున బడియున్నది. కావ్యప్రయోజన మింత దేశ శ్రేయస్సును మనస్సున పెట్టుకొన్నదగుట ఒక్కటే చాలును దీని గొప్పతనమునకు. స్వస్థానవేషభాషాభిమానముగల శ్రీమాన్ వరదాచార్యులవారు పోతన చరిత్ర తరువాత మరియొక మంచికావ్యమును రచించి విప్రలబ్ధయని పేరుపెట్టినారు.

## ము త్తి ప దా లు

(రచన : శ్రీ యెల్దండ రఘుమారెడ్డి. ప్రతులకు : చైతన్య కళాపరిషత్తు జడ్చర్ల, మహబూబునగర్‌జిల్లా. మూల్యము : రు. 2. 50.)

జానపదగేయము లన్నింటిని జానపదులే చెప్పినారన్నది తిరుగులేని సిద్ధాంతము కాదు. అసంస్కృతమైన తత్కాలపు నాగరకతకు దూరమై బ్రతుకుచున్న పల్లెటూళ్లలోని వెనుకబడిన దళిత వర్గముల వారి నిత్య వ్యవహారములోని పదములను వారి వారి పలుకుబడియాసలతో యథాతథముగా గ్రహించి పాడుట కనువైన కొద్దిపాటి లయ నిమిడించి శృంగార, వేదాంత భావములను పైపైన పట్టుకొని రచించినచో జానపద గేయముల నెవరైనను వ్రాయవచ్చును. వ్రాయవచ్చు ననుటయే కాని చాల మంది వ్రాయలేరు. ఆయా జానపదులయొక్క నిత్య జీవితమును దూరమునుండిచూచి గ్రహింపగలుగుట అంత సులభముకాదు. శ్రీనండూరి

సుబ్బారావుగారు ఒక్క యెంకిపాటలతో అంత ప్రసిద్ధుడైనాడు కదా! ఆ పిమ్మట కొనకళ్ల వెంకటరత్నం, మొదలైన ఇద్దరు ముగ్గురు ఆ మార్గమున గట్టిప్రయత్నమే చేసిరి. ఈ ప్రయత్నము లొకటి రెండు పుస్తకాలు అచ్చుపడుటతో ఆగిపోవు ప్రమాదమున్నది. ఇవి మిగిలిన గ్రంథములకువలె జనములోనికి చొచ్చుకొనిపోవు. అందువల్ల ఇట్టి రచనలొకటి రెండింటితో వెనుకబట్టును. ఇంత క్లిష్టమైన మార్గమును ఎన్నుకొన్న శ్రీ రఘుమారెడ్డిగారి ఆత్మవిశ్వాసము ప్రశంసనీయముగానున్నది. 'విప్లవం, అభ్యుదయం' జానపదప్రక్రియలద్వారానే సులభసాధ్యమని సుస్థిరమని నా అనుభవపాఠం' 'శిష్టవ్యావహారికభాష ఇంకా అచ్చమైన వ్యావహారికభాషకాదని అభిప్రాయం' ఇంత నిశ్చయబుద్ధితో ప్రవర్తించు రచయిత నిజాయితీని శంకింపరాదు.

ముత్తినాయిక. ముత్తిమగడు నాయకుడు. జానపద నాయకుడు నాయికకు బావగాని మామగాని యగును. ముత్తికి ముత్తిమగడు బావ. స్త్రీ పురుష విషయికమైన శృంగారప్రవృత్తిని కొంత తాత్త్వికగర్భముచేసి కవి ప్రవర్తింపజేసినాడు. ఈ రెండు భావములకు ఒదిగినంత సొగసుగా జానపదజీవితము అన్యభావములకు ఒదుగదు. ముత్తిఅనగా ముక్తియని. జీవుడు ముక్తికాంత నెనయుటగా ఇందలి నాయికానాయకుల ప్రవృత్తిని భావించుట అంతదోషము కాదనియే చెప్పవచ్చును. ఇది కరుణరసాత్మకముగా పరిణమించినది. శృంగారమునుండి కరుణము మంచిప్రౌఢమైన పద్ధతియే. ముత్తి నాయకుని వదలిపోవుటకు కవి కల్పించిన కారణమింత అనివార్యమైనదిగాలేదు. మరియు సహజసుందరముగాగూడలేదు.

శ్రీ రఘుమారెడ్డిగారుమంచిభావయిత్రీశక్తికలవాడు. జనపదవీధులభాష దాని యాసలతోసహా ఈయన ముఖతః ఆవిష్కరింపకొన్నది. ఇది చదివి మెచ్చవలసినవారు నాగరకులుగదాఅని చాలమాటలకు నాగరక రూపాంతరములను అర్థములను కవి సమకూర్చినాడు. ఈ పాటలు చదువుటకు అలవాటై యుండవలసిన గమకములు అలవాటుకానిచో ఇది చదువుకొనరాదు. అయినచో దీని సొగసు తెలియును. శ్రీ రఘుమారెడ్డిగారి ప్రయత్నము ద్వ్యర్థికావ్యములు, అచ్చతెనుగు కావ్యములు వ్రాసిన కవులకు తీసిపోదు. సాహిత్య రసాస్వాదనపరుల కిదియొక క్రొత్త చషకము.

## ఇంద్రచాపం

(రచన: శ్రీ రుద్రశ్రీ. ప్రతులకు: ఆంధ్ర విశ్వసాహితి, 208 న్యూబోయిగూడ, సికింద్రాబాదు. మూల్యము: ఒకరూపాయి.)

ఇది ఒట్టి ప్రకృతి వర్ణనాత్మకమైన కావ్యము. ఇంద్రచాపమును ఆధారము చేసికొని అందలి వర్ణములను అచ్చువేయుటలోగూడ చూపించుచు, రచించిన గ్రంథము. మరియు నీ రచనా విధానము కేవలము వచన కవితారీతిగాక మాత్రానియమానుసారియై ధారాళముగా నున్నది. ఇది సామాజిక ప్రయోజనవాదకవిత కాదు. అందరు కవులును అటే వ్రాయువలయునని ఏమీలేదు. కవికి ఏదోఒక తాత్త్విక దృక్పథము నిర్దుష్టముగానే ఉన్నది. ఇంద్రచాపము ఈనాడెట్లున్నదో అది పుట్టిన మొదటినాడును అట్లేయున్నది. అది సప్త వర్ణాత్మకము. ఈ సృష్టియైన ప్రపంచము క్షణక్షణము మారిపోవుచున్నదన్న అవగాహన సమాజమునం దెక్కువగా నున్నది. మారెడు దానితోపాటు మారనిదికూడ ఒకటి కలదు. ఆ పరమార్థమును ప్రకటింపగోరి కవి ఈ కృతిని రచించెను. మారెడునదంతయు మానవజాతిది. మారనిది దైవసంబంధమైనది. దైవముకలడు. ఆయన ఎప్పుడును కలడు. ఆయన నుండియే బహువర్ణాత్మకమైన ఈ జగత్తు. ఈ జగజ్జీవన మొక హరివిల్లు. అది రంగులమయము. దాని రహస్యము తెలియక జనత సుఖదుఃఖము లనుభవించుచున్నది. తెలిసినచో ఆనంద మొక్కటియే. ఏ తదభిలాషముతో శ్రీ రుద్రశ్రీగారు

ఇంద్రచాప కావ్యమును సరసముగా రచించినారు. శ్రద్ధగా కవితాభిమానులు చదువవలయును. పుస్తకము చాలచిన్నదేకాని గుణము కలది.

## చైతన్యజ్వాల

(వచనకవితా సంకలనం)

(ప్రచురణ : ఆంధ్రసారస్వతసమితి, మచిలీపట్టణం. మూల్యము : రు. 2—50.)

ముప్పైవచన కవితాఖండికలు ముప్పైమంది రచించినవి సంపుటీకరింపబడగా ఈకవితా సంకలనము సిద్ధమైనది. వచన కవితా సంకలన గ్రంథాలు వరంగల్లు, నల్గొండల నుండి విరివిగా ప్రచురింపబడుటను చూచినమీదట తామీ ప్రయత్నము చేసినట్లు సమితి కార్యవర్గమువారు చెప్పుచున్నారు.

కవిత్వమును వచనము కానీయక వచన కవిత్వముగా వ్రాయుట ఒకరచనా రీతి. అది ఈనాడు ముఖ్యముగా యువతరమువారికి మిక్కిలి అనుకూలముగా సాగుచున్నది. ఈనాడు సాధారణముగా కవితావస్తువు అభ్యుదయ భావము. అనగా మార్క్సిజము వగైరా. ఈదృశమైన సాంఘిక రాజకీయ చైతన్యము లేకుండ ఈనాటి యువకవులు లేరు. అందువల్ల కవితావస్తువుగా అది ఎక్కువ చెలామణిలో నున్నది. మొత్తముమీద ఈనాడు కొనసాగుచున్న సామాజిక రాజకీయ వ్యవస్థ చాలమందికి యిష్టముకాదు. మార్పురావలె. ఆ మార్పు నుద్దేశించియే ఈ సంకలనమున అందరుకవులును రచనలు చేసిరి. శ్రీ కుందుర్తి చెప్పినట్లు 'ఇలా చెప్పవలసి వస్తే ప్రతిఖండికనూ పేర్కొనవలసి వస్తుంది. ఎందుకంటే దేని ప్రత్యేకత దానికుండటంవల్ల.' అందువల్ల సంకలనం యావత్తు బాగున్నది.

— క్షేమేంద్ర

---

Printed and Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7 Thambu chetty Street, Madras-1. Editor : S. Sambhu Prasad.